**పూజ్యశ్రీశ్రీశ్రీ దయానందగిరిస్వాములవారు**

శ్రీధ్యాననిష్ఠాశ్రమము, పోస్టు : గాగిల్లాపురం,

మం॥ బెజ్జంకి, జి॥ కరీంనగర్ - 505 528.





**వేదాంతగోష్ఠి**

అనువాదకులు : **శ్రీ రామకృష్ణానందగిరి స్వాములవారు**

ప్రతులు : **1000**

వెల : **రూ॥ 50/-**



భాషాదోషముల సవరణ : **అంకం రాములు,** ఆధ్యాత్మిక ప్రచారకులు, నిర్మల్
సెల్ : 9848472677

గ్రంథప్రాప్తిస్థానం : శ్రీధ్యాననిష్ఠాశ్రమము, పోస్టు : గాగిల్లాపురం,
మం॥ బెజ్జంకి, జి॥ కరీంనగర్ - 505 528.



శ్రీ మలయాళస్వామివారు

# ఓమ్
# దైవప్రార్థన



శ్రీ దయానందగిరి
స్వాములవారు

1. ఓ దయామయుడవగు సర్వేశ్వరా! మా వాక్కు చేతను, మనస్సు చేతను, కాయముచేతను, ఏ విధమైన క్లేశమున్ను, ఇతర ప్రాణికి గలుగనీయక సదా యుండే లాగున అనుగ్రహింపుము!

2. ఓ కారుణ్యైకసింధో! మా వాక్కు చేతను, మనస్సు చేతను, కాయముతో కూడిన క్రియలచేతను, సర్వకాల సర్వావస్థలయందును ప్రపంచములో గల సకల ప్రాణికోట్లకు ఉపకారము చేసేలాగున ఆశీర్వదింపుము!

3. ఓ జ్ఞానైకమూర్తీ! పరమేశ్వరా! మా యందు జాగ్రతవస్థయందుగాని, స్వప్నావస్థయందుగాని, సుషుప్త్యవస్థయందుగాని, ఈ మూడింటికి హేతువులైన స్థూల సూక్ష్మకారణ శరీరములలో గాని, ఏలాటి విషయ దోషములున్ను, చెడు సంకల్పములున్ను గలుగక యుండేలాగున ఆశీర్వాదము చేయుము!

4. ఓ శాంతి నిలయా! పరమ పావనపుణ్యమూర్తీ! మాపై నెవరైన నిందలు మోపినను, అపకారములు చేసినను, నిరుత్సాహము గలుగజేసినను, వాటినన్నిటిని సహించుకొని, వారి దుష్కృత్యములకు వగచుచు, మానిశ్చయ దైవకార్యమగు లక్ష్యము నుండి మనస్సును కొంచెమైనను చలింపనీయక సదా యుండేలాగున అనుగ్రహింపుము! అనుగ్రహింపుము!!

**ఓం న త్వహం కామయే రాజ్యం న స్వర్గం నాపునర్భవమ్।**
**కామయే దుఃఖతప్తానాం ప్రాణినామార్తినాశనమ్॥**





ఓమ్

(మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వాములవారు)

# అనుమతి పత్రము

## పూజ్యపాద శ్రీశ్రీశ్రీ దయానందగిరి స్వాములవారికి

## ఓం నమోనారాయణాయ

నేను రచించిన "వేదాంతగోష్ఠి" అను గ్రంథమును మీరు పునర్ముద్రణము చేసుకొనుటకు అనుమతి, అధికారం ఈ లేఖద్వారా ఇచ్చుచున్నాను. మీరు ముద్రింపజేసి భక్తులకు సంతృప్తిని కల్గించండి.

ఇట్లు
మీ
**శ్రీ రామకృష్ణానందస్వామి**
శ్రీ భూమానందాశ్రమం
గండిక్షేత్రం, కడప జిల్లా.

# అనుమతి ప్రతము

శ్రీ అంకం రాములు, నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా గారికి

ఓం నమోనారాయణాయ

పూజ్యశ్రీశ్రీశ్రీ రామకృష్ణానందస్వాములవారు తెలుగులో అనువదించిన వేదాంతగోష్ఠి అను గ్రంథమును పునర్ముద్రణ చేయుటకు అనుమతిచ్చారు. తృతీయ, చతుర్థ ముద్రణలు చేసియుంటిమి గ్రంథములు అయిపోయినందున ఈ గ్రంథంను మీరు పునర్ముద్రణము చేసుకొనుటకు అనుమతి, అధికారం ఈ లేఖ ద్వారా ఇచ్చుచున్నాను. మీరు ముద్రించి భక్తులకందజేయగలరు.

దయానందస్వామి
**శ్రీ దయానందగిరిస్వాములవారు**
శ్రీ ధ్యాననిష్ఠాశ్రమము
పోస్టు : గాగిల్లాపురం, మం॥ బెజ్జంకి,
జిల్లా కరీంనగర్ - 505 528.

# తొలిపలుకులు


అంకం రాములు

శ్రీ గోపాలదాసుజీ మహారాజ్ విచారసాగరం, వేదాంత పంచదశి, వృత్తి ప్రభాకరం, యోగవాసిష్ఠం, భగవద్గీత, విచారచంద్రోదయం, విచారమాల పంచీకరణం, వేదాంత మార్గోపదేశిక మొదలైన గ్రంథాలలోని విషయాలు సేకరించి "వేదాంతమార్గదర్శిని" అను గ్రంథాన్ని గుజరాతి భాషలో రచించారు.

శ్రీరామకృష్ణానందస్వాములవారు గుజరాతిభాషలో ఉన్న గ్రంథాన్ని ప్రజలు చదివేందుకు సులభశైలిలో గురుశిష్య సంవాద రూపంలో తెలుగుభాషలో అనువదించి "వేదాంతగోష్ఠి" అని నామకరణం చేశారు. అనేక వేదాంత ప్రకరణలు గ్రంథాలలోని విషయాలు ఇందులో సంగ్రహింపబడినవి. శ్రీ దయానందగిరి స్వాములవారు నోట్‌బుక్కులో వ్రాసుకొన్న వేదాంత ప్రక్రియలు ఈ గ్రంథంలో పొందుపరచడం జరిగింది.

శిష్యులు ఈ గ్రంథంవల్ల వేదాంతజ్ఞానం పొందుతారని భావించి శ్రీదయానందగిరి స్వాములవారు 1978 సంవత్సరంలో 1000 పుస్తకాలు, 1980 సంవత్సరంలో 2000 పుస్తకాలు ముద్రించారు. ప్రస్తుతం ఇట్టి గ్రంథాలు కనుమరుగైనందున శ్రీస్వాములవారు ఇలా అన్నారు. "వేదాంతగోష్ఠి" పుస్తకాలు అయిపోయినాయి మళ్లి అచ్చువేయించు, ఈ పుస్తకం శిష్యులకు ఎంతో ఉపయోగపడుతుంది" అని అన్నారు. శ్రీస్వామి ఆజ్ఞానుసారం 1000 గ్రంథములు ముద్రించడం జరిగింది.

ముద్రణ సమయంలో అన్నపానీయాలు, ఆశ్రయం ఇచ్చిన శ్రీస్వామి ప్రథమ శిష్యులు శ్రీకుసుమ రాజమల్లయ్య, వారి ధర్మపత్ని శ్రీమతి సరస్వతమ్మగారికి శిరస్సాష్టాంగ నమస్కారములు తెలుపుతున్నాను.

హరిః ఓం తత్సత్ ఓం

**అంకం రాములు**
ఆధ్యాత్మిక ప్రచారకులు
ఇ.నెం. 03-01-138, బేస్తవార్‌పేట్ వీధి,
నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా - 504 106
సెల్ : 9848472677

ఓం

# శ్రీ గురుపరమ్పరా స్తోత్రమ్

ఓం నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తితాపసం।
పరాశరం చ తత్పుత్రం వ్యాసం వేదాబ్జభాస్కరమ్॥

ఓం విరక్తం శ్రీశుకం దేవం జ్ఞానవైరాగ్యరూపిణం।
గౌడపాదం చ గోవిన్దం యోగీన్ద్రం జ్ఞానినాం వరమ్॥

ఓం తచ్ఛిష్యం శంకరాచార్య మద్వైతస్థాపకం గురుం।
తచ్ఛిష్యాన్పద్మపాదాదీన్ శ్రౌతతత్త్వార్థబోధకాన్॥

ఓం అసఙ్గానన్దగుర్వాదీనస్మద్గురువరాన్పరాన్
సమ్భిన్నాజ్ఞానతమసో వన్దే జ్ఞాన ప్రదాయినః॥

ఓం శ్రీ నారాయణ గుర్వాద్యాం శివలిఙ్గార్య మధ్యమాం।
అసఙ్గానన్దపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్॥

ఇతి శ్రీ గురుపరమ్పరా స్తోత్రమ్

## విషయసూచిక

## మనుష్యమృగాది భేద నిర్ణయము

**1. అండజ : గ్రుడ్డు నుండి పుట్టినవి పక్షి, పాము మున్నగు జాతులు..... 21 లక్షలు**

**2. పిండజ : మావి నుండి పుట్టినవి జంతు, మనుష్యజాతులు............ 21 లక్షలు**

**3. స్వేదజ : మైల నీళ్లు, చెమటనుండి పుట్టిన క్రిమికీటక జాతులు ....... 21 లక్షలు**

**4. ఉద్భిజ : భూమి నుండి పుట్టినవి వృక్షజాతులు............................ 21 లక్షలు**

**మొత్తము 84 లక్షలు**

## యుగములు

| | |
|---|---|
| కృతయుగం................................. | 1728000 సం॥లు |
| త్రేతాయుగం ................................ | 1296000 సం॥లు |
| ద్వాపరయుగం ............................. | 864000 సం॥లు |
| కలియుగం .................................. | 432000 సం॥లు |
| మొత్తం ....................................... | **43,20,000** సం॥లు |



पंडित पीतांबर पुरुषोत्तमजी॥



# వేదాంత గోష్ఠి

## మొదటి ఘట్టం – సాధన విచారము.

**శిష్యుడు :** స్వామీ! పురుషార్థమనగా యేమి?

**గురువు :** పురుష + అర్థము = పురుషార్థము. పురుషులనగా జీవులు. పురుషులందరూ కోరే విషయాన్ని పురుషార్థమంటారు.

ఆ పురుషార్థాన్ని శాస్త్రకారులు నాల్గుగా విభజించారు ధర్మము, అర్థము, కామము, మోక్షమంటూ వాటి పేర్లు. అందులో మొదటి మూడింటిని "ప్రేయ"స్సంటారు. నాల్గో పురుషార్థాన్ని "శ్రేయ"స్సంటారు. మొదటి మూడైన ధర్మార్థ కామాలను గౌణపురుషార్థాలని, చివరిదైన మోక్షాన్ని ముఖ్యపురుషార్థమని చెప్పటకద్దు. ఈ ఘట్టంలోని విషయం ఆ ముఖ్యపురుషార్థాన్ని గురించే. శ్రేయస్సు అనబడే మోక్ష జీవుని పురుషార్థంతో లభ్యమయ్యేదే. వివేకం కల్గిన జీవులు కేవలం ప్రేయస్సు (ధర్మార్థ కామాల)ను సంపాదించి ఊరుకోరు. శ్రేయస్సు (మోక్షము)ను సంపాదించి కాని వారి ప్రయత్నం ఆగదు.

రోగపీడితునికి పెరుగు తినాలనిపిస్తుంది. దానివల్ల వానికి శ్రేయంలేదు. మందు తినాలంటే వానికి అప్రియం. కాని అదే వానికి ఆరోగ్యమనే శ్రేయం కల్గిస్తుంది.

అలాగే సంసారంలో జనన మరణరూప భవరోగంతో పీడించబడే జీవునికి విషయభోగాలంటే ప్రియంగా ఉంటాయి. కాని వాటివల్ల వాడు శ్రేయం (మేలు) పొందలేడు. విషయ భోగాలనుండి చిత్తవృత్తులను మళ్లించడమంటే వానికి యిష్టం ఉండదు. అయితే యింద్రియ నిగ్రహమే భవరోగానికి పరమౌషధమని, తద్వారానే జీవునికి శ్రేయస్సు లభిస్తుందని శాస్త్రకారుల తీర్మానం.

**శ్లో॥ యేహి సంస్పర్శజా భోగా - దుఃఖయోనయ ఏవతే।**
**ఆద్యంతవంతః కౌంతేయ! న తేషు రమతే బుధః॥** (గీత 5-22)

"ఇంద్రియ విషయ సంయోగంతో యేర్పడే భోగాలు దుఃఖాన్ని కల్గించేవి. వాటికి ఆది అంతాలున్నాయి. వివేకియైన జీవుడు వాటిలో తగుల్కోరాదు." అని భగవద్గీతలో భగవంతుడు బోధించాడు.

**శిష్యుడు :** పురుషులందరూ కోరే విషయమంటిరే, అది ఏది?

**గురువు :** సర్వవిధ దుఃఖముల ఆత్యంతిక నివృత్తిని, పరమానంద స్వరూప పరమాత్మ ప్రాప్తిని పురుష (జీవు)లందరూ కోరుతున్నారు.

నివృత్తి అనేది రెండు విధాలు. కార్యము కారణములో లయించుట ఒకవిధమైన నివృత్తి. ఇది సాధారణ నివృత్తి, చక్కెరతో తయారైన బొమ్మలు పగిలి పొడియై తిరిగి చక్కెర (పంచదార)లో కలుస్తాయి. ఇది కార్యము కారణములో లయమగుట. దీన్నే సాధారణ నివృత్తి అంటారు. కారణమైన చక్కెర ఉంటే మళ్లీ కార్య రూపములైన బొమ్మలు తయారయ్యే అవకాశం వుంది.

రెండో విధమైన నివృత్తి. కార్యము కారణ సహితముగా నివృత్తియగుట. దీన్ని ఆత్యంతిక నివృత్తి అంటారు. పంచదారబొమ్మలను పాలల్లోనో నీళ్లల్లోనో కలిపి త్రాగితే కారణంతో సహాకార్యం (పంచదారతో సహా బొమ్మలు) ముగిసిపోయింది. దీన్ని ఆత్యంతిక నివృత్తి అంటారు.

అధిష్ఠాన వస్తు సంబంధమైన అజ్ఞానమే యీ నా నా నామరూప కల్పిత వస్తువులన్నింటికీ కారణమై వుంది. కాబట్టి అధిష్ఠానం జ్ఞానంవల్లనే కారణమైన అజ్ఞానంతో సహా కల్పిత కార్యనివృత్తి సిద్ధిస్తుంది. అట్లుగాక కార్యము కారణములో లయించుట అనే సాధారణ నివృత్తి అధిష్ఠాన జ్ఞానంతో పనిలేకనే కల్గుతుంది.

స్థూల, సూక్ష్మ శరీరాలు కార్యాలు వీటికి కారణం అజ్ఞానం. ఆత్మయొక్క విశేష స్వరూప జ్ఞానంతో అజ్ఞాన నివృత్తి కల్గుతుంది. కారణమైన అజ్ఞానం నివర్తిస్తే కార్యాలైన శరీరాలు నివృత్తి అయినట్లే. అంతట సర్వ దుఃఖ నివృత్తి చేకూరుతుంది.

**శిష్యుడు :** సర్వదుఃఖాల ఆత్యంతిక నివృత్తి, పరమానందప్రాప్తి అనువీటితో యేమి లభిస్తుంది?

**గురువు :** మోక్షము లభిస్తుంది. శ్రేయస్సు సిద్ధిస్తుంది. సర్వదుఃఖ ఆత్యంత నివృత్తి పరమానంద స్వరూప పరమాత్మని ప్రాప్తి యిదియే మోక్షము యొక్క స్వరూపం.

మోక్షమనే మాటకు ఆయా సంప్రదాయాలవారు భిన్న భిన్నమైన అర్థం చెబుతారు. స్వర్గ వైకుంఠ కైలాసాది లోకాలను చేరుటే మోక్షమని కొందరి అభిప్రాయం. వారి ముక్తికూడా రకరకాలు. ఆ ముక్తి సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములని నాల్గు విధాలు రాజుగారి నగరంలో నివసించినట్లు తన యిష్ట దేవతాలోకం చేరి వసించుట సాలోక్యముక్తి. రాజుగారి సన్నిధిలో సన్నిహిత పరిచారకునివలె, తన యిష్టదేవతా సమీపంలో ఉండుట సామీప్యముక్తి. ఇష్టదేవతతో సమానమైన రూపాన్ని ధరించి వుండుట సారూప్యముక్తి, రాజుగారి పట్టపు కుమారునివలె పరమేశ్వరునితో సమానముగా సత్యసంకల్పాది సర్వవిభూతులను పొందివుండుట సాయుజ్యముక్తి, ఇది నిర్వాణదాయకమైన ముక్తి, దీనినే "సార్ష్టి" ముక్తి అనికూడ అంటారు. ముందటి మూటికంటె యిది శ్రేష్ఠం.

లోకాంతరాలలోని ముక్తి అనిత్యమైనది. **"క్షీణే పుణ్యేమర్త్యలోకం విశంతి"** అని భగవద్గీతలో భగవంతుడన్నట్లు పుణ్యసంభారం సమసిపోగానే ఎప్పటి చోటు చేరుకోవలసిందే. వేదాంతమతరీత్యా ఇది యథార్థమైన ముక్తి కాదు. వేదాంతులు కైవల్యముక్తిని అంగీకరిస్తారు. ఆ కైవల్యముక్తిని బొందినవాడు శ్రుతి చెప్పినట్లు **"నస పునరావర్తతే"** తిరిగిపుట్టదు. మర్త్యలోక దర్శనం మరి వానికి లేదు. కాబట్టి యింతకు ముందు చెప్పినట్లు పరమాత్మని ప్రాప్తి" ఇదే వేదాంత మతానుకూలమైన ముక్తి.

**శిష్యుడు :** మోక్షము దేనిద్వారా కల్గుతుంది?

**గురువు :** బ్రహ్మజ్ఞానము ద్వారా కల్గుతుంది.

**శిష్యుడు :** కర్మలతో, ఉపాసనలతో మోక్షం కల్గదా?

**గురువు :** కల్గదు. మోక్షము జ్ఞానంతో తప్ప కర్మలతో ఉపాసనలతో కల్గదు. అయితే, ఈ కర్మోపాసనల నాచరించడంతో జ్ఞానానికి సాధనాలైన చిత్తశుద్ధి చిత్త ఏకాగ్రతలు సిద్ధిస్తాయి. అవి సిద్ధించిన వానికి జ్ఞానసిద్ధి సులువు.

సకామకర్మ అని నిష్కామకర్మ అని కర్మ రెండు విధాలు. శాస్త్ర విహితమైన సకామ కర్మలు చేసినవాడు దాని శుభఫలాన్ని అనుభవించేటందుకై పుణ్యలోకాలకు పోతాడు. శాస్త్రవిహిత సత్కర్మలను నిష్కామంగా చేసిన వానికి అంతఃకరణ శుద్ధి కల్గుతుంది. చిత్తంలోని మలదోషంపోయి అంతఃకరణ శుద్ధి కల్గిన తర్వాత చిత్తంలోని చంచలతా (విక్షేప) దోషనివృత్తికై అతడు ఉపాసన, చేయాలే.

ఉపాసన, ప్రతీకోపాసన అహంగ్రహోపాసన, అని రెండు విధాలు, తన యిష్టదైవాన్ని తనకంటె భిన్నంగా తలచి చేసే ఉపాసన ప్రతీకోపాసన. తన యిష్టదైవాన్ని తనకు అభిన్నంగా – ఏకరూపంగా భావించి చేసే ఉపాసన అహం గ్రహోపాసన. ఈ అహంగ్రహోపాసన మనస్సులోని చాంచల్యాన్ని నశింపజేసి స్వస్వరూప చైతన్యావస్థితికి ప్రాముఖ్యమై ఉంటుంది. కాబట్టి ఇది శ్రేష్ఠమైన ఉపాసనగా పరిగణిస్తారు.

బాహ్యాంతరాలలో సందు లేక పరమాత్మ ఉన్నాడని 'కనుమూసిన కనుదెరచిన' బ్రహ్మ భావననే అవలంబించి ఉండుట ఘనమైన ఉపాసన. ప్రీతముడనే గుజరాతీ ఈ మాట చెప్పాడు. ఈ ఉపాసనతో అంతఃకరణంలోని మలదోషము విక్షేపదోషము నివృత్తి చెందుతాయి.

కంటికిగల తిమిరాది దోషాలను అంజనం వగైరా చికిత్సలతో పోగొట్టినప్పుడు నిర్దోషనమైన నేత్రం వస్తు స్వరూపాన్ని స్పష్టంగా చూడగల్గుతుంది. అట్లే నిష్కామ కర్మలతోనూ, ఉపాసనలతోనూ అంతఃకరణ నిర్మలము, యేకాగ్రము అయి తదుపరి ఆత్మస్వరూప యథార్థ జ్ఞానాన్ని పొందవలసిన ఉంటుంది. మలవిక్షేపదోషాలు తొలిగిన తర్వాత మిగిలిన ఆవరణదోషం బ్రహ్మజ్ఞానంతో నశిస్తుంది.

**శిష్యుడు :** బ్రహ్మజ్ఞానమనగా ఏమి? అది ఎన్ని విధాలు?

**గురువు :** బ్రహ్మస్వరూపాన్ని ఉన్నదున్నట్లు తెలుసుకొనుటే బ్రహ్మజ్ఞానము. అది 1పరోక్షమని 2.అపరోక్షమని రెండు విధాలు.

**శిష్యుడు :** పరోక్ష బ్రహ్మజ్ఞానమంటే యేమి?

**గురువు :** బ్రహ్మము సత్తు చిత్తు ఆనంద (సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ) స్వరూపమని తెలుసుకొనుట పరోక్ష బ్రహ్మజ్ఞానము. **"తత్త్వమసి"** మహావాక్యంలోని "తత్" శబ్దముయొక్క అర్థాన్ని యీ జ్ఞానం సూచిస్తుంది. కాబట్టి యిది అపరోక్ష అద్వైత జ్ఞానానికి సహకారిగా ఉంటుంది.

ఉదాహరణ వినుము. ఒకానొక సభలో పలువురు జనులున్నారు. అందులో శివశంకరుడనే మనిషితో నీకు పనిఉంది. "శివశంకరుడున్నాడా" అని వాళ్ళను అడిగావు. "ఆ ఉన్నా"డని జవాబు వచ్చింది. ఆ శివశంకరుడున్నాడనే జ్ఞానం నీకు కల్గింది. ఇదే పరోక్షజ్ఞానం ఈ పరోక్షజ్ఞానం అపరోక్షజ్ఞానం ప్రాప్తికి ఉపయోగిస్తుంది.

**శిష్యుడు** : పరోక్షబ్రహ్మాజ్ఞానం దేంతో కలుగుతుంది?

**గురువు** : సత్య శాస్త్రాలయందు సద్గురు వాక్యాలయందు కల విశ్వాసంతో పరోక్ష బ్రహ్మాజ్ఞానం కల్గుతుంది.

**శిష్యుడు** : పరోక్ష బ్రహ్మాజ్ఞానం వలన కలిగే ప్రయోజనంయేమి?

**గురువు** : అసత్వాపాదక ఆవరణ నివృత్తి సిద్ధిస్తుంది. "బ్రహ్మము లేదు" అనెడి అసత్ భావనను కల్గించే ఆవరణాన్ని అసత్వాపాదక ఆవరణమంటారు.

**శిష్యుడు** : పరోక్ష బ్రహ్మాజ్ఞానానికి పూర్తి ఎప్పుడు?

**గురువు** : బ్రహ్మానిష్ఠుడైన సద్గురువు వచనాలను వేదాంతశాస్త్ర వాక్యాలను బట్టి బ్రహ్మాస్వరూప నిర్ణయం చేసుకొనగలిగినప్పుడు పరోక్షబ్రహ్మాజ్ఞానానికి పూర్ణమైన అవధి.

**శిష్యుడు** : అపరోక్ష బ్రహ్మాజ్ఞానమంటే యేమి?

**గురువు** : సచ్చిదానంద స్వరూపబ్రహ్మమే నేను. **(అహం బ్రహ్మాస్మి)** అనే జ్ఞానమే అపరోక్షబ్రహ్మాజ్ఞానము.

**శిష్యుడు** : అది దేనితో కల్గుతుంది?

**గురువు** : సద్గురుముఖంగా తత్త్వమస్యాది మహా వాక్యాలను శ్రవణం చేయడంతో అపరోక్షబ్రహ్మాజ్ఞానం కల్గుతుంది.

**శిష్యుడు** : ఆ అపరోక్షబ్రహ్మాజ్ఞానం ఎన్నివిధాలు?

**గురువు** : అదృఢమని, దృఢమని రెండువిధాలు.

**శిష్యుడు** : అదృఢాపరోక్ష బ్రహ్మాజ్ఞానమంటే యేమి?

**గురువు :** జీవబ్రహ్మాలు ఒక్కటే అను జ్ఞానం ఉన్నప్పటికి, ఆ జ్ఞానం అసంభావనా విపరీత భావనలతో కూడి ఉన్నప్పుడు దానిని అదృఢ అపరోక్ష బ్రహ్మజ్ఞానమంటారు.

అసంభావన అంటే సంశయము. అది ప్రమాణగత సంశయమని, ప్రమేయగత సంశయమని రెండు విధాలు. ప్రమాణమనగా వేదాంతశాస్త్రం. ఆ వేదాంతశాస్త్ర సంబంధమైన సంశయాన్ని ప్రమాణగత సంశయమంటారు. అనగా "వేదాంతశాస్త్రాలు జీవబ్రహ్మల భేదాన్ని ప్రతిపాదిస్తాయా? అ భేదాన్ని ప్రతిపాదిస్తాయా?" ఈ విధమైన సంశయాన్ని ప్రమాణగత సంశయమంటారు. "జీవబ్రహ్మల భేదము సత్యమా? అ భేదము సత్యమా?" ఈ విధమైన సంశయాన్ని ప్రమేయగత సంశయమంటారు.

విపరీతభావన అంటే "జీవబ్రహ్మల భేదమే సత్యం. జీవుడెప్పుడూ బ్రహ్మంకాలేడు ఈ దేహాది ప్రపంచం సత్యమైందే" అని యీ విధమైన విరుద్ధ నిశ్చయం కల్గి ఉండుటే విపరీతభావన. ఈ భావన (ఇంద్రియదోషాద్వా సంస్కార దోషాద్వా) యింద్రియ దోషంతోనో సంస్కార దోషంతోనో యేర్పడుతుంది.

**వేదాంతములు :** వేదముయొక్క అంతిమభాగంగా ఉండే ఉపనిషత్తులను వేదాంతములంటారు. లేదా, వేదమనగా జ్ఞానం; అంతమనగా నిర్ణయం. సిద్ధాంతమైన జ్ఞానమునే వేదాంతమంటారు.

**ప్రమాణము - ప్రమేయము :** జ్ఞానం కల్గేందుకు నేత్రాది యింద్రియాలు సాధనాలుగా ఉన్నాయి. సాధనాలను శాస్త్రభాషలో "కరణాలు" అని కూడా అంటారు. వీటితో ప్రత్యక్షజ్ఞానం కలుగుతుంది. కాబట్టి యింద్రియాలను ప్రమాణాలంటారు. కొన్ని కొన్ని యెడల కార్యాన్నిబట్టి కారణాన్ని నిశ్చయించటం ఉంటుంది. అగ్ని ద్వారా పొగ కల్గుతుంది. కార్యమైన పొగను చూచి కారణమైన అగ్నిని అనుమానించ (ఊహించ) గల్గుతాము. దీన్ని అనుమాన ప్రమాణమంటారు. కొన్ని విషయాలకు చెందిన జ్ఞానం వేదశాస్త్రాలకు తప్ప తక్కిన ప్రమాణాలకు అందదు. కాబట్టి వేదంకూడ ఒక ప్రమాణమే. దాన్ని శబ్దప్రమాణమంటారు. యీ విధంగా ప్రమాణాలు, ప్రత్యక్ష అనుమాన శబ్ద ఉపమాన అర్థాపత్తి అనుపలబ్ధి అని ఆరింటినిగా చెబుతారు.

ప్రమాణాల ద్వారా తెలియదగి ఉండు మోక్షం మొదలైన పదార్థాలను

ప్రమేయమంటారు.

**శిష్యుడు :** ఏయే కారణాలతో, అపరోక్ష బ్రహ్మజ్ఞానం దృఢం కాకుండా అదృఢంగా ఉండిపోతుంది?

**గురువు :** గురుముఖతః తత్త్వమస్యాది మహావాక్యాలను శ్రవణం చేసినా కూడా, క్రింది కారణాలనుబట్టి అపరోక్ష బ్రహ్మజ్ఞానం అదృఢంగానే ఉండిపోతుంది.

(1) అంతఃకరణంలోని మలదోషం, విక్షేపదోషం పూర్తిగా తొలిగిపోకపోవుట.

(2) **"బ్రహ్మము అద్వైతము"** అనే సిద్ధాంతంలో సంశయం కల్గి ఉండుట.

(3) భేదవాదులైన పామరజనుల సంసర్గంతో వారి సంస్కారాలే తన అంతఃకరణంలో నిలబడి వుండుట.

**శిష్యుడు :** ఈ అదృఢాపరోక్ష బ్రహ్మజ్ఞానికి ఫలమేమి?

**గురువు :** (1) కామ్యబుద్ధి శేషించి ఉన్న పక్షములో యీ దేహాన్ని వదలిన పిమ్మట ఉత్తమ లోకాలను బొంది తిరిగి పవిత్రులైన శ్రీమంతుల యింటిలో జన్మిస్తాడు. (2)కామ్యబుద్ధి నిశ్శేషమై నిష్కామ భావం కలవాడైన పక్షంలో జ్ఞానుల సంప్రదాయంలో ఆవిర్భవిస్తాడు. ఈ విషయం గీతలో ఆరో అధ్యాయంలో నలభై రెండవ శ్లోకంలో చెప్పబడింది.

**శ్లో॥ అథవా యోగినామేవ, కులేభవతి ధీమతామ్।**
**ఏతద్ధి దుర్లభతరం, లోకే జన్మ యదీదృశమ్॥**

తా॥ అనుష్ఠాన తత్పరుడై సిద్ధిని పొందకముందే శరీరంను విడచిన యోగి జ్ఞానవంతుడైన యోగులయొక్క వంశంనందే జన్మించుచున్నాడు. అయితే ఈలాంటి జన్మము ఈ లోకంనందు మిక్కిలి అరుదైనది.

**శిష్యుడు :** అదృఢాపరోక్ష బ్రహ్మజ్ఞాన సంపూర్తికి సమయమేది?

**గురువు :** బ్రహ్మము సచ్చిదానందాత్మక లక్షణాలతో కూడిందని, ఆ లక్షణాలకు (విశేషణాలకు) సంబంధించిన అపరోక్షజ్ఞానం గల్గినప్పటికి, అంతఃకరణంలో సంశయ

విపరీత భావనలు తొలగిపోకపోతే, అదృఢాపరోక్ష బ్రహ్మజ్ఞానం సంపూర్ణ స్వరూపంతో ఉందనే తెలుసుకోవాలె.

**శిష్యుడు :** దృఢాపరోక్ష బ్రహ్మజ్ఞానమంటే యేమి?

**గురువు :** అసంభావనా (సంశయం) విపరీతభావనలు తొలగి ఆత్మ బ్రహ్మలయొక్క యేకత్వనిశ్చయం కల్గినప్పుడు దృఢాపరోక్ష బ్రహ్మజ్ఞానం సిద్ధించిందంటు తెలుసుకోవాలె.

**శిష్యుడు:** అది యేవిధంగా సిద్ధిస్తుంది?

**గురువు :** సద్గురు ముఖంగా **"తత్వమస్యాది"** వాక్యాలను అర్థసహితంగా శ్రవణం చేయాలె. శ్రవణం చేసిన విషయాన్ని విచారపద్ధతిలో మననము నిది ధ్యాసము చేయాలె. అలా చేయుటతో దృఢాపరోక్ష బ్రహ్మజ్ఞానం సిద్ధిస్తుంది.

వేదాంత వాక్యాలు, మహావాక్యాలని అవాంతరవాక్యాలని రెండురకాలు. జీవబ్రహ్మల యొక్క యేకత్వాన్ని బోధించే వేదవాక్యాలను మహావాక్యాలంటారు. అవి నాలుగు 1)తత్త్వమసి = అది నీవై ఉన్నావు. 2) అయమాత్మా బ్రహ్మ = ఈ ఆత్మ బ్రహ్మము. 3.ప్రజ్ఞానమానందం బ్రహ్మ = జీవుడు అనంతరూప బ్రహ్మము. 4) అహం బ్రహ్మాస్మి = నేను బ్రహ్మమునై ఉన్నాను. ఈ చివరి మహా వాక్యాముయొక్క అనుభవాన్నే అపరోక్ష జ్ఞానమని సాక్షాత్కారమని అంటారు. రెండవ విషయం అవాంతర వాక్యాలను గురించి పరమాత్మ యొక్క జీవునియొక్క స్వరూపాన్ని విడివిడిగా బోధించే వాక్యాలను అవాంతర వాక్యాలంటారు. ఈ అవాంతర వాక్యాలవల్ల "బ్రహ్మమున్నది పరమేశ్వరుడున్నా"డని యీ రూపమైన పరోక్షజ్ఞానం సంభవిస్తుంది.

**"తత్త్వమసి"** (నీవు బ్రహ్మము) అని గురువు బోధించిన మహావాక్యాన్ని శ్రవణం చేసిన అధికారి శిష్యునికి **"అహం బ్రహ్మాస్మి"** (నేను బ్రహ్మము) అను దృఢభావం కల్గుతుంది. దీనినే అపరోక్షజ్ఞానం అంటారు. ఈ అపరోక్ష జ్ఞానానికి సాక్షాత్తు కేవలం మహావాక్యబోధేకారణం. గురువు బోధించిన మహావాక్యం శిష్యుని శ్రోత్రేంద్రియానికి సంబంధపడినప్పుడు ఈ జ్ఞానం కల్గుతుంది. పరోక్షజ్ఞానానికి అవాంతర వాక్యశ్రవణం కారణం అపరోక్షజ్ఞానానికి మహావాక్య శ్రవణం కారణం. మహావాక్యాలతో అపరోక్షజ్ఞానమే సంభవిస్తుంది కాని; పరోక్షజ్ఞానం కాదు.

**శిష్యుడు :** దృఢాపరోక్షజ్ఞానానికి ఫలమేమి?

**గురువు :** అభానాపాదక ఆవరణము విక్షేపము తమకు కారణమైన అవిద్యతో సహా నివర్తిస్తాయి. బ్రహ్మ ప్రాప్తిరూప మోక్షము సిద్ధిస్తుంది.

భానమనగా ప్రతీతి. అభానమనగా ప్రతీతి కాకుండుట. "బ్రహ్మము కానరావడం లేదు" అను అభిప్రాయమే అభానాపాదక ఆవరణం. స్థూలసూక్ష్మ శరీరాలు వాటి అభిమాని చిదాభాసుడు. అతని కర్తృత్వాది ధర్మాలు ఈ మొత్తం విక్షేపమంటారు.

**శిష్యుడు :** దృఢాపరోక్ష బ్రహ్మజ్ఞానానికి పూర్ణపరిపాకమెప్పుడు?

**గురువు :** అజ్ఞానదశలో "దేహమే"నేననెడి జ్ఞానంయెంత దృఢమై వుండిందో అట్లే "**బ్రహ్మాభిన్నమైన ఆత్మే**"నే ననెడి జ్ఞానం దృఢంగా చిత్తంలో వెలసినప్పుడు దృఢాపరోక్ష బ్రహ్మజ్ఞానానికి పూర్ణావధి.

1) జ్ఞాన సంపాదనకు ఆవశ్యక సామాగ్రులు కాబట్టి శ్రవణమనననిది ధ్యాసాలను జ్ఞానసాధనాలంటారు. 2) దేహాది అనాత్మ సంఘాతంనుండి ఆత్మవస్తువును మాటిమాటికి వేఱుపరచుకొనుట జ్ఞానముయొక్క స్వరూపం. 3) అనాత్మవస్తువులైన అహంకారాదులకు ఆత్మకు కల తాదాత్మ్య అధ్యాస – అనగా అహంకార గ్రంథి సంపూర్ణంగా నశించిపోవుట జ్ఞానానికి ఫలం. 4) అజ్ఞానులకు దేహాత్మబుద్ధి యెంత గట్టిగా ఉంటుందో, అంత గట్టిగా బ్రహ్మాత్మ బుద్ధి నెలకొనుట జ్ఞానానికి అవధి అనగా పూర్ణత.

**శిష్యుడు:** గురుదేవా! విచారమను మాటకు అర్థమేమి?

**గురువు :** ఆత్మను అనాత్మను వస్తుతః విడివిడిగ తెలుసుకొనుటే విచారం.

**శిష్యుడు:** ఆ విచారశక్తిగల్గే మార్గమేమి?

**గురువు :** ఈశ్వరకృప, శాస్త్రకృప, గురుకృప, తన అంతఃకరణ కృప – అనే యీ చతుర్విధ కృపలు కలిగిన వానికి విచారశక్తి సిద్ధిస్తుంది.

## చతుర్విధ కృపలు

1. ఈశ్వరకృప – మానవజన్మము లభించుట, జీవనోపాధికి చింతలేకుండుట,

జ్ఞానాన్ని సంపాదించేందుకు కావలసిన అనుకూలాలు కలిసివచ్చుట, గడచిన జన్మంలో తాను చేసుకొన్న పుణ్యంకొద్దీ భగవదనుగ్రహంతో శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన సద్గురువు లభించుట – ఇదంతా యీశ్వరకృప.

2. వేదకృప – శాస్త్రాలలోని అనుభూతి సత్యాలను అవగాహన చేసుకోగల శక్తి కలిగిందంటె అది వేదకృప.

3. గురుకృప – శాస్త్రప్రమాణాల ద్వారా యుక్తి అనుభవాల ద్వారా ఆత్మ పరమాత్మల యేకత్వనిశ్చయాన్ని శిష్యుని అంతఃకరణంలో దృఢంగా నాటుకొనేటట్లు బోధించుట – గురుకృప.

4. అంతఃకరణకృప (మనస్సుకృప) వేదాంతశాస్త్రాలు చెప్పినట్లు, బ్రహ్మనిష్ఠుడైన సద్గురువు నిర్దేశించినట్లు, వివేకాది సాధనాలను సంపాదించడంలో మనస్సు అన్ని విధాల సహకరిస్తే అది అంతఃకరణ (మనస్సు) కృప.

**శిష్యుడు :** అట్టి విచారానికి ఫలమేమి?

**గురువు :** ఆ విచారంతో దృఢాపరోక్ష బ్రహ్మజ్ఞానం సిద్ధిస్తుంది.

**శిష్యుడు :** ఆ విచారాన్ని ఎంతవరకు చేయాలి?

**గురువు :** దృఢాపరోక్ష బ్రహ్మజ్ఞానం కలిగేవరకు చేయాలె.

**శిష్యుడు :** విచారము వేటిని గురించి?

**గురువు :** నేననగాయెవరు? బ్రహ్మమనగా యేమి? ప్రపంచ స్వరూపమెట్టిది? ఈ మూడు విషయాలను గురించి విచారించాలె.

నేను – బ్రహ్మము, చైతన్యవస్తువులు; ప్రపంచము జడవస్తువని తెలుసుకొనుట, ఆ మూడింటి సాధారణ స్వరూపజ్ఞానం.

**శిష్యుడు :** ప్రపంచమనగాయేమి?

**గురువు :** సమిష్టి స్థూలసూక్ష్మ కారణశరీరాలు వ్యష్టిస్థూల సూక్ష్మకారణ శరీరాలు వాటి అవస్థలు, పంచకోశాలు వాటి ధర్మాలు, యీ మొదలైన నామరూపాలన్నీ ప్రపంచమే.

సమిష్టి అనగా సమూహం వృక్షసమూహాన్ని వనం అంటాము. వనము సమష్టి రూపమై ఉంది. అట్లే యీశ్వరుడు సమష్టిరూపుడు. వ్యష్టి అనగా విడిగా ఒకటి. వనంలో ఒక చెట్టువలె జీవుడు వ్యష్టిరూపుడు.

సమిష్టి తత్త్వానికి విరాట్టు స్థూలదేహం. హిరణ్యగర్భుడు సూక్ష్మదేహం. అవ్యాకృతుడు కారణదేహం. దానికి ఉత్పత్తిస్థితి ప్రళయాలు మూడు అవస్థలు.

వ్యష్టితత్త్వానికి స్థూల, సూక్ష్మ, కారణాలు మూడు దేహాలు. జాగ్రత్, స్వప్న, సుషుప్తులు మూడు అవస్తలు, అసత్ జడదుఃఖ రూపమై వుండుట. జనన మరణాలు కలిగి ఉండుట దేహ ధర్మాలు.

అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయాలు పంచకోశాలు.

**శిష్యుడు :** చైతన్యమనగా ఎట్టిది?

**గురువు :** 1) స్వయంగా జ్ఞానస్వరూపమై వుండుట, 2) ఘటపటాది సర్వనామ రూప ప్రపంచాన్ని తెలుసుకోగల్గి ఉండుట, 3) యింద్రియ మనస్సులకు తెలియబడకుండుట – ఇట్టిదే చైతన్యము.

**శిష్యుడు :** జడమనగా యెట్టిది?

**గురువు :** 1) తన్ను తాను తెలుసుకోలేనిది, 2) తనకంటె భిన్నములైన వస్తువులను తెలుసుకోలేనిది – యిట్టిదే జడము. అజ్ఞానము, దానివల్ల కల్గిన భూతభౌతిక పదార్థాలు జడాలు.

అజ్ఞానమనగా తెలియలేకుండుట. భూతమనగా ఆకాశ, వాయు, అగ్ని, జల, పృథ్వి అని చెప్పబడు పంచభూతాలు. భౌతికములనగా పంచ భూతాలవల్ల కల్గిన పిండ బహ్మాండాలు.

**శిష్యుడు :** ఈ మూడు వస్తువులను విచారించడంతో ప్రయోజనమేమి?

**గురువు :** సామవేదములోని మహావాక్యము "తత్త్వమసి" దానిలో 'తత్ – త్వం – అసి' అనే మూడు పదాలున్నాయి. తత్పదముయొక్క వాచ్యార్థము యీశ్వరుడు. త్వం పదముయొక్క వాచ్యార్థము జీవుడు. ఈ యిద్దరికి ఉపాధియై యీ నామరూపాత్మక

ప్రపంచం ఉంది.

1. త్రాడును పామనుకున్నాము. మొద్దును చూచి దొంగని తలపోశాము. మరు భూమిలో జలం కానొచ్చింది. విచారిస్తే ఆ ప్రతీతి మిథ్యామాత్రం. మిథ్యను మిథ్యయని తెలిసి దాని భ్రాంతి వదిలేశాము. అట్లే జీవుని యీశ్వరునికి ఉపాధిగా వుండే ప్రపంచాన్ని లెస్సగా విచారించి మిథ్యగా తెలుసుకోవాలె అదొక్క ప్రయోజనం.

2. "త్వం" (నీవు) పదలక్ష్యార్థమైన ఆత్మయే, "తత్" (అది) పదలక్ష్యార్థమైన బ్రహ్మము. అంతకు భిన్నం కాదు. ఈ విధంగా ఆత్మ బ్రహ్మలయొక్క ఏకత్వాన్ని విచారించి, అదే సత్యమని నిర్ణయించాలె. ఈ నిర్ణయం "నేనెవరు? బ్రహ్మమెద్ది?" అనే విచారానికి రెండో ప్రయోజనం.

## జీవేశ్వరుల స్వరూపం

**జీవుడు :** అంతఃకరణము అందులో పడిన చైతన్య ప్రతిబింబము ఆ రెంటికి అధిష్ఠానమైన కూటస్థాత్మకలసి జీవుడనబడతాడు.

**ఈశ్వరుడు:** మాయ, అందులో పడిన చైతన్య ప్రతిబింబం ఆ రెంటికి అధిష్ఠానమైన బ్రహ్మము కలిసి యీశ్వరుడనబడినాడు.

## ఈశ్వర స్వరూపానికి వాచ్యార్థం

ఈశ్వరునికి ఉపాధి మాయ. విరాట్టు హిరణ్యగర్భ అవ్యాకృతులు యీశ్వరునికి మూడు దేహాలు. వైశ్వానర సూత్రాత్మ యీశ్వరులు వాటి అభిమానులు. ఉత్పత్తిస్థితి లయాలు అతని అవస్థలు. ఈ తొమ్మిదితత్త్వాలు యీ అన్నిటికి కారణమైన మాయ దాని అధిష్ఠానమైన పరబ్రహ్మం, వెరసి పదకొండు తత్త్వాలు చేరి యీశ్వర శబ్దానికి వాచ్యార్థం, మాయను దాని కార్యాలైన తొమ్మిదింటిని బాధించి ఏకము పూర్ణమునైన పరబ్రహ్మాన్ని గుర్తించుట లక్ష్యార్థము.

## జీవ స్వరూపానికి వాచ్యార్థం

జీవునికి ఉపాధి అవిద్య. స్థూలసూక్ష్మకారణాలు అతనికి దేహాలు, విశ్వతైజస ప్రాజ్ఞులు వాటి అభిమానులు. జాగ్రత్ స్వప్న సుషుప్తులు అతని అవస్థలు. ఈ తొమ్మిది కార్యాలు

యీ అన్నిటికి కారణమైన అవిద్య, దాని అధిష్ఠానమైన కూటస్థ చైతన్యం, వెరశి యీ పదకొండు కలిసి జీవశబ్దానికి వాచ్యార్థం. అవిద్యను దాని కార్యాలయిన తొమ్మిదింటిని బాధించగా మిగిలిన అసంగకూటస్థ సచ్చిదానంద సాక్షి స్వరూపము జీవశబ్దానికి లక్ష్యార్థం.

ఇట్లు జీవేశ్వరులను విచారించగా, విరోధవస్తువులైన ఉపాధి ధర్మాలను పదింటిని త్రోసిపుచ్చి, సారమైన లక్ష్యభాగాన్ని గ్రహిస్తే జీవుడు కూటస్థుడైనాడు; ఈశ్వరుడు బ్రహ్మమైనాడు. ఆ కూటస్థ బ్రహ్మలను ఒకే వస్తువుగా జ్ఞానులు గ్రహిస్తారు.

**శిష్యుడు:** ఇట్టి విచారానికి అధికారి యెవ్వడు?

**గురువు :** ఉత్తమ జిజ్ఞాసువు అధికారి. అట్టివాడు గురువు చెప్పిన వేదాంత ప్రక్రియను సంప్రదాయానుకూలంగా విచారించి **"నేను బ్రహ్మము"** ననే అపరోక్షానుభవం పొందగల్గుతాడు.

ఉత్తమ జిజ్ఞాసు లక్షణాలు = సాధన చతుష్టయ సంపన్నుడు, గురువునందు వేదాంత శాస్త్రాలయందు విశ్వాసం కలవాడు. అధోగతికి దారితీసే కుతుర్కాన్ని దరికి చేరనివాడు. స్వరూపజ్ఞానం పొందాలనే ఇచ్ఛకలవాడు ఉత్తమజిజ్ఞాసు అనబడ్తాడు. సత్కర్మలతో ఉపాసనలతో అంతఃకరణంలోని మల విక్షేప దోషాలు యెవడు నివారించుకొన్నాడో, యెవనికి స్వరూపసంబంధమైన అజ్ఞానం ఒక్క దోషం మాత్రం (ఆవరణం) మిగిలి ఉందో, తద్ద్వారా ఆధ్యాత్మిక అధిభౌతిక అధిదైవికాలనే తాపత్రయాలతో యెవడు కలసి ఉన్నాడో అట్టివాడే ఆత్మ విచారానికి అధికారి.

మలము, విక్షేపము, ఆవరణము అనేవి అంతఃకరణంలోని మూడు దోషాలు. మలమనగా కామక్రోధ లోభాదులద్వారా సంభవించిన పాపము. విక్షేపమనగా మనస్సుయొక్క చాంచల్యం. ఆవరణమనగా వస్తుతత్త్వాన్ని తెలియకుండా చేసే అజ్ఞానం.

ఈ మూడు దోషాలకు నివారణోపాయాలను శాస్త్రాలు సూచించాయి. నిష్కామ కర్మలను చేయుటతో మలదోషం తొలుగుతుంది. మలినవాసనలు ఉన్నంతవరకు శాస్త్రోక్తనిష్కామ శుభకర్మలు చేస్తూండాలె. రెండవదైన విక్షేపదోషం తొలగాలంటే

శాస్త్రీయములైన ఉపాసనలు చేస్తూ రావలె. తద్వారా మనసులోని చాంచల్యం తొలగి ఏకాగ్రత సిద్ధిస్తుంది. అనంతరం జ్ఞానం కల్గినప్పుడు ఆవరణ దోషం నివర్తిస్తుంది.

## సాధన చతుష్టయ సంపద

1) వివేకం 2) వైరాగ్యం 3) శమాదిషట్సంపత్తి 4) ముముక్షుత్వమనే యీ నాల్గింటిని సాధన చతుష్టయం అంటారు. 1) ఆత్మ నిత్యము; ఆత్మభిన్న సమస్తము అనిత్యము అనెడి నిశ్చయమే వివేకము. ఈ వివేకము పుస్తకజ్ఞానులైన పండితులకు కూడా ఉంటుంది; కానీ వారి వివేకం నిష్కామకర్మలద్వారా చిత్తము శుద్ధమై సంభవించిన వివేకంకాదు. పుస్తకాలు చదువగా వచ్చిన వివేకం ఇట్టి శుష్కవివేకంతో వైరాగ్యమనే ఫలం సంభవించలేదు. అట్లుగాక నిష్కామకర్మలను ఉపాసనలను ఆచరించడంతో శుద్ధము స్థిరమైన చిత్తంలో ఉదయించిన వివేకమే తర్వాతి వైరాగ్యాది సాధనాలను సంభవింపజేయ సమర్థంగా ఉంటుంది.

2) వైరాగ్యమంటే ఇహలోకంలోని పరలోకంలోని భోగాలపై ఆసక్తి లేకుండుట. 3) శమాదులు ఆరు శమము, దమము, శ్రద్ధ, సమాధానము, ఉపరతి, తితిక్షలని వాటి పేర్లు. శబ్దాది బాహ్య విషయాలనుండి మనస్సును నిరోధించుట శమము. అట్లే విషయాల నుండి బాహ్యేంద్రియాలను మరలించుట దమము, గురు వేదాంత వాక్యాలపైగల అచంచల విశ్వాసమే శ్రద్ధ. లక్ష్యసాధనయందు చిత్తానికిగల యేకాగ్రతే సమాధానం. ఒకసారి వదిలిన విషయాలపై మరి యిచ్ఛే లేకుండుట ఉపరతి. శీతోష్ణాది ద్వంద్వాలను శాంతితో సహించుకోగలిగే ఓర్పే తితిక్ష.

## ఆధ్యాత్మికాది దుఃఖాలు

1) ఆధ్యాత్మిక దుఃఖం ఆత్మను ఆశ్రయించి ఉండే స్థూల సూక్ష్మ శరీరాలను అధ్యాత్మమంటారు. వాటి సంబంధంగా కలిగే దుఃఖాలను ఆధ్యాత్మిక దుఃఖాలంటారు. ఆధులని, వ్యాధులని అవి రెండువిధాలు. ఆధులనగా సూక్ష్మ శరీరంలో అనగా మనస్సులో కలిగే చింతలు, చీకులు వగైరా వ్యాధులనగా స్థూలశరీరంలో కలిగే జ్వరం పడిశం వగైరా.

అదిభౌతిక దుఖంః తనకంటె భిన్నమై యింద్రియగోచరమై ఉండే యితర భూతాల (ప్రాణుల) ద్వారా కలిగే దుఃఖం, అనగా పులులు మొదలైన ప్రాణులతో, దొంగలు

శత్రువులు పుత్రకళత్రాదులతో కలిగే దుఃఖం అధిభౌతిక దుఃఖం.

3) అదిదైవిక దుఃఖం – తనకంటె భిన్నమై యింద్రియ గోచరంకాని కారణాలతో కలిగే దుఃఖం, అనగా దైవీప్రకోపాలైన అతివృష్టి అనావృష్టి భూకంపం పిడుగుపాటు మొదలైన అపఘాతాలతో కలిగే దుఃఖం అదిదైవిక దుఃఖం.

**శిష్యుడు :** అట్టి ఉత్తమ జిజ్ఞాసువు యేమి చేయాలె?

**గురువు :** ఇట్టి వివేకాది సంపన్న శిష్యుడు సద్గురు సన్నిధి చేరి అతని చరణ కమలాలకు సాష్టాంగ నమస్కారాలుచేసి చేతులు జోడించి వినయ విధేయతలతో, "గురుదేవా! బంధమనగా యేమి? మోక్షమనగాయేమి? జీవుని స్వరూపమెట్టిది? ఈశ్వరుని స్వరూపమెట్టిది? ఆత్మ పరమాత్మల స్వరూపమెట్టిది? ఆ రెంటియేకత్వాన్ని యేవిధంగా తెలుసుకోవాలె?" ఈ మొదలైన ప్రశ్నలను అడిగి గురువు దయచేసే వేద సమ్మతమైన సమాధానాలను పునఃపునః మననంచేసి "నేను బ్రహ్మము" నసే అపరోక్షానుభవాన్ని పొందాలె.

స + అష్ట + అంగ = సాష్టాంగము, అష్టాంగములతో కూడిన నమస్కారమే సాష్టాంగ నమస్కారము.

**శ్లో॥ ఉరసా శిరసా దృష్ట్వా మనసా వచసా తథా।**
**పద్భ్యాం కరాభ్యాం జానుభ్యాం ప్రణామోష్టాంగ ఉచ్యతే॥**

రొమ్ము, శిరస్సు, దృష్టి, మనస్సు, వాక్కు, కాళ్ళు, చేతులు, మోకాళ్ళు, యీ ఎనిమిది అంగాలు భూమిపై మోపిచేసే ప్రణామమే సాష్టాంగ ప్రణామమంటారు.

**కం॥ కరయుగములు చరణంబులు**
**నురము లలాటస్థలంబు నున్నతభుజముల్।**
**సరి ధరణి మోపి మ్రొక్కిన**
**బరువడి సాష్టాంగమండ్రు పరమమునీంద్రుల్॥**

అనే యీ విధము ప్రచలింతగానే ఉంది.

## సద్గురు వెట్టివాడు?

వేదముయొక్క వాచ్యార్థాన్ని లక్ష్యార్థాన్ని చక్కగా యెఱిగినవాడు. జీవునికి లక్ష్య స్వరూపమైన ఆత్మే పరబ్రహ్మమనే నిశ్చయంకలవాడు శిష్యుని బుద్ధిలో పాదుకొనిపోయిన పంచభేదాలను నిర్మూలించేవాడు అయిన సద్గురువే అద్వయ బ్రహ్మ దర్శనాన్ని ప్రసాదించగల్గుతాడు.

మరీ, ఆయన యీ నామరూపాత్మక ప్రపంచం యెండమావులవలె మిథ్యామాత్రమని సయుక్తికంగా పునఃపునః శిష్యునికి ఉపదేశించి శ్రవణం చేయిస్తాడు. శిష్యునిలో ప్రాపంచిక బుద్ధికి అవకాశమివ్వకుండా ఆత్మబ్రహ్మల యేకత్వ నిశ్చయ విషయాన్నే ఉపదేశిస్తాడు.

## పంచ భేదాల వివరం

1) జీవేశ్వరభేదం – అవిద్యయొక్క మాయయొక్క ఉపాధుల ద్వారా యేర్పడింది; కాబట్టి యీ బేధం ఘటాకాశ మహాకాశాల భేదంవలె కల్పితమైనది.

2) జీవులకు జీవులకు పరస్పరభేదం – (జీవ జీవ భేదం) అభాస సహిత అంతః కరణ ఉపాధులతో ప్రతీతి అయింది; కాబట్టి యీ బేధం అనేక ఘటాలలో తోచే భిన్న భిన్నాకాశాల భేదంవలె కల్పితమై ఉంది.

3) జీవజడభేదం – అభాస సహిత అంతఃకరణరూప ఉపాధిని మరియు నిరాభాస నామరూపమయ ఉపాధిని అవలంభించి యీ భేదం ప్రతీతమౌతుంది. కాబట్టి స్వరూపంలోని చరాచర పదార్థాల భేదంవలె యీ భేదంకూడ కల్పితమైందే.

4) ఈశ్వర జడభేదం సాభాస మాయయొక్క ఉపాధితోనూ నిరాభాస నామరూప ఉపాధిద్వారాను ప్రతీతమయ్యే భేదం కాబట్టి యీ భేదంకూడా స్వప్నంలో స్వప్నసాక్షికి స్వప్న ప్రపంచానికిగల భేదంవలె కల్పితమే.

5) జడజడభేదం – నామరూపాలనే ఉపాధులతో ప్రతీతమయ్యే భేదం కాబట్టి త్రాటిలో కల్పితమైన సర్పదండ జలధారాదికాలవలె యీ భేదం కల్పితమైంది.

వేదాంతగోష్ఠిలో సాధన విచారం అనే మొదటిఘట్టం ముగిసింది.



# వేదాంత గోష్ఠి

## రెండవ ఘట్టం
## (ప్రపంచముయొక్క అధ్యారోప అపవాదాలు)

**శిష్యుడు :** శుద్ధబ్రహ్మంలో ప్రపంచంయొక్క ఆరోపణయేవిధంగా కల్గింది?

**గురువు :** అనాది శుద్ధబ్రహ్మంలో అనాది కల్పిత ప్రకృతి వుంది. ఆ ప్రకృతికి బ్రహ్మంతో అనాదిగా కల్పిత తాదాత్మ్య సంబంధం ఉంది. ఆసంబంధం వాస్తవానికి కల్పితమేకాని నిజమైనది కాదు. భేదమే కల్పితం కాబట్టి సంబంధం కూడా కల్పితమే.

ప్రపంచ విషయమును గురించి మొదటి ఘట్టంలో చెప్పబడింది. ఇక ఆరోపణమనగా అర్థమేమంటే: బ్రహ్మము వస్తువు అజ్ఞానము దాని కార్యాలు అవస్తువులు వస్తువునందు అవస్తువులను చెప్పుట అధ్యారోపమని ఆరోపమని అంటారు.

### అనాది వస్తువులు

1) శుద్ధబ్రహ్మము 2) ప్రకృతి 3) యిరెంటి సంబంధం 4) జీవుడు 5) ఈశ్వరుడు 6) ఈ అనాది వస్తువులయొక్క పరస్పర భేదం - యీ ఆరింటిని వేదాంతాలలో అనాదులంటారు. ఈ ప్రపంచం కూడా ప్రవాహరూపంగా అనాది అనే చెప్పబడ్తుంది. ఇందులో మొదటిదైన బ్రహ్మము అనాది అనంతం కూడా తక్కిన అయిదూ అనాదులే అయినా సాంతాలు. అంతముకల వస్తువులను సాంతమంటారు ఆదిలేని అనగా పుట్టుకలేని వస్తువులను అనాదులంటారు.

నిజంగా ఉనికి లేకపోయినా ఎండమావుల్లో నీళ్ళలాగా భ్రాంతితో కానవచ్చే వస్తువును కల్పితమంటారు.

## అనాది వస్తువుల వివరణం

**1) బ్రహ్మము అనాది :** కారణమేమంటే, బ్రహ్మము అవిద్య (మాయ)కు అధిష్ఠానం. అందువల్ల అవిద్య (మాయ-మూల ప్రకృతి)తో బ్రహ్మం కల్గిందని చెప్పే వీల్లేదు. ప్రకృతికాని బ్రహ్మప్రకృతుల సంబంధంకాని యీశ్వరుడు కాని జీవుడు కాని ఈ అన్నీ బ్రహ్మముతోనే సిద్ధిస్తాయి. కాబట్టి బ్రహ్మములేక వీటిలో యేది సిద్ధించదు కాబట్టి బ్రహ్మము అనాది.

**2) అవిద్య (మాయ - ప్రకృతి) అనాది :** ఎందుకంటె. బ్రహ్మం నిర్వికారం కాబట్టి అవిద్య బ్రహ్మమునుండి కల్గిందని చెప్పే వీల్లేదు బ్రహ్మంనుండి కల్గిందంటే బ్రహ్మము వికారవంతమౌతుంది. అవిద్య అనినా అజ్ఞానమనినా మాయ అనినా ప్రకృతి అనినా యిక్కడ ఒకే అర్థం. ఈ అవిద్య తర్వాతనే జీవుడుకాని యీశ్వరుడు కాని సిద్ధిస్తారు. కాబట్టి వారివలన అవిద్య కల్గిందనే మాట కొడుకుతో తల్లి కలిగిందన్న మాటవలె అసంగతమైంది. కావున అవిద్య అనాది.

**3) అవిద్యా చేతనాల (ప్రకృతి) (బ్రహ్మం) సంబంధం కూడా అనాదియే :** కారణమేమంటే, బ్రహ్మము అనాదే. అవిద్యయు అనాదే, ఆ రెంటియొక్క తాదాత్మ్య సంబంధం కూడా అనాదే. ఈ సంబంధంతోనే ముందు చెప్పబోయే యీశ్వరాదిత్రయం సిద్ధిస్తుంది. కాబట్టి వాటితో దీని ఉత్పత్తి చెప్పేవీల్లేదు. కాబట్టి ఈ సంబంధము ఆనాదే.

**4) - 5) జీవుడు, యిశ్వరుడు అనాదులే :** కారణమేమంటే ఈ జీవేశ్వరులు కేవలం బ్రహ్మతో కాని కేవలం మాయతో కాని లేక ఒకరితో ఒకరుకాని ఎవరి పాటుకు వాడుకొని కల్గినారని చెప్పే వీల్లేదు. అవిద్యా చేతనాల సంబంధం సిద్ధించిన తర్వాతనే యీ జీవేశ్వరుల సిద్ధి. ఆ సంబంధం కూడా అనాదిదే. కాబట్టి దానితో సైతం జీవేశ్వరుల ఉత్పత్తి సంభవించదు. కావున జీవేశ్వరులు అనాదులు.

**6) ఈ అయిదు వస్తువుల పరస్పర భేదం కూడా అనాదియే :** ఎందుకనగా, ఇవి తమంతకు తామే ఉత్పత్తి అయినాయంటే ఆత్మాశ్రయదోషం ఆపాదిస్తుంది. ఏ విధంగానూ వీటి పుట్టుకను నిరూపించే వీల్లేదు; కావుననే అనాదులు. యీ ఆనాది వస్తువుల భేదం కూడా అనాదే.

ఈ విధంగా యీ ఆరింటికి ఉత్పత్తిని నిరూపించ వీలులేదు. కాబట్టి వీటిని స్వరోపతికి అనాదులని చెప్పారు.

## ప్రకృతి

1) మాయ 2) అవిద్య 3) తమఃప్రధానమని ప్రకృతి మూడు విధాలు :

1) శుద్ధ సత్త్వగుణయుక్తమైన ప్రకృతిని మాయ అంటారు. 2) మలినసత్త్వగుణయుక్త ప్రకృతిని అవిద్య అంటారు 3) తమోగుణం ముఖ్యంగాకల ప్రకృతిని తమః ప్రధాన ప్రకృతి అంటారు.

1) రజోగుణ తమోగుణాలను తిరస్కరించి వాటిని తన అధీనంలో పెట్టుకొన్న సత్త్వగుణాన్ని శుద్ధ సత్త్వగుణమంటారు. ధర్మము. దర్పమూకల రాజు మంత్రులను తన స్వాధీనంలో పెట్టుకొని నడుపునట్లు. యీ సత్త్వగుణం రజోగుణ తమోగుణాలను తన అధీనంలో పెట్టుకొని నడుపుతుంది.

2) రజోగుణ తమోగుణాల ప్రాబల్యానికి లొంగిపోయిన సత్త్వగుణాన్ని మలిన సత్త్వగుణం అంటారు. బలహీనుడైన రాజు మంత్రి సామంతులకు లొంగియున్నట్లు యీ గుణం దుర్బలమై ఉంటుంది.

## ఈశ్వరుడు – జీవుడు

మాయలోని బ్రహ్మముయొక్క ప్రతిబింబము. అధిష్ఠానమైన బ్రహ్మయు, మాయయు కలిసి జగత్కర్త సర్వజ్ఞుడు అయిన యీశ్వరుడైనాడు. ఇక్కడ "మాయ" అనే మాటతో శుద్ధసత్త్వ ప్రధానమైన మాయను తమః ప్రధాన ప్రకృతిని, యీ రెంటిని గ్రహించాలె. ఈ రెండు యీశ్వరునికి ఉపాధులు యీశ్వరుడు, మాయ అనే ఉపాధితో, కుండకు కుమ్మరివలె, జగత్తుకు నిమిత్తకారణమైతాడు. తమః ప్రధాన ప్రకృతిని ఉపాధిగా గ్రహించి కుండకు మట్టివలె యీశ్వరుడు జగత్తుకు ఉపాదాన కారణమైతాడు. ఈ విధంగా ఉపాధుల సంబంధంతో యీశ్వరుడు జగత్తుకు అభిన్న నిమిత్తోపాదాన కారణమనబడ్తాడు.

ఇక జీవుని విషయం విచారిస్తాం. మలిన సత్త్వప్రధాన ప్రకృతినే అవిద్య అంటారు. ఆ అవిద్యలోని చేతన ప్రతిబింబం, అధిష్ఠానమైన కూటస్థాత్మ, అవిద్య – యీ మూడు

కలిసి కించిజ్ఞుడైన జీవుడనబడ్డాడు. వాడు కర్మఫలాశలతో బద్ధుడు కాబట్టి భోక్త అయ్యాడు. పంచేంద్రియాలకు లొంగి కామాదులకు వశుడై తపించుట జీవుని స్వభావం.

## ఈశ్వర - జీవుల వ్యత్యాసం

ఈశ్వరుడు జీవుడు అనాది కల్పితులే. అందులో ఈశ్వరుని ఉపాధిమాయ. అది ఏకము ఆపేక్షిక వ్యాపకము కాబట్టి యీశ్వరుడు కూడా ఏక స్వరూపుడు వ్యాపక స్వరూపుడు అయి ఉన్నాడు. జీవునికి ఉపాధి అవిద్య అది విడివిడిగా పరిచ్ఛిన్నమై ఉంది. అట్లే జీవుడు కూడా భిన్నబిన్నమై పరిచ్ఛిన్ను (అల్పు)డై ఉన్నాడు.

## ఆపేక్షిక వ్యాపకత అంటే

ఒక వస్తువు వుందనుకొండి, అది యింకో వస్తువుయొక్క దీటులో చాలాపెద్దది. కాని మరో మూడో వస్తువు దృష్టిలో యిది చిన్నది కావొచ్చు, అట్టి వస్తువును ఆపేక్షిక వ్యాపకమంటారు. నావద్ద ఒక అణారూక ఉంది. ఒక రూపాయి ఉంది. అణారూకయొక్క దీటులో రూపాయి చాలపెద్దది. కానీ బంగారు కాసును తెచ్చి పెట్టే దాని దీటులో రూపాయి చాల చిన్నది. ఇక్కడ రూపాయకు ఆపేక్షిత వ్యాపకత్వాన్ని చెప్పొచ్చు.

మరో దృష్టాంతం - భూమికంటే జలం పదిరెట్లు విశాలమంటారు. అప్పుడు భూమి పరిచ్ఛిన్న (అల్ప)మయింది. జలం పెద్దది (వ్యాపకము) అయింది. ఆ జలం తేజస్సుయొక్క కార్యం. కాబట్టి జలానికంటె తేజస్సు పదిరెట్లు పెద్దది. తేజస్సు (అగ్ని) యొక్క దీటులో జలం పరిచ్ఛిన్నమైనా, భూమియొక్క దృష్టిలో విశాల (వ్యాపక)మై ఉంది. కావున జలాన్ని ఆపేక్షిక వ్యాపకమంటారు.

అట్లే భూమి మొదలైనవాటి దృష్టితో మాయ మరింత వ్యాపక వస్తువు. అనగా మాయ ఆక్రమించిన ప్రదేశం విస్తారము విశాలము అని అర్థం. అయినా కూడా బ్రహ్మముతో పోల్చి చూస్తే ఆ మాయ పరిచ్ఛిన్నమే. కాబట్టి మాయను, ఆపేక్షిక వ్యాపకమన్నారు.

## జీవేశ్వర భేదం అనాది కల్పితమైంది

సృష్టికి పూర్వం సజాతీయ స్వగతభేద శూన్యమైన ఒకే సత్పదార్థ ముండిందంటూ ఛాందోగ్యోపనిషత్తు చెప్పింది. జీవుని ఉపాధి అయిన అవిద్య, జీవుల కర్మలతో కలిసి సృష్టికి పూర్వం మాయలో లీనమై వుంటుంది. ఆ మాయకూడా, సుషుప్తిలో అవిద్యవలె

బ్రహ్మానికంటె భిన్నంగా కానరాదు. కాబట్టి సృష్టికి పూర్వం ఒకే ఒక సచ్చిదానంద బ్రహ్మం ఉండింది.

ఆ బ్రహ్మము సృష్టియొక్క ఆరంభంలో **"ఏకోహం బహుస్యాం"** (ఒక్కడనైన నేను బహురూపాలు పొందాలి) అంటూ సంకల్పించాడు. అదే సృష్టి సంకల్పం. జీవులు చేసుకొన్న కర్మఫలాలు పరిపక్వానికి రావడంతో ఆ నిమిత్తంగా వారికి భోగానుభవం కల్పించేందుకోసం సృష్టి సంకల్పం యేర్పడ్తుంది. ఆ సంకల్ప బలంతో మాయలో క్షోభ కల్గింది. ఆ సంచలనం ద్వారా ఆకాశవాయు తేజో జల భూములచే పంచభూతాలు, శబ్ద, స్పర, రూప, రస గంధాలనే గుణాలు ప్రకటమయ్యాయి. ఆ భూతాలు పంచీకృతం కాలేదు. ఆ అపంచీకృత భూతాలనుండి మొదట్లో సమిష్టి వ్యష్టి రూపమైన సూక్ష్మసృష్టి కలిగింది. ఆ తర్వాత యీశ్వరుని యిచ్ఛతో పంచీకరణం జరిగింది. అప్పుడు సమష్టి వ్యష్టిరూప స్థూలసృష్టి యేర్పడింది. సమష్టి స్థూలసూక్ష్మకారణ ప్రపంచానికి అభిమాని జీవుడు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు కాబట్టి మాయకు ప్రభువు కాబట్టి ఆయన నిత్యముక్తుడు. జీవుడు అల్పజ్ఞుడు కాబట్టి అవిద్యావివశుడు కాబట్టి బద్ధుడైనాడు. శుద్ధ బ్రహ్మంలో ప్రపంచంయొక్క ఆరోపం యీ విధంగా జరిగింది.

**శిష్యుడు :** శుద్ధ బ్రహ్మంలో ప్రపంచంయొక్క యీ ఆరోపం సత్యమా? మిథ్యా?

**గురువు :** ముత్యపు చిప్పలో వెండి కానొచ్చినట్లు, స్థాణువులో దొంగ తోచినట్లు, యెండమావుల్లో నీళ్ళు కనబడినట్లు. బ్రహ్మంలో యీ ప్రపంచం మిథ్యారోపం మాత్రం.

**శిష్యుడు :** ఈ ఆరోపానికి కారణ మేమంటారు?

**గురువు :** అజ్ఞానమే కారణం.

**శిష్యుడు :** ఈ ఆరోపం ఎందుకు కల్గింది? ఎప్పుడు కల్గింది? ఇట్టి విచారంతో ప్రయోజనమేమైనా ఉందా?

**గురువు :** లేదు. నీ యింటిగోడపై రాత్రికి రాత్రి యెవడో ఒక అశ్లీల చిత్రం గీచిపోయాడు. తెల్లవారి చూచుకొన్నావు. "ఆ చిత్రాన్ని ఎవడు గీచినాడు; ఎప్పుడు గీచినాడు? ఎందుకు గీచినాడు?" – ఈ విచారంతో లాభంలేదు. త్వరగా దానిని తుడిచివేయుటే మొదటి పని. అట్లే యీ ప్రపంచము యొక్క ఆరోపాన్ని గురించి విచారిస్తూ ఆయుస్సును గడుపుట లాభంలేదు. దాని నివృత్తికి ప్రయత్నించుటే వివేకి

చేయవలసిన పని.

**శిష్యుడు :** అయితే ఆ ఆరోపనివృత్తి యేవిధంగా సిద్ధిస్తుంది?

**గురువు :** బ్రహ్మజ్ఞానం ద్వారా మాయకు అవిద్యకు నివృత్తి కల్గుతుంది. దాని ద్వారా కార్యసహితమైన ప్రకృతి నివర్తిస్తుంది. ఆ వెంట ప్రకృతి బ్రహ్మలకుగల సంబంధం పోతుంది. ఆ తర్వాత జీవభావం లేదు; ఈశ్వరభావంలేదు. ఆ భావ నివృత్తితోపాటు జీవేశ్వర భేదంకూడ తొలగుతుంది. భేదశూన్యమైన దశలో బంధంలేదు; మోక్షం స్వతస్సిద్ధం.

ఈ విధంగా బ్రహ్మజ్ఞానం కల్గిందంటే ఒక్క పెట్టున ఆరోప జాలమంతా నివృత్తమైపోతుంది. ఈ నివృత్తినే “అపవాద”మంటారు.

ఒక దరిద్రుడు బజారులో పోతూ ఒక అంగడి ప్రక్కగా బాటకు ఒక అంచున ఒక వెండి ముక్కను చూచాడు. ఆ వెండిని ఎవరో జారవిడుచుకొనిపోయారని అనుకొన్నాడు. ఆ అంగడివాని కంటబడకుండా గ్రహించాలనుకొన్నాడు. చీకటిపడేవరకు ఆ ప్రాంతంలోని వారు వెళ్ళేవరకు కాచుకొని ఉండి తర్వాత దానిని తీసుకొన్నాడు. తీరా చూస్తే అది వెండికాదు; ముత్యముచిప్ప. వాడు ముత్యపుచిప్పను వెండి అనుకొన్నాడు. దానిలో వెండిని ఆరోపించాడు. తదుపరి ఆ ముత్తెపుచిప్పయొక్క విశేషస్వరూపజ్ఞానం కల్గగానే, అది వెండికాదు; ముత్యపుచిప్ప అనే నిశ్చయం కల్గింది. వెంటనే కల్పితమైన వెండి – ఇది వెండి అనే జ్ఞానం, నివృత్తి పొందాయి ఈ నివృత్తినే (వెండియొక్క) అపవాదమంటారు.

ఈ విధంగా ప్రపంచము దాని జ్ఞానము నివృత్తి (అపవాదం) చేయుటతో అధిష్ఠానమైన శుద్ధబ్రహ్మమే మిగులుతుంది.

**శిష్యుడు :** ఆరోప నివృత్తిని సాధించే యీ బ్రహ్మజ్ఞానం యే విధంగా కల్గుతుంది?

**గురువు :** విచారం ద్వారా కల్గుతుంది. దాన్ని ముందు విను.

వేదాంతగోష్ఠిలో అధ్యారోప అపవాదాలకు సంబంధించిన
రెండవ ఘట్టం ముగిసింది.



# వేదాంత గోష్ఠి

## మూడవ ఘట్టం
## (స్థూలదేహ విచారణ)

**శిష్యుడు** : గురుదేవా! దేహాలుయెన్ని?

**గురువు** : స్థూలమని, సూక్ష్మమని, కారణమని దేహాలు మూడు.

**శిష్యుడు** : స్థూలదేహమంటేయేమి?

**గురువు** : పంచీకృత పంచమహాభూతాలయొక్క యిరవై అయిదు తత్త్వాల రాశియే స్థూలదేహం.

**శిష్యుడు** : పంచభూతాలనగా యేవేవి?

**గురువు** : ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి, వీటినే పంచ భూతాలంటారు.

**శిష్యుడు** : పంచభూతాలకు యిరవై అయిదుతత్త్వాలు యేవేవి?

**గురువు** : ఆకాశాది భూతాలు ప్రతియొక్కదానికి అయిదు చొప్పున కలసి యిరవై అయిదు తత్త్వా (పదార్థా)లైనవి.

1. కామ, క్రోధ, శోక, మోహ, భయాలు ఆకాశభూతానికి పంచతత్త్వాలు భోగము నందలి యిచ్ఛ కామమంటారు. అహంతా మమతా రూపబుద్ధిని మోహమంటారు.

2. చలన, వలన, ధావన, ప్రసారణ, ఆకుంచనాలు వాయు భూతానికి పంచతత్త్వాలు.

3. క్షుత్తు, పిపాస, ఆలస్యము, నిద్ర, కాంతి అనునవి తేజో (అగ్ని) భూతముయొక్క పంచతత్త్వాలు.

4. శుక్లము, శోణితము, లాలా (జొల్లు) మూత్రము, స్వేదము, (చెమట) అనునవి యీ అయిదు. జలభూతముయొక్క పంచతత్త్వాలు.

5. అస్థి, మాంస, నాడి, త్వక్, రోమాలు, పృథ్వీభూతానికి చెందిన పంచతత్త్వాలు.

ఇవే యిరవై అయిదు తత్త్వాలు, సృష్టి ప్రారంభంలో యీ పంచభూతాలు సూక్ష్మరూపంతో అపంచీకృతమై ఉండినవి. జీవులయొక్క సుఖభోగార్థమై యీశ్వరేచ్ఛ ద్వారా వీటికి పరస్పర సమ్మేళనం జరిగింది. తద్వారా స్థూలసృష్టి యేర్పడింది. దానినే పంచీకరణమంటారు.

**శిష్యుడు :** పంచీకృత పంచమహాభూతాలంటే యేమి?

**గురువు :** ఏ భూతములకు పంచీకరణం జరిగిందో వాటిని పంచీకృత పంచమహా భూతాలంటారు.

**శిష్యుడు :** పంచీకరణమంటే యెట్టిది?

**గురువు :** పంచీకరణ పద్ధతి శాస్త్రంలో రెండు విధాలు చెప్పబడింది. మొదటిది ఒక్కొక్క భూతము రెండు రెండు భాగాలయింది. ప్రత్యేక భూతంయొక్క అర్ధ అర్ధభాగం అప్పటం అట్లే ఉంది. తక్కిన అర్ధభాగాలు నాల్గు నాల్గు భాగాలైనాయి. ఈ విధంగా ప్రతి భూతానికి పెద్ద (అర్ధభాగం) ఒకటి. చిన్న భాగాలు నాలుగు యేర్పడ్డాయి. ప్రతిభూతంలోనూ సొంతం తన అర్ధభాగం తక్కిన నాల్గుభూతాల చిన్న (పరక) భాగాలలో ఒక్కొక్కటి చొప్పున కలుస్తూ వచ్చాయి ఇదే పంచీకరణం.

ఉదాహరణ : అయిదుగురు స్నేహితులు ఒకచోట కలిశారు. ప్రతివానివద్ద తలా ఒకరకమైన పండు ఉంది. ప్రతివాడు వాని వానివద్ద ఉండే పండును రెండు రెండు భాగాలు చేశాడు. సగం తాను పెట్టుకొని తక్కిన సగాన్ని నాల్గుభాగాలు చేసి మిత్రులకు తలా ఒక ముక్క యిచ్చాడు. ప్రతివానివద్ద సొంతం తన భాగం సగం, తక్కిన నల్గురు మిత్రులనుండి పరక (1/8) భాగాలు నాలుగు వచ్చి చేరుకొన్నాయి.

ఈ పంచీకరణ పద్ధతిలో ఒక శంకకు అవకాశముంది. ప్రతియొక్క భూతంలో సగం మాత్రమే సొంతభాగం. తక్కిన సగం యితర భూతాలభాగం. తక్కిన భూతాల

వెరసిభాగం సగంలో తన సగభాగం కలిసిపోవడంతో యే భూతమైనా కూడా చక్కంగా తన స్వరూపంతో కానొచ్చే వీలుండదు కదా! మరి యిప్పుడవి చక్కగా తమ స్వరూపంతో ఆకాశాది భూతాలుస్పష్టంగా కానొస్తూన్నాయే! అనే శంకకు సమ్మాధానంగా క్రింది విధమైన పంచీకరణాన్ని చెబుతారు. ఇది రెండో రకమయిన పంచీకరణం.

ఒక్కొక్క భూతము రెండుభాగాలు చేయబడింది. కాని ఆ రెండు భాగాలు సమానమైన సరిభాగాలు కాదు అయిదింట ఒక పాలు ఒకవైపుభాగం. అయిదింట నాల్గుపాళ్ళు ఒకవైపు భాగం. ఒకటి పెద్దభాగం. ఒకటి చిన్నభాగం. ఈ విధంగా ప్రతిభూతాన్ని చేయాలె తర్వాత చిన్న భాగాన్ని అయిదు పాళ్ళుచేసి ఒక్కొక్క పాలు ఒక్కొక్క భూతంలో పెద్దభాగంలో కలుపుతూరావాలె.

**ఉదాహరణము :** పైన చెప్పినవలెనే అయిదుగురు మిత్రులున్నారు. ప్రతివానివద్ద నూరేసిపండ్లున్నాయి. వాటిలో అయిదింట ఒకపాలంటే యిరవై. అయిదింట నాల్గుపాలంటే ఎనభై. ప్రతివాడూ పెద్దభాగమైన ఎనభై పండ్లను తనదగ్గర పెట్టుకొన్నాడు. చిన్న బాగమైన యిరవైని అయిదు భాగాలు చేసినాడు. భాగానికి నాలుగు వచ్చినవి. ఈ పంపిణీలో తనవే తనకు మళ్ళీ నాల్గువచ్చినవి. మొదటి పెద్దభాగం ఎనభై. ఈ భాగం నాల్గుచేరి ఎనభైనాల్గు అయినవి. తనవలెనే తక్కిన నల్గురు మిత్రులనుండి నాల్గునాల్గుగా వచ్చినవి పదారు. ఎనభైనాలుగూ పదారు కలిసి ఎప్పటివలె నూరు, అయితే వీటిలో స్వంతభాగం నూటికి ఎనభైనాల్గుపాళ్ళు, ఇతరుల భాగం పదారుపాళ్ళు.

ఇట్లు ప్రతిభూతంలోనూ తనభాగమే యెక్కువ మెజార్టీగా ఉండునట్టి భూతాలు చక్కంగా తమ స్వరూపంతో గోచరిస్తున్నాయి.

ఈ రెండు విధాలైన పంచీకరణ పద్ధతులలో ఉండే వ్యత్యాసం విను. మొదటిపద్ధతిలో, పంచీకృత భూతాలలో అర్ధభాగం తన సొంతం, తక్కిన అర్ధభాగం తక్కిన నాల్గు భూతాల సొత్తు చేరుకొనింది. రెండవ పంచీకరణంలో, ప్రతి భూతంలో తన భాగం ఎనభైనాల్గు భాగాలు, తక్కిన నాల్గు భూతాల భాగాలు పదారు కలుసుకొన్నాయి.

**శిష్యుడు :** ఆకాశాది పంచభూతాల పంచీకరణాన్ని మరింత వివరించి చెప్పండి?

**గురువు :** విను. ఎక్కువ వాడుకలో ఉండే మొదటి రకమైన పంచీకరణ పద్ధతినే

నేను అనుసరిస్తూన్నాను. ఆకాశము రెండు భాగాలయింది. సగభాగం అట్లే ఉంది. మరో సగభాగం నాల్గు భాగాలై ఒక భాగం వాయువులో ఒక భాగం తేజస్సు (అగ్ని)లో ఒక భాగం జలంలో ఒక భాగం పృథ్విలో కలిసింది. తక్కిననాల్గు భూతాలు యీ విధంగానే విభాగమై తమలో తాము సమ్మేళనం చెందాయి. స్థూల శరీరంలోని యిరవై అయిదుతత్త్వాలను తెలిపే క్రింది కోష్ఠకాన్ని గుర్తించు.

పంచభూతాలు ఆకాశ, వాయు, తేజ, జల, పృథ్వి

| | | |
|---|---|---|
| ఆకాశం | శోకము<br>శీర్షాకాశము | ప్రసారణ, నిద్ర, లాలా, రోమము |
| వాయువు | కామము<br>కంఠాకాశము | ధావన, తృష్ణ, స్వేదము, త్వక్ |
| తేజస్సు | క్రోధము<br>హృదయాకాశము | వలన, క్షుధ, మూత్రము, నాడి |
| జలం | మోహము<br>ఉదరాకాశము | చలన, కాంతి, శుక్లము, మాంసము |
| పృథ్వి | భయము<br>కట్యాకాశము | ఆకుంచన, ఆలస్యము, శోణితము, అస్థి |

ప్రతి భూతముయొక్క ముఖ్యతత్త్వము పెద్ద అక్షరాలతో సూచింపబడింది.

## వివరణము

**ఆకాశము రెండుభాగాలైంది :** అందులో ఒకభాగమైన శీర్షాకాశం విడిగా ఉంది. తక్కిన రెండోభాగం నాల్గుభాగాలు చేయబడింది. ఒకటి ప్రసారణమనే పేరుతో

| ముఖ్య తత్త్వములు | వీటి అంశములు ఏ ముఖ్య తత్త్వమందు మిశ్రమగుచున్నవో, అవి తత్త్వములు | | | | |
|---|---|---|---|---|---|
| | పృథ్వి | జలము | తేజస్సు | వాయువు | ఆకాశము |
| పృథ్వి | అస్థి | మాంసము | నరము | చర్మము | రోమము |
| జలము | రక్తము | శుక్లము | మూత్రము | చెమట | జొల్లు |
| తేజస్సు | ఆలస్యము | కాంతి | ఆకలి | తృష్ణ | నిద్ర |
| వాయువు | ఆకుంచనము | చలనము | వలనము | పరుగిడుట | విస్తరిల్లుట |
| ఆకాశము | భయము | మోహము | క్రోధము | కామము | శోకము |
| | లేక | లేక | లేక | లేక | లేక |
| | కటిప్రదేశము | ఉదరము | హృదయము | కంఠము | శిరము |

పై కోష్ఠకమునందు పృథ్వీముఖ్యతత్త్వమందు పృథ్వ్యంశము ఎముక, జలాంశము మాంసము, తేజోంశము నరము, వాయ్వంశము చర్మము, ఆకాశాంశము రోమము. దీనివలెనే మిగిలిన భూతముల యందును తెలియవలసినది. పైజెప్పిన యిరువదియైదు తత్త్వములందు క్రింద వ్రాయు ప్రకారముగా పంచభూత లక్షణములని తెలియవలెను.

# स्थूल देहाच्या तत्त्वांचे कोष्टक नं. १

| आकाशाची | वायूची | तेजाची | आपाची | पृथ्वीची |
|---|---|---|---|---|
| काम | चलन | क्षुधा | शुक्र | अस्थि |
| क्रोध | वलन | तृषा | शोणित | मांस |
| शोक | धावन | आलस्य | लाला | त्वचा |
| मोह | प्रसारण | निद्रा | मूत्र | नाडी |
| भय | आकुंचन | कांति | स्वेद | रोम |

వాయువులో కలిసింది. మరొక్కటి నిద్ర అనే పేరుతో వాయువులో కలిసింది. అట్లే జలంలో కలిసిన భాగం లాలారసమైంది భూమిలో కలిసినభాగం రోమమైంది.

ఆ విధంగానే వాయువు రెండుపాళ్ళయింది. అందులో ఒక పాలు వాయువునకు ముఖ్యక్రియ అయిన ధావనమయింది. రెండో పాలు తిరిగి నాల్గు భాగాలయి నాల్గు భూతాలలో కలిసింది. ఆకాశభాగం కంఠాకాశము. అగ్నిభాగం తృష్ణ, (దప్పి), జలభాగం, స్వేదం (చెమట) పృథ్వీభాగం, త్వక్కు (చర్మము)

అగ్ని రెండు భాగాలు, సగభాగం క్షుధ (ఆకలి) మిగత సగం నాల్గుభాగాలైంది. ఆకాశంలో కలిసి హృదయాకాశం, వాయువులో కలిసి వలనం, జలంలో కలిసిన భాగం మూత్రము, పృథ్విలో కలిసినతత్త్వం నాడులైంది.

తర్వాత జలతత్త్వవిషయం దానిలో అర్ధభాగం శుక్లమైంది. తక్కిన సగం నాల్గుభాగాలై ఆకాశంలో చేరిన భాగం ఉదరాకాశమైంది. వాయువులో చేరిన భాగం చలనమైంది. తేజస్సులో కలిసిన భాగం కాంతి అయింది. భూమిలో కలిసిన భాగం మాంసము.

ఇక అయిదవది పృథ్వి. అది కూడా రెండు భాగాలయింది. ముఖ్యభాగము అస్థి. తక్కిన సగభాగం నాల్గయింది. ఆకాశభాగము కట్యాకాశము, వాయుభాగము, ఆకుంచనము. తేజోభాగము ఆలస్యము, జలభాగము, శోణితము, ఇట్లు యిరవైఅయిదు తత్త్వాలై పంచమహాభూతాలు పరస్పరం కలుసుకొన్నాయి.

**శిష్యుడు :** ఈ యిరవై అయిదు తత్త్వాలు స్థూల శరీరంలో యే విధంగా ఉన్నాయి?

**గురువు :** నాయనా! విను. ఈ ప్రసంగం క్రొత్తవారికి చీదరగా ఉండొచ్చు. అయినా జిజ్ఞాసువు నిబ్బరంగా గ్రహించాలె.

ఆకాశముయొక్క అయిదు తత్త్వాలను శీర్షాకాశము కంఠాకాశము హృదయాకాశము కట్వాకాశమని అంటారు. అందులో మొదటిదైన శీర్షాకాశము కట్వాకాశమని అంటారు. అందులో మొదటిదైన శీర్షాకాశము అనాహత శబ్దానికి ఆశ్రయం కాబట్టి అది ఆకాశానికి ముఖ్యభాగం. రెండవదైన కంఠాకాశం శ్వాసోచ్ఛ్వాసలకు ఆశ్రయం కాబట్టి అది వాయుభాగం. మూడవదైన హృదయాకాశం పిత్తమునకు చోటు కాబట్టి అది తేజోభాగం. నాల్గవదైన ఉదరాకాశం త్రాగిన నీటికి ఉనికి కాబట్టి అది జలభాగం. అయిదవది

కట్యాకాశం గంధానికి ఆశ్రయం. అందుచే అది పృథ్వీభాగం.

షరా : శీర్షాకాశమంటే శిరః ప్రదేశంలో ఉండే అవకాశం కంఠాకాశమంటే కంఠ ప్రదేశంలో ఉండే ఆకాశం.

ఈ ప్రకరణ (ఘట్టం) ప్రారంభంలో, శోకము, కామము, క్రోధము, మోహము, భయము అనే అయిందిటినీ ఆకాశతత్త్వాలని చెప్పబడింది. కానీ, విచారిస్తే అవి వాస్తవానికి లింగదేహధర్మాలు. కాబట్టే కొన్ని గ్రంథాలు వాటిని లింగదేహ ధర్మాలుగా చెప్పాయి.

కుండలోపల ఉండే నీటియొక్క చలువ కుండపైకి తోచినట్లు, సూక్ష్మదేహానికి చెందిన ఆ శోక కామాది ధర్మాలు స్థూల శరీరంపై కూడా గోచరించడంతో వాటిని గౌణంగా స్థూలదేహధర్మాలని కూడా చెప్పొచ్చునని కొందరి తీర్మానం.

ఆ రెండవ పక్షంలో ఆకాశభూతముయొక్క పంచతత్త్వాలు క్రింది విధంగా పరిగణింపబడ్డాయి.

1. శోకము – ఇది ఆకాశానికి ముఖ్యభాగం. కారణమేమంటే శోకము కల్గినప్పుడు శరీరం శూన్యమైపోతుంది. ఆకాశం కూడా శూన్యమేకదా!

కొన్నిచోట్ల "లోభము" ఆకాశానికి ముఖ్యభాగంగా చెప్తుతారు. ఆ పక్షంలో దానికి కారణమేమంటే లోభము యెప్పుడు నిండేదికాదు. అలాగే ఆకాశంలో కూడా ఎన్ని వస్తువులు వేసినా నిండేది లేదు.

శోకము – ఆకాశము, ఈ రెంటికి ఎక్కువ సాదృశ్యం ఉండుటబట్టి ఇక్కడి ఆకాశానికి ముఖ్యభాగం శోకమనే పక్షమే గ్రహింపబడింది.

2. కామము – ఆకాశంలో వాయుభాగం కలియుటతో కామం కల్గింది. వాయువువలె కామవృత్తి చంచలమైంది. ఆ సామ్యంతో దీనిని వాయుభాగమన్నారు.

3. క్రోధము ఆకాశంలో కలిసిన అగ్నిభాగంతో యిది సంభవించింది. క్రోధం అగ్నివలెనే దేహాన్ని తపింపజేస్తుంది. కాబట్టి దాన్ని అగ్నిభాగమన్నారు.

4. మోహము – ఆకాశములో జలభాగం కలిసి మోహతత్త్వం. జలంవలె మోహం

విత్తపుత్రాదికాలతో విస్తరిస్తుంది. ఆ పోలికతో దీన్ని జలభాగమన్నారు.

5. భయము – ఆకాశంలో పృథ్వీభాగం కలిసి భయతత్త్వం సిద్ధించింది. భయం కల్గినప్పుడు శరీరము జడమైపోతుంది. భూమికూడా జడ స్వభావమైందే. కాబట్టి అది పృథ్వీభాగం.

## వాయువుయొక్క పంచతత్త్వాలు

ప్రసారణ, ధావన, వలన, చలన, ఆకుంచనాలను అయిదింటిని వాయుతత్త్వాలంటారు.

1. ప్రసారణము – వాయువులో ఆకాశభాగం కలిస్తే యిది ఏర్పడింది. ప్రసారమనగా చాచుట – నీల్గుట – నిక్కుట, ఆకాశము వ్యాపకంగా సాగి ఉంది కాబట్టి ఆ పోలికతో దీన్ని ఆకాశ భాగమన్నారు.

2. ధావనము – అనగా పరుగెత్తుట. ఇది వాయువు యొక్క ముఖ్యభాగం గాలి యెప్పుడు నిలకడలేక పరుగెత్తుతూనే ఉంటుంది. కాబట్టే దీనిని వాయుభాగమన్నారు.

3. వలనము – అనగా చుట్టుకొనుట. వాయువులో తేజో భాగం కలిసి యీ తత్త్వం కల్గింది. అగ్నికూడా వలన స్వభావం కల్గిందే. కాబట్టి దీన్ని తేజో (అగ్ని) భాగమన్నారు.

4. చలనము – కదలుట వాయువులో కలిసిన జలభాగంతో ఇది సంభవించింది. జలం కూడా చలన ధర్మం కలదే.

5. ఆకుంచనము – ముడుచుకొనుట వాయువునందు పృథ్వీభాగం కలిసి యీ తత్త్వం యేర్పడింది. భూమి స్తబ్ధ స్వభావమైంది. ఆ పోలికతో యిది భూభాగము.

నిద్ర, దప్పి, ఆకలి, కాంతి, ఆలస్యం అనే యీ అయిదు తేజస్సుకు (అగ్నికి) సంబంధించిన పంచతత్త్వాలు.

1. నిద్ర – తేజస్సులో ఆకాశభాగం కలిస్తే నిద్రాతత్త్వం, నిద్రా సమయంలో శరీరం శూన్యంగా ఉంటుంది. **“ఆకాశం గగనం, శూన్యం”** ఆకాశం కూడా శూన్యం (బోలు) వస్తువే. ఆ సామ్యంతో యిది ఆకాశభాగము.

2. దప్పి - తేజస్సులో వాయుభాగం కలిసింది. దప్పితో కంఠం ఆరిపోతుంది. వాయువు తడిబట్టలను ఆర్పుతుంది. కావున దప్పి వాయుభాగము.

3. ఆకలి - ఇది తేజస్సుకు ముఖ్యభాగం. ఆకలి అన్నింటిని భస్మం చేస్తుంది అగ్ని కూడా అట్టిదే. కాబట్టి యిది అగ్నియొక్క ముఖ్యభాగం.

4. కాంతి - తేజస్సులో జలభాగం చేరి యీ తత్త్వం సంభవించింది. తాపం కల్గితే కాంతి తగ్గుతుంది. జలం కూడా తాపానికి క్షీణిస్తుంది. ఈ పోలికతో కాంతిని జల భాగమన్నారు.

5. ఆలస్యము - తేజస్సులో పృథ్వీభాగం కలిసి ఇది సంభవించింది. (ఆలస్యమనగా అలసత్వము - బద్ధకము - సోమరితనము) పృథ్వివలె యిది జడమైంది. ఆ సామ్యాన్ని బట్టి యిది పృథ్వీభాగం.

ఇక జలతత్త్వాలను గురించిన చర్చ. లాలా (జొల్లు - చొంగ) స్వేద (చెమట) మూత్ర, శుక్ల, శోణితాలు అయిదు జలతత్త్వాలు.

1. లాలా (అనగా చొంగ - జొల్లు) జలంలో ఆకాశభాగం కలిసి యీ తత్త్వం ఏర్పడింది. ఆకాశంవలె యిది వ్యాపక స్వభావం కలది.

2. స్వేదము - అనగా చెమట. ఇది జలంలో కలిసిన వాయుభాగం. విసిరినపుడు వాయువు ఉత్పన్నమైనట్లు పరిశ్రమ చేసినపుడే చెమట పుట్టుతుంది.

3. మూత్రము - జలములో తేజో (అగ్ని) భాగము కలిసి యిది యేర్పడింది. తేజస్సువలె యిది ఉష్ణమైనది.

4. శుక్లము - (వీర్యము) జలానికిది ముఖ్యభాగం. ఇది శుభ్రవర్ణము గర్భకారణము అయినది. జలంకూడా శ్వేతవర్ణము; వృక్షాదులకు కారణమై ఉంది.

5. శోణితము - రక్తము జలంలో పృథ్వీభాగం చేరి యేర్పడింది. ఎర్రనైంది. రోమములు చర్మము, నాడులు, మాంసము, అస్థులు యీ అయిదు పృథ్వీతత్త్వాలు.

1. రోమములు - (వెంట్రుకలు). పృథ్విలో కలిసిన ఆకాశభాగం ఆకాశంవలె రోమములు కూడా శూన్యములే. తీసివేయుటతో బాధలేదు. కాబట్టి యిది ఆకాశభాగం.

2. త్వక్కు (చర్మము) పృథ్విలో వాయుభాగం కలిసింది. చర్మం వాయువువలె స్పర్శగుణం కలది.

3. నాడులు – పృథ్విలో తేజోభాగం కలియుటతో అయింది. తాపాన్ని తెలుసుకొనేందుకు నాడులే కారణం. కాబట్టి యివి తేజో జలభాగాలు.

4. మాంసము – పృథ్వియందు జలభాగం కలిసింది. మాంసము చెమ్మగలది. కాబట్టి యిది జలభాగం.

5. అస్థి – (ఎముక) ఇది పృథ్వికి ముఖ్యభాగం. భూమివలె యిది కఠినమైనది. గోళ్ళు, పళ్ళు, ఆస్థి స్వరూపాలే.

ఈ విధంగా స్థూల దేహంలో మొత్తము యిరవైఅయిదు తత్త్వాలున్నాయి.

**శిష్యుడు :** ఈ యిరవై అయిదు తత్త్వాలు తెలుసుకోవడంతో నాకేమి లాభం?

**గురువు :** ఈ తత్త్వాలను తెలుసుకోవడంతో నీకు జ్ఞానం కల్గుతుంది. ఎట్లంటే – "(1) ఈ తత్త్వాలు పంచభూతాలకు చెందినవి. (2) ఈ ఇరవైఅయిదు తత్త్వాలు నేనుకాదు. (3) ఇవి నావికావు (4) ఈ పంచవింశతి తత్త్వాలకు నేను ద్రష్టను. నేను వాటికి భిన్నంగా ఉన్నాను. కాబట్టి అవి నేను కాను; అవి నావికావు. ఘటద్రష్ట ఘటానికి భిన్నంగా ఉన్నట్లు ఈ తత్త్వాలకు నేను భిన్నంగా ఉన్నాను." ఈ విషయానికి "వాక్యవృత్తి"లో ప్రమాణముంది.

**శ్లో॥ ఘటాద్రష్టా ఘటాద్భిన్నః – సర్వథా న ఘటో యథా!**
**దేహద్రష్టా తథా దేహో – నాహమిత్యవధారయేత్॥**

తా॥ కుండను జూచేవాడు అకుండకు వేరై ఉంటాడు. ఎట్టి పరిస్థితిలోనూ తాను కుండ కాబోడు. అలాగే నేను దేహానికి ద్రష్టను; ఆత్మను. ఏ విధంగానూ దృశ్యమైన దేహం నేను కాబోను.

ఈ నిశ్చయం కల్గటే యీ పంచవింశతి తత్త్వాలను విచారించుకోవడంతో కల్గే లాభం.

**శిష్యుడు :** ఈ యిరవై అయిదు తత్త్వాలు నావి కావు? అవి నేను కావని తెలుసుకొనే విధానమెట్లు?

**గురువు :** మొదట్లో ఆకాశముయొక్క పంచతత్వాలను గురించి వివరిస్తాను; విను, నీకు శోకం కల్గిందనుకో! ఆ శోకమును తెలుసుకొన్నావు. శోకము లేని స్థితిలో ఆ స్థితిని కూడా తెలుసుకొన్నావు. అందువలన, "యీ శోకము నాకు మధ్యలో కల్గింది. ఇది నేను కాను ఇది ఆకాశ ధర్మం కాబట్టి నాదికూడా కాదు. ఈ శోకానికి నేను ద్రష్టను. ఘటద్రష్ట ఘటానికి భిన్నంగా ఉన్నట్లు నేనీ శోకానికి వేరై ఉన్నాను" అని యీ విధంగా తక్కిన తత్వాలను గురించి కూడా విమర్శించుకోవాలె. ఆ తత్వాలు ఉన్నప్పుడున్నాయని లేనప్పుడు లేవని తెలుసుకొంటు నీవు వాటికి వేరై ఉన్నావు. ఈ విధంగా విమర్శిస్తూ, "(1) ఈ తత్త్వాలు నేను కాదు, (2) అవి నావి కావు; ఆయా భూతాలవి మాత్రం (3) నేనాతత్త్వాలకుద్రష్టను. వాటికి "భిన్నం"గా ఉన్నాను. పూర్ణతః, సచ్చిదానంద స్వరూపుణ్ణి" అనే నిశ్చయానికి రావాలె.

**శిష్యుడు :** గురుదేవా! పైన చెప్పినట్లు పంచవింశతి తత్త్వాలు నేను కాదని – అవి నావి కాదని తెలుసుకొంటే వచ్చే ప్రయోజనమేమిటి?

**గురువు :** అలా తెలుసుకొంటే. స్థూలదేహం దాని ధర్మాలు నేను కాదని, అవి నావి కావనీ నిశ్చయించుకోవచ్చు. నామము జాతి ఆశ్రమము వర్ణము సంబంధము పరిణామము జనన మరణాలు మొదలైనవి స్థూల దేహధర్మాలు.

**శిష్యుడు :** నామము (పేరు) నేను కాదు నాది కాదు – అనే విషయం యే విధంగా తెలుసుకోవాలె?

**గురువు :** విను (1) పుట్టకముందు పేరులేదు. (2) పుట్టిన తర్వాత వ్యవహార నిమిత్తం సంబంధీకులు పేరుపెట్టారు. (3) శరీరంలోని అవయవాలను విడివిడిగా విచారిస్తే ఆ పేరు దేనికి కూడా చెందదు. కాబట్టి "(1) నామం (పేరు) నేను కాదు. (2) అది నాది కాదు. (3) కేవలం స్థూల దేహంకోసం కల్పించింది. (4) దానికి నేను ద్రష్టను. కాబట్టి ప్రత్యేకంగా ఉన్నానంటూ నిశ్చయించుకోవాలె.

**శిష్యుడు :** జాతి వర్ణాదులు నేనుకాదు, అవి నావి కావని యేవిధంగా తెలియాలె?

**గురువు :** బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనునవి నాల్గుజాతులు అవి స్థూల దేహానికి చెందినవే. సూక్ష్మదేహానికి కూడా సంబంధించవు. ఆత్మకు అసలే సంబంధించవు.

సూక్ష్మ (లింగ) దేహంకాని ఆత్మకాని, యేది వెనుకటి జన్మలో ఉండిందో అదే యీ వర్తమాన దేహములోనూ ఉంది. అదే భవిష్యత్తు జన్మలో సైతం ఉంటుంది. కాని జాతి అనేది విడివిడిగా ప్రతిదేహానికి మారిపోతూంటుంది. జాతి సూక్ష్మ లింగ దేహానికి కాని ఆత్మకు కాని సంబంధించింది కాదు. ఈ స్థూలదేహానికి మాత్రం సంబంధించింది. అంతేగాక, దేహంలోని ఆయా అవయవాలను ప్రత్యేకించి అన్వేషిస్తూ వస్తే జాతికి "సత్తా" లేదు. కాబట్టే.

"(1) ఆ బ్రాహ్మణాది జాతులు నేనుకాదు. (2) అవి నావికావు (3) జాతులు స్థూల దేహంలో మాత్రం ఆరోపింపబడ్డాయి. (4) నేను వాటిని తెలుసుకొనేవాణ్ణి; కాబట్టి వాటికి ప్రత్యేకంగా ఉన్నాను." అని ఈ విధంగా నిశ్చయించుకోవాలె.

ఇట్లే బ్రహ్మ చర్యాది ఆశ్రమాలు కూడా స్థూల శరీరంలో ఆరోపింపబడినట్టివే. ఆశ్రమ ధర్మాలు సహజంగా స్థూల శరీర ధర్మాలే అయితే, ఆశ్రమస్థుల ధర్మాలు అందరివి ఒకేరకంగా ఉండేవి. అట్లుగాక ఒక్కొక్క ఆశ్రమస్థుని ధర్మం వేరు వేరుగా ఉండుటతో యీ ధర్మాలు స్థూలశరీరంలో ఆరోపింపబడినాయని చెప్పుట తగివుంది.

"అవి నేను కాను, అవి నావి కావు. నేను వాటిని యెరిగేవాణ్ణి. కాబట్టి వాటికంటె నేను వేరుగా ఉన్నాను" అని నిశ్చయించుకోవాలె.

ఆ విధంగానే, ఎరుపు, తెలుపు, నలుపు వగైరా వర్ణాలు (రంగులు), తల్లి, తండ్రి, గురువు, శిష్యుడు, భార్య, భర్త మొదలైన సంబంధాలు, పొట్టి, పొడుగు, లావు, సన్నము యీ మొదలైన పరిణామాలు, స్థూలదేహంలో కల్పితాలు మాత్రం. వాటి రాజ్య విస్తారమంతా యీ స్థూల దేహంలో మాత్రమే పరిమితం. నీవా స్థూలశరీరానికి విలక్షణుడవు; నిరాకారుడివి; ధర్మాతీతునివి. ఈ నిశ్చయాన్ని పునః పునః మననం చేసుకో.

శ్లో॥ నాహం మనుష్యో న చ దేవయక్షౌ
న బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాః।
న బ్రహ్మచారీ న గృహీ వనస్థో
భిక్షుర్న చాహం నిజబోధరూపః॥

తా॥ మనుష్యుణ్ణి కాదు నేను; దేవతనుకాదు, యక్షుణ్ణి కాదు; బ్రాహ్మణుడను క్షత్రియుడను వైశ్యుడను శూద్రుడను కూడా కాదు. బ్రహ్మచారిని, గృహస్థుణ్ణి వాన ప్రస్థుణ్ణి సన్యాసిని కూడా కాదు. నేను స్వయం జ్ఞానస్వరూపుణ్ణి.

**శిష్యుడు :** దయామయా! జన్మమరణాలు నాకు లేవు. వాటితో నాకు సంబంధం లేదని విచారించుకొనే ఫక్కి యేలాగు?

**గురువు :** కుమారా యోచించు, ఆత్మకు జన్మం ఉందంటే అవశ్యంగా అనిత్యమౌతుంది. ఆత్మ అనిత్యమనే సిద్ధాంతం మీ మాంసకులు మొదలైన ఆస్తికులకు పరలోకాన్ని ఒప్పుకొనే వారికి అంగీకార యోగ్యంకాదు. ఆత్మకు జన్మ ఉందంటె "**జాతస్య హిధ్రువోమృత్యుః**" అన్నట్లు మృత్యువు అనివార్యమైతుంది. అంతేగాక ఆ పక్షంలో, అకృతాబ్యాగమము కృత ప్రణాశమనే రెండు దోషాలు సంభవిస్తాయి.

1. అకృతాభ్యాగమమంటే – వెనుక జన్మంలో కర్మ తాను చేయకనే యీ జన్మలో సుఖదుఃఖాలను అనుభవించుట. అనగా కారణమైన కర్మ లేకనే సుఖదుఃఖ భోగానుభవం పొందవలసి వస్తుంది.

2. కృతప్రణాశమంటే – ఈ జన్మలో చేసిన కర్మకు భోగానుభవమే లేకుండాపోవుట.

కర్మవాదుల మతాన్ని అనుసరించి ఆత్మను కర్తగా భోక్తగా ఒప్పుకొన్నా కూడా అతన్ని జన్మమరణ రహితుడనే చెప్పాలె. ఆత్మ జన్మించుటకు యెట్టికారణములేదు. ఉందంటే ఆ కారణము ఆత్మకంటె భిన్నమై ఆత్మకు ముందే ఉండవలసి ఉంటుంది.

ఆత్మకు భిన్నమైంది. అనాత్మ. అది నామరూపవంతం. స్థాణువులో దొంగవలె. అనాత్మ ఆత్మలో కల్పింపబడింది. కల్పితమైన అనాత్మ ఆత్మకు కారణంకాదు. మరియు మహాకాశమే ఘటాకాశమైనట్లు బ్రహ్మమే ఆత్మస్వరూపంగా ఉంది. కాబట్టి బ్రహ్మంకూడా ఆత్మకు కారణం కాబోదు. ఇందువల్ల ఆత్మకు జన్మంలేదు. జన్మలేదు కాబట్టి మరణం కూడా లేదు. వెంట వెంట తక్కిన వికారాలు కూడా లేవు. కాబట్టే గీతాశాస్త్రం.

శ్లో॥ నజాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వాన భూయః

**అజో నిత్య శ్శాశ్వతోయం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే॥**

**తా॥** ఈ ఆత్మ ఎప్పుడూ పుట్టదు. కాబట్టి మరణించదు. వెనుక లేక యిప్పుడుంది అనేమాట సరిపోదు. ఆత్మ జన్మ రహితము. నిత్యము; సనాతనము; పురాణము స్థూల దేహం చంపబడ్తున్నా ఆత్మచంపబడదు.

"నేను జన్మమరణ స్వరూపుణ్ణికాదు; నాకు జన్మ మరణాలు లేవు. జన్మమరణాలు స్థూల దేహానికి కర్మనిమిత్తంగా కలిగాయి. నేను వాటికి ద్రష్టను. కల్పిత జన్మ మరణాలకు జన్మయుక్త వస్తువులకు నేను వాటికి భిన్నుడను" అని విచారించి నిశ్చయించుకోవాలె.

**శిష్యుడు :** ఈ పంచభూతాల నివృత్తికి ఉపాయమేది? దృష్టాంతంతో వివరించండి.

**గురువు :** నాయనా! ధన్యుడివి. ఈ శుభేచ్ఛ నిన్ను ఉద్ధరించగల్గుతుంది. సరే విను. ఒక మనుష్యునికి భూతం ఆవేశించింది. వాడు మంత్రవేత్తవద్దకుపోతాడు. మాంత్రికుడు ఢక్కి వాయించి బలులు చెల్లించి దయ్యాన్ని విడిపిస్తాడు. ఆ మనుష్యుడు భూత బాధనివృత్తి బొంది సుఖిస్తాడు ఇది దృష్టాంతం.

ఇక దార్ష్టాంతం విను. ఆకాశాది పంచభూతాలు శరీర రూపంతో అభిమానియైన జీవుని ఆవేశించాయి. జీవుడు వాటి నివృత్తిని కోరాడు. బ్రహ్మనిష్ఠుడు శ్రోత్రియుడునైన సద్గురుని ఆశ్రయించాడు. ఆ మంత్రవేత్త వేదశాస్త్రాలనే ఢక్కిని మ్రోగించాడు. పైన చెప్పిన యిరవైఅయిదు తత్త్వాలలో అయిదయిదు తత్త్వాల చొప్పున ఒక్కొక్క భూతానికి బలిని (పంచి) అర్పిస్తాడు. దేనిభాగం దానికి పోతుంది. భూతాల పీడవదలిపోయింది. వాటి నివృత్తికల్గగానే అధికారి పురుషునికి "నేను ఆ భూతాలకు వాటి తత్త్వాలు యిరవై అయిదింటికి ద్రష్టను" అనే నిశ్చయం కల్గుతుంది.

సద్గురువును ఆశ్రయించే విధానాన్ని గురించి ముండకోపనిషత్తులో "**తద్విజ్ఞానార్థం సద్గురు మేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్**" అని చెప్పబడింది. బ్రహ్మజ్ఞానాన్ని అపేక్షించే జిజ్ఞాసువు చేతిలో సమిధలను (ఏదైనా కానుకను) గ్రహించి శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడు అయిన సద్గురుని సమీపించి సాగిలి నమస్కరించి, "ఓ భగవంతా! నాకు బ్రహ్మవిద్యను ఉపదేశించండి. గురూ! బంధమంటే యేమి? మోక్షమంటే

యేమి? అవిద్య అంటే యేమి? విద్య అంటే యేమి?" అని యీ విధంగా వినయ విధేయతలతో ప్రశ్నించి తన వాఙ్మనోధనాలను గురువునకర్పించి సేవించాలె.

శిష్యుడు తన శరీరం ద్వారా నిష్కపట హృదయంతో గురువుయొక్క దేహానికి గేహానికి సేవచేయవలసి ఉంటుంది. పురుష శిష్యుడు తన గురువు స్త్రీయైనచో లేదా గురుపత్నికి గాని దేహ సంబంధమైన సేవలను గాక దూరమునుండి చేయవలసిన సేవలు చేయవలెను. అట్లే శిష్యురాండ్లు కూడ పురుష గురువులయెడ ప్రవర్తించడం మంచిది.

శిష్యుడు గురువు ఆజ్ఞను జవదాటరాదు. భగవంతునిపట్ల భక్తికల్గి ఉన్నట్లు గురువునందును హృదయపూర్వకమైన ప్రేమ కల్గి ఉండవలెను. పుత్రకళత్ర ధనధాన్య వస్తు వాహనాదులపై ఆసక్తి చంపుకొని గురు శరణార్థికావాలె గురువు గృహస్థుడైన పక్షమున తన ధనమును ఆయనకు సమర్పించాలె. తన వాక్కుతో యెల్లప్పుడు గురువును స్తోత్రము చేయవలసినదే కాని ద్వేషవాక్కు లాడరాదు. **"గురు కీజియే జాని జల పీజియే ఛానీ"** అని హిందీలో లోకోక్తి ఉంది. **"గుర్తెరిగి గురువును చేసుకో వడబోసి నీళ్ళు త్రాగు"** అని దాని అర్థం. గొర్రె దాటుగా పడిపోయి తర్వాత పశ్చాత్తాపం పొందే మూర్ఖత్వం ఉండరాదు.

గురువును అత్ర పెట్టరాదు. ఇంగితాన్ని తెలసి మెలగాలె. గురువుయెడ సర్వదా సద్భావన కలగి ఉండాలె. దోషదృష్టి ద్వేషబుద్ధి కలలో సైతం ఉండరాదు. ఆయన తన్ను ప్రేమించినపుడు విష్ణు స్వరూపునిగా, కోపించినపుడు రుద్రస్వరూపనిగా, బాహ్య ప్రవృత్తి వ్యాపారాలలో బ్రహ్మదేవునిగా శాంతస్థితిలో గంగామాతగా తన బోధా ప్రసారాలతో అజ్ఞానాంధకారాన్ని నివారించేటప్పుడు సూర్యనారాయణ మూర్తిగా శిష్యుడు గురువును భావించాలె.

ఈ విధంగా (అంతు, గురుత్వం, చేసుకొనేది కాదు; అయ్యేవస్తువు అయినా) గురువు యెడ శిష్యుడు **"సాక్షాత్ పరబ్రహ్మ"** మనేభావనకల్గి ఉండాలె. నాయనా! ఇంతవరకు నీవు స్థూలదేహము దాని తత్త్వాలు, వాటికి నేను ద్రష్టను సాక్షిని అనే విషయము, గురు శరణాగతి విధానము యీ అన్నియు విన్నావు. ఇక అడగవలసినదేదో అడుగు?

వేదాంతగోష్ఠిలో స్థూలదేహ విచారాన్ని గురించిన మూడవఘట్టం ముగిసింది.



# వేదాంత గోష్ఠి

## నాల్గవ ఘట్టం
## (సూక్ష్మదేహ విచారణ)

**శిష్యుడు :** సూక్ష్మదేహమంటే యేమి?

**గురువు :** అపంచీకృత పంచమహాభూతాలకు సంబంధించిన పదేడు తత్త్వాలతో నిర్మించబడిన దేహాన్ని సూక్ష్మదేహ అంటారు.

**శిష్యుడు :** ఆపదేడు తత్త్వాలు యేవేవి?

**గురువు :** పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి కలసి పదేడుతత్త్వాలు.

**శిష్యుడు :** పంచజ్ఞానేంద్రియాల పేర్లు చెప్పండి?

**గురువు :** శ్రోత్రము (చెవి) త్వక్కు (చర్మము) చక్షువు (కన్ను) జిహ్వ (నాలుక) ఘ్రాణము (ముక్కు) ఈ అయిదింటిని జ్ఞానేంద్రియాలంటారు. ఈ యింద్రియాలద్వారా జ్ఞానం కల్గుతుంది. కాబట్టి వీటిని జ్ఞానేంద్రియాలంటారు.

**శిష్యుడు :** పంచకర్మేంద్రియాల పేర్లు యేవి?

**గురువు :** వాక్కు (నోరు) పాణి (చెయ్యి) పాదము (కాలు) ఉపస్థ (గుహ్యము) గుదము (మలేంద్రియము) – ఈ అయిదింటిని కర్మేంద్రియాలంటారు. కర్మను చేయుటకు యివి సాధనాలు కాబట్టి వీటిని కర్మేంద్రియాలంటారు.

**శిష్యుడు :** పంచప్రాణాలేవేవి?

**గురువు :** ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము యివి

పంచప్రాణాలు.

**శిష్యుడు :** మనస్సుని దేన్నంటారు?

**గురువు :** అంతఃకరణయొక్క సంకల్పవికల్ప రూపమైన యే వృత్తికలదో దానిని మనస్సంటారు.

**శిష్యుడు :** బుద్ధి అనగాయేమి?

**గురువు :** అంతఃకరణముయొక్క నిశ్చయరూపమైన యే వృత్తికలదో దానిని బుద్ధి అంటారు.

**శిష్యుడు :** అపంచీకృత పంచభూతాలంటే అర్థమేమి?

**గురువు :** వెనుక మూడోఘట్టంలో పంచభూతాలు తమలో తాము కలిసి పంచీకరణ మైన పద్ధతి చెప్పబడింది. ఆ విధంగా పంచీకరణం కాని భూతాలను అపంచీకృత భూతాలని అంటారు. వాటినే సూక్ష్మభూతాలని, తన్మాత్రలని కూడా అంటారు.

**శిష్యుడు :** ఆ పదిహేడు తత్త్వాలు అపంచీకృత పంచభూతాలకు యేవిధంగా సంబంధించి ఉన్నాయి?

**గురువు :** పంచభూతాలలో ప్రతియొక్క భూతంయొక్క సత్త్వగుణ భాగాలతో, అనగా ఒక్కొక్క భూతం యొక్క ఒక్కొక్క సత్త్వగుణ భాగంతో, ఒక్కొక్క జ్ఞానేంద్రియం చొప్పున అయిదు జ్ఞానేంద్రియాలు కలిగాయి. అట్లే రజోగుణ భాగాలతో కర్మేంద్రియాలు కలిగాయి.

## వాటి వివరం - పంచ జ్ఞానేంద్రియాలు

1) ఆకాశముయొక్క సత్త్వగుణ భాగంతో శ్రోత్రేంద్రియం
2) వాయువుయొక్క సత్త్వగుణభాగంతో త్వగింద్రియం
3) తేజస్సుయొక్క సత్త్వగుణభాగంతో చక్షురింద్రియం
4) జలముయొక్క సత్త్వగుణభాగంతో జిహ్వేంద్రియం
5) పృథ్వియొక్క సత్త్వగుణభాగంతో ఘ్రాణేంద్రియం

## పంచ కర్మేంద్రియాల వివరం

1) ఆకాశముయొక్క రజోగుణభాగంతో వాగింద్రియం

2) వాయువుయొక్క రజోగుణభాగంతో పాణీంద్రియం

3) తేజస్సుయొక్క రజోగుణభాగంతో పాదేంద్రియం

4) జలముయొక్క రజోగుణభాగంతో గుహ్యేంద్రియం

5) పృథ్వియొక్క రజోగుణభాగంతో గుదేంద్రియం

## జ్ఞాన కర్మేంద్రియాల మిత్రత్వం

1. శ్రోత్రేంద్రియం శబ్దాన్ని వింటుంది. కాబట్టిదాన్ని జ్ఞానేంద్రియమంటారు. వాగింద్రియం శబ్దాన్ని పల్కుతుంది. కాబట్టి దాన్ని కర్మేంద్రియమంటారు. ఈ రెండు ఆకాశభాగాలు ఇదొక్క జోడు.

2. త్వగింద్రియం స్పర్శవిషయాన్ని గ్రహిస్తుంది. ఇది జ్ఞానేంద్రియం. పాణీంద్రియం (చెయ్యి) స్పర్శను నిర్వహిస్తుంది. ఇది కర్మేంద్రియం ఈ రెండూ వాయుభాగాలు ఇదొక్కజత.

3. చక్షురింద్రియం రూపాన్ని చూస్తుంది ఇది జ్ఞానేంద్రియం. కన్ను చూచిన చోటికి పాదం నడుస్తుంది. ఇది కర్మేంద్రియం. ఈ రెండు తేజస్తత్వానికి భాగాలు ఇదొక్కజంట.

4. జిహ్వేంద్రియం రసాన్ని స్వీకరిస్తుంది. ఇది జ్ఞానేంద్రియం. గుహ్యేంద్రియం రసాన్ని వదల్తుంది. ఇది కర్మేంద్రియం ఈ రెండు జలభాగాలు ఇదొక్క మైత్రి.

5. ఘ్రాణము గంధాన్ని గ్రహిస్తుంది. ఇది జ్ఞానేంద్రియం. గుదం మలా (గంధా)న్ని త్యజిస్తుంది. ఇది కర్మేంద్రియం. ఈ రెండూ పృథ్వీభాగాలు ఇదొక్క దోస్తీ.

## అంతఃకరణ ప్రాణతత్వాలను గురించి

అంపచీకృత పంచభూతాల సమష్టి సత్త్వగుణాంశంతో అంతఃకరణం కల్గింది. సమష్టి రజోగుణాంశంతో ప్రాణం కల్గింది. మొత్తానికి ప్రాణం ఒక్కటే అయినా స్థానభేదంతో క్రియాభేదంతో అది అయిదు విధాల చెప్పబడింది. అట్లే అంతఃకరణం ఒక్కటే అయినా

కూడా క్రియాభేదంతో వేర్వేరు పేర్లతో వ్యవహరింపబడింది. ఇక్కడ పదేడు తత్త్వాలలో చెప్పిన మనోబుద్ధులు. యీ అంతఃకరణ రూపాలే. చిత్త అహంకారాలను విడిగా చెప్పక యిక్కడ వాటిని మనోబుద్ధులలోనే కలిపి అంతర్భావం చేసి చెప్పుట జరిగింది. ఈ విధంగా అపంచీకృత పంచమహాభూతాల యొక్క కార్యాలను పదేడింటిని తెలుసుకోవాలె. ఈ పదేడు తత్త్వాలతో కూడిందే సూక్ష్మ శరీరం.

## ప్రాణస్థానాలు

ప్రాణము హృదయప్రదేశంలో అపానము గుదస్థానంలో సమానము నాభిమండలంలో ఉదానము కంఠభాగంలో వ్యానము సర్వశరీరము వ్యాపించి వర్తిస్తాయి.

**శిష్యుడు :** ఈ పదేడు తత్త్వాలను ఆ విధంగా తెలియుటతో లాభమేమి?

**గురువు :** "ఈ పదేడు తత్త్వాలు నేనుకాదు; నావికావు. అవి అపంచీకృత పంచభూతాలకు చెందినవి." అనే అనుభవం కల్గుతుంది. అదే ప్రయోజనం.

**శిష్యుడు :** "సూక్ష్మ దేహస్వరూపంగా ఉండే యీ పదిహేడు తత్త్వాలు నేనుకాదు; అవి నావి కా"వని యెట్లా తెలియాలె?

**గురువు :** "కుండను తెలుసుకొనేవాడు కుండకు వేరై ఉన్నట్లు యీపదేడు తత్త్వాలను తెలుసుకొనే నేను వాటికి వేరై ఉన్నాను. చూచేవాడు చూడబడే వస్తువుకంటె, తెలుసుకొనే వాడు తెలియబడే వస్తువుకంటె, భిన్నంగా ఉండాలనేది ఒక నియమం. ఆ విధంగా ఆ పదేడు తత్త్వాలు నేను కాను; అవి నావి కా"వంటూ విచార పూర్వకంగా తెలసుకోవాలె.

**శిష్యుడు :** ఈ విషయాన్ని దృష్టాంతపూర్వకంగా వివరించండి?

**గురువు :** (1) నాటకశాల ఒకటి ఉంది. (2) అందులో ఒక దీపం ఉంది. (3)రాజు ప్రవేశిస్తాడు (4) ప్రధాని వస్తాడు (5) వారి పరిచారకులు (6) నటి నాట్యం చేస్తుంది (7) వాయిద్యకాండ్లు వాయిస్తూన్నారు. (8) సభాజనం సందర్శిస్తూంది ఈ విధంగా నాటక ప్రదర్శనం జరుగుతుంది. అందులోని దీపం ఆ అందరినీ ప్రకాశింపజేస్తూంది. వారందరూ లేచిపోయిన తర్వాత ఖాళీ నాటకశాలను అది ప్రకాశింపజేస్తూనే ఉంటుంది. ఇది దృష్టాంతం.

ఇక దార్ష్టాంతం విను, (1) స్థూలదేహమే నాటకశాల. (2) సాక్షిరూపమైన "నేనే" దీపాన్ని (3) చిదాభాసుడు రాజు (4) మనస్సు ప్రధాని (5) పంచప్రాణాలు పరిచారక జనం (6) బుద్ధి ఆటకత్తె (7) దశేంద్రియాలు వాయిద్య కాండ్రు (8) శబ్దాది విషయాలు సభాజనం ఈ సమూహం మొత్తం జాగ్రత్స్వప్నాలలో ఉన్నప్పుడు వాటిని "నేనే" ప్రకాశింపజేస్తూ (తెలుసుకొంటూ)న్నాను. సుషుప్తి అవస్థలో వాటి అభావాన్ని వాటి శూన్యాన్ని అవేవి లేవని "నేనే" తెలుసుకొంటూ (ప్రకాశింప జేస్తూ) న్నాను. కాబట్టి అవి దృశ్యాలు నేను ద్రష్టను, వాటికి నేను వేరై ఉన్నాను.

**శిష్యుడు :** దీన్ని మరింతా విస్తారం చేసి చెప్పండి?

**గురువు :** వివేకశాలీ! విను. (1) జాగ్రదవస్థలో యింద్రియాలు అంతఃకరణము యీ రెంటి సహాయంతో ఆ అన్నింటినీ "నేను" ప్రకాశింపజేస్తూ (తెలుసుకొంటూ)న్నాను. (2) స్వప్నావస్థలో యింద్రియ సహాయంలేక ఒక్క అంతఃకరణ సహాయంతోనే ఆ స్వప్న ప్రపంచ పరివారాన్ని "నేను" ప్రకాశింపజేస్తూ (తెలుసుకొంటూ)న్నాను. (3) సుషుప్తి అవస్థలో యింద్రియాలు అంతఃకరణము యీ రెంటి సహాయము లేకున్నా "నేను" (ప్రకాశిస్తూ) ఉన్నానంటు తెలుసుకోవాలె.

**శిష్యుడు :** స్వామీ! దీనినే మళ్ళీ దృష్టాంత సహితంగా బోధించండి?

**గురువు :** నాయనా! విను (1) అయిదు చిల్లులుగల కుండలో ఒక ప్రమిదె పెట్టు. దాంట్లో నూనె వత్తివేసి వెలిగించు. (2) ఆ దీప ప్రకాశం తన్ను తాను ప్రకాశింపజేసుకొంటూ ప్రమిదెను వత్తినినూనెను కుండయొక్క లోభాగాన్ని ప్రకాశింపజేస్తూ, చిల్లుల గుండా బైటకి ప్రసరించి ఛిద్రాల సమ్ముఖంలో ఉండే బాహ్యపదార్థాలను సైతం ప్రకాశింపజేస్తుంది. (3) ఆ ప్రకాశమే సమష్టి ప్రకాశ స్వరూపుడైన సూర్యునిరూపంతో అఖిల బ్రహ్మాండాన్నీ ప్రకాశింపజేస్తూంది. (4) ఆ ప్రకాశమే మహాతేజోమయమైన సామాన్యరూపంతో సర్వదా ఉంది. ఇది దృష్టాంతం.

ఇక దార్ష్టాంతం విను. (1) స్థూలదేహం ఒక కుండ. పంచజ్ఞానేంద్రియాలు ఛిద్రాలు. హృదయం ప్రమిదె. మనస్సు తైలం. బుద్ధి వత్తి. అందులో ఆత్మరూప దీపం వెల్గుతుంది. (2) ఆ దీపం తన జ్ఞానప్రకాశంతో హృదయమనే పాత్రను మనస్సనే నూనెను బుద్ధి

# वपु (शरीर) रुप नृत्यशाला













अहङ्कारः प्रभुः सभ्या विषया नर्तकी मतिः । तालादिधारीण्यक्षाणि दीपः साक्ष्यवभासकः ॥ (पंद. १०/१४)

అనే వత్తిని ప్రకాశింపజేస్తుంది. అట్లే శరీరంలోని అవయవాలను యింద్రియాలనే ఛిద్రాలను ప్రకాశింపజేస్తుంది. మరి ఆ యింద్రియాలను యింద్రియాల సహాయంతో ప్రకాశింపజేసింది. (3) ఆ ఆత్మే ఈశ్వర రూపంతో అఖిల బ్రహ్మాండాన్ని ప్రకాశింపజేస్తుంది. (4) అదే బ్రహ్మస్వరూపమనబడి సామాన్య చైతన్యమై సర్వ వ్యాపకమై ఉంది.

పైన చెప్పిన నాటకశాలయొక్క దృష్టాంతంతోనూ యీ దీప దృష్టాంతంతోనూ దృశ్యములైన పదేడు తత్త్వాలకంటె దృక్కైనతన్ను విలక్షణంగా తెలుసుకోవలసి ఉంటుంది.

**శిష్యుడు :** ఈ వర్ణనయొక్క తాత్పర్యమేమి?

**గురువు :** "ఈ సూక్ష్మ శరీర సంబంధమైన పదేడుతత్త్వాలు నేను కాదు; అవి నావి కావు. అవి అపంచీకృత పంచభూతాలవి. నేను వాటి నెరిగే ద్రష్టను, ఘటద్రష్ట ఘటానికి భిన్నంగా ఉన్నట్లు నేను ఆ అన్నింటికి విలక్షణంగా – భిన్నంగా ఉన్నా" ననే నిశ్చయం కుదురుతుంది.

**శిష్యుడు :** "ఈ పదేడు తత్త్వాలు నేనుకాదు – నావికావు" అను విషయాన్ని మరింత వివరించి చెప్పండి.

**గురువు :** (1) శ్రోత్రము (చెవి) ఆకాశముయొక్క సత్త్వగుణాంశము. ఇది ఆకాశము యొక్క గుణమైన శబ్దాన్ని వింటుంది. అది వింటుందనే సంగతిని తెలుసుకొనేవాణ్ణి నేనే. వినకపోతే వినలేదనే సంగతిని కూడా తెలుసుకొనేవాణ్ణి నేనే. దాని భావభావాలను ఎరిగే వాణ్ణి నేను. కాబట్టి శ్రోత్రేంద్రియం నేను కాదు. అది ఆకాశం యొక్క అంశం. కాబట్టి నాదికాదు. దాన్ని తెలుసుకొనే నేను ఘటానికి ఘటద్రష్టవలె భిన్నంగా ఉన్నాను.

(2) త్వక్కు (చర్మము) ఇది వాయువుయొక్క సత్త్వగుణాంశము. కాబట్టి వాయుగుణమైన స్పర్శాన్ని గ్రహిస్తుంది. ఆ సంగతిని తెలుసుకొనే వాణ్ణినేనే. ఆ స్పర్శేంద్రియం స్పర్శను గ్రహించినప్పుడు గ్రహించనప్పుడు ఆ భావాభావాలను నేను తెలుసుకొంటుంటాను. కాబట్టి ఆ త్వగింద్రియం నేనుకాదు. అది వాయువుయొక్క అంశం కాబట్టి వాయువుదేకాని నాది కాదు నేను దాన్ని తెలుసుకొనే ద్రష్టను. ఘటమునకు ఘటద్రష్ట వేరుగా ఉన్నట్లు నేనా యింద్రియానికి వేరై ఉన్నాను.

3. చక్షువు (కన్ను) ఈ యింద్రియము తేజస్సుయొక్క సత్త్వగుణాంశము. తేజస్సునకు గుణమగు రూపాన్ని చూస్తుంది అది చూచుట చూడకుండుటను నేను తెలుసుకొంటుంటాను. కాబట్టి చక్షురింద్రియం నేనుకాను. అది తేజస్సునకు చెందిన వస్తువు. కావుననే నాదికాదు. నేను దాన్ని యెఱిగే ద్రష్టను మాత్రం. ఘటానికి ఘటద్రష్టవలె ఆ చక్షురింద్రియానికి విలక్షణంగా ఉన్నాను.

4. జిహ్వేంద్రియము (నాలుక) జలముయొక్క సత్త్వగుణభాగం. అది షడ్రుచులను గ్రహిస్తుంది. ఆ సంగతిని నేనే తెలుసుకొంటున్నాను. అది రుచులను గ్రహించినప్పుడు గ్రహించేటప్పుడు గ్రహిస్తుందని, గ్రహించనప్పుడు గ్రహించలేదని దాని భావాభావాలను తెలుసుకొంటూన్నాను. తెలుసుకొనేవాడు తెలియబడే వస్తువుకు వేరై ఉండాలనే నియమాన్ని బట్టినేను జిహ్వేంద్రియం కాదు. అది జలాంశం కాబట్టి జలానికి సంబంధించిందే కాని నాది కాదు. నేను దానిని తెలుసుకొనే ద్రష్టను మాత్రం, ఘటానికి ఘటద్రష్టవలె నేను జిహ్వేంద్రియానికి భిన్నంగా ఉన్నాను.

5. ఘ్రాణేంద్రియం (ముక్కు). ఈ యింద్రియం పృథివి యొక్క సత్త్వగుణాంశము. ఇది పృథివియొక్క గుణమగు గంధాన్ని పేర్కొంటుంది. ఆ సంగతిని నేను తెలుసుకొంటూ, అది పేర్కొనకున్నా ఆ భావా భావాలను ఆ ప్రవృత్తి నివృత్తులను నేనెఱుగుతున్నాను. కాబట్టి నేను ఘ్రాణేంద్రియం కాను. అది పృథివి భాగం, నాదికాదు. నేను తెలుసుకొనే ద్రష్టనుమాత్రం. ఘటానికి ఘటద్రష్టవలె ఘ్రాణేంద్రియానికి నేను 'అలాగే'గా ఉన్నాను.

ఈ విధంగానే పంచభూతాల రజోగుణాంశాలయిన వాక్కు, పాణి, పాద, గుహ్య, గుదములనే అయిదు కర్మేంద్రియాలు ఆయా భూతాలకు సంబంధించినవే కాని నావికావు. 1) వాక్కు మాట్లాడ్తుంది. (2) చేతులు చేసేపని యిచ్చుట పుచ్చుకొనుట (3) పాదాలు రాకపోకలు సాగిస్తవి. (4) గుహ్యాము రస (మూత్ర – వీర్య)మును వదుల్తుంది. (5)గుదము మలత్యాగం చేస్తుంది. ఆ యింద్రియాలు ఆ పనులను చేయుట చేయకుండుట యీ రెంటిని నేను గుర్తిస్తాను. కాబట్టి ఆ కర్మేంద్రియాలు నేనుకాదు. అవి ఆయా భూతాలకు చెందినవి; కాబట్టి నావికావు నేను వాటిని తెలుసుకొనే ద్రష్టనుమాత్రం. ఘటానికి ఘటద్రష్టవలె నేను వాటికి వేరుగా ఉన్నాను.

అట్లే ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానాలనే పంచప్రాణాలు. అవి వాటి క్రియలందు ప్రవర్తించేటపుడు ప్రవర్తించనప్పుడు కూడా నేను తెలుసుకుంటున్నాను. కావున ఆ ప్రాణాలు నేను కాదు. అవి పంచమహాభూతాల రజోగుణాంశాలకు చెందినవి కాబట్టి నావి కావు. నేను వాటిని తెలుసుకొనే ద్రష్టను మాత్రం. ఘటానికి ఘటద్రష్ట వలె ఆ ప్రాణాలకు భిన్నంగా ఉన్నాను.

## పంచప్రాణాల క్రియలు వాటి స్థానాలు

1. వ్యానవాయువు శరీరమందంతటా వ్యాపించి దేహము యొక్క సర్వసంధులలో పరిభ్రమిస్తూంటుంది.

2. సమానవాయువు నాభిస్థానంలో ఉండి మనుష్యుడు స్వీకరించే అన్నాన్నీ నీటిని జఠరాగ్నిలో పక్వంచేసి దానిని స్థూలము మధ్యమము సూక్ష్మమని మూడుగా విభాగిస్తుంది. అందులో అన్నముయొక్క సూక్ష్మభాగం హృదయానికి చేరి మనోబుద్ధులకు పుష్టిని కల్గిస్తుంది. జలముయొక్క సూక్ష్మ భాగం ప్రాణానికి జలాన్ని చేకూర్చుతుంది. అన్నంలోని స్థూలభాగం మలంగానూ జలంలోని స్థూలభాగం మూత్రంగానూ పరిణమించి బహిర్గతమైతాయి. ఇక మిగిలిన అన్న జలాలలోని మధ్యమ రసభాగాన్ని సమానవాయువు నాడులద్వారా గొంపోయి దేహమందలి రోమరోమాలకు చేరవేస్తుంది. ఆ రసమే రక్తమాంసాలుగా పరిణమించి దేహానికి పుష్టి కల్గిస్తుంది. తోటమాలి బావిలోని నీటిని బైటికి తోడి కాలువల గుండా ప్రతి చెట్టుకు పారగట్టుతాడు. చెట్లు వికసిస్తాయి. అట్లే సమాన వాయువనే తోటమాలి దేహమనే తోటలోని అవయవాలు రోమాలనే వృక్షాలకు అన్నజలాల రసమనే నీటిని నాడులనే కాల్వలద్వారా అందజేస్తాడు. తద్వారా శరీరం వర్ధిల్లుతుంది.

3. ఉదానవాయువు కంఠస్థానంలో ఉంది. మనుష్యుడు తినే అన్నమును నీటిని తగిన దారులలో యిది లోనికి రవాణా చేస్తుంది. ఆ కంఠస్థానంలో వుండే సూక్ష్మమైన కలలను కంటూ యెక్కిళ్ళను కల్గిస్తుంటుంది.

4. ప్రాణవాయువునకు స్థానం హృదయము. ఇది రాత్రింబగళ్లు కలిసి యిరవై ఒక్కవేల ఆరువందలు శ్వాసోచ్ఛ్వాసలను విడుస్తుంది.

5. అపానవాయువు గుదస్థానమందుండి మలవిసర్జనం చేస్తుంది.

పంచభూతాల సమష్టి సత్త్వగుణాంశం మనస్సు, అది సంకల్ప వికల్పాలను చేస్తుంది. ఆ క్రియను నేను తెలుసుకొంటాను. అది సంకల్ప వికల్పాలను చేయనప్పుడు చేయటం లేదని కూడా తెలుసుకొంటుంటాను. కాబట్టి మనస్సు నేను కాను. సమష్టి సత్త్వ గుణాంశానికి చెందింది కాబట్టే అది కూడా నాది కాదు. ఘటానికి ఘటద్రష్టవలె మనస్సును తెలుసుకొనే నేను మనస్సునకు వేరై ఉన్నాను.

అట్లే పంచభూతాల సమష్టి సత్త్వగుణాంశము బుద్ధి, అది నిశ్చయం చేస్తుంది. అది నిశ్చయం చేస్తూండేటప్పుడు చేస్తూందని, చేయనప్పుడు చేయలేదని యెరిగేవాణ్ణి నేను కాబట్టి ఆ బుద్ధి నేను కాదు. అది సత్త్వగుణానికి చెందింది కాబట్టి అది కూడా నాది కాదు. ఘటానికి ఘటద్రష్ట భిన్నమై ఉన్నట్లు బుద్ధిని తెలుసుకొనే నేను బుద్ధికి వేరై ఉన్నాను.

ఈ విధంగా యీ పదేడు తత్త్వాలు నేను కాదని అవి నావి కావని తెలుసుకోవలసి ఉంది.

**శిష్యుడు :** ఈ విధంగా తెలుసుకోవడంతో కలిగే చివరి నిశ్చయమేమిటి?

**గురువు :** (1) సూక్ష్మ (లింగ - వాసనా) దేహము - దాని ధర్మాలు, అనగా పుణ్యపాపాలు చేయుట సుఖదుఃఖాలు అనుభవించుట లోకాంతర గమనాగమనాలు శమ దమ వైరాగ్యాది సాత్త్వికీ వృత్తులు రాగ ద్వేష హర్షాది రాజసీవృత్తులు నిద్రాలస్య ప్రమాదాది తామసీవృత్తులు క్షుధా తృష్ణా అంధత్వపటుత్వాది ధర్మాలు నేను కాదు; అవి నావి కూడా కావు అను నిశ్చయం యేర్పడుతుంది.

**శిష్యుడు :** పుణ్య పాపాలకు నేను కర్తనుకాదు. వాటి ఫలాలైన సుఖదుఃఖాలకు నేను భోక్తనుకాను. ఆ కర్తృత్వ భోక్తృత్వాలు నా ధర్మాలు కావని తెలుసుకొనే విధానంయెట్లు?

**గురువు :** క్రియావంతుని కర్త అంటారు. క్రియ వికారయుక్తమయ్యే ఉంటుంది. కాబట్టి కర్తకూడా వికారికాక తప్పదు. నేను నిర్వికారుణ్ణి; కూటస్థుణ్ణి కావడంబట్టి క్రియకు ఆశ్రయుణ్ణికాదు. కావుననే పుణ్య పాపరూప క్రియలకు నేను కర్తను కాదు. కర్తను కాదు కాబట్టి భోక్తనుకూడ కాను. కర్తృత్వభోక్తృత్వాలు అంతఃకరణ ధర్మాలు. అవి నావికావు. ఆ ధర్మాలను చూచే ద్రష్టను నేను. ఘట ద్రష్టవలె వాటికి నేను వేరై ఉన్నాను - యీ విధంగా విచారించి తెలుసుకోవాలె.

**శిష్యుడు** : ఈ లోకానికి రావడం పరలోకానికి పోవడం యిట్టి లోకాంతర గమనాగమనాలు నా ధర్మాలు కావని యే విధంగా తెలియాలే?

**గురువు** : అంతఃకరణ (లింగదేహం) పరిచ్ఛిన్నమైంది. ప్రారబ్ధకర్మము యొక్క వేగంతో ఆ లింగదేహానికి గమనా గమనాలు సంభవిస్తాయి. కానీ ఆకాశంవలె వ్యాపకుడనైన నాకు యీ లోకానికి రావడం ఆలోకానికి పోవడమనే గమనా గమన ధర్మాలు లేవు అని తెలియాలి.

దేశ కాలవస్తువులతో ఖండం కాని వస్తువును వ్యాపకమనీ, ఖండమైన వస్తువును పరిచ్ఛిన్నమనీ అంటారు.

**శిష్యుడు** : సాత్త్వికి రాజసి తామసీవృత్తులు నేను కానని ఆ ధర్మాలు నావి కావనీ యే విధంగా గ్రహించాలె?

**గురువు** : విను (1) ఒక భవనంలో ఆసీనుడై ఉన్న (2) రాజును రంజింపజేసేందుకై (3) ఒకానొక శిల్పి (4) ఒక ఊర్ధ్వధారాయంత్రాన్ని నిర్మించాడు. (5) దాని కొళాయి త్రిప్పినంతనే మూడు ధారలు బయల్దేర్తాయి. (6) ఆ మూడు ధారలనుండి అనంతధారలు బయల్దేర్తాయి (7) కొళాయిని ఆపితే మూడుధారలు ఆగిపోతాయి. రాజొక్కడే మిగిలి ఉంటాడు. ఇది దృష్టాంతం.

ఇక దార్ష్టాంతం. (1) స్థూల శరీరమే ఒక భవనం. (2) దీనిలో అధిష్ఠాన కూటస్థ రూపంలో ఉండే పరమాత్మే రాజు. (3) అతని వినోదం కోసం మాయ (అజ్ఞానం) అనే శిల్పి. (4) అంతఃకరణమనే యంత్రాన్ని నిర్మించాడు. (5) జాగ్రత్ స్వప్నాలలో ప్రారబ్ధమనే కొళాయిముఖం తెరువగానే త్రిగుణాలనే ధారలు బయలుదేరి (6) తద్వారా అనంత వృత్తులు ఆవిర్భవిస్తాయి . (7) సుషుప్తిలో ప్రారబ్ధకర్మమనే కొళాయి బంధింపబడేసరికి వృత్తిసాక్షి స్వయంప్రకాశికుడు ఆనంద స్వరూపుడూ అయిన ఆత్మదేవుడు రాజులాగ ఒక్కడూ మిగిలి ఉంటాడు.

అతడే నేను. నాచే ప్రకాశింపజేయబడే సాత్త్వికీ రాజసీ తామసీ వృత్తులు నేనుకాదు. ఆ వృత్తులు అంతఃకరణ సంబంధమైనవి కాబట్టి అవి కూడా నావికావు. నేను వాటిని తెలుసుకొనే ద్రష్టను మాత్రం. ఘటద్రష్టవలె ఆ వృత్తులకు నేను వేరై ఉన్నాను. యీ విధంగా గ్రహించాలె.

**శిష్యుడు :** అంధత్వ మందత్వ పటుత్వాలు నేనుకాదు; నావి కావని యేలాగ నిశ్చయించాలె?

**గురువు :** (1) నేత్రాది ఇంద్రియాలు వాటివాటి విషయాలను బొత్తిగా గ్రహింప లేకపోతే అది వాటి అంధత్వం. ఆ అంధత్వ ధర్మాన్ని నేను చక్కగా తెలుసుకోగల్లు చున్నాను. (2) ఆ నేత్రాది ఇంద్రియాలు తమ తమ విషయాలను కొద్దికొద్దిగా మాత్రం గ్రహించగలిగితే అది వాటి మందత్వం. కంటికి చూచేశక్తి చెవికి వినే శక్తి, అట్లే ఆయా యింద్రియాలకుగల శక్తి తగ్గిపోయి ఉండటం యింద్రియాల మందత్వమంటారు ఆ మందత్వ ధర్మాన్ని కూడా నేను తెలుసుకోకల్గుచున్నాను. (3) నేత్రాది ఇంద్రియాలు తమ తమ విషయాలను స్ఫుటంగా తెలుసుకోగల్గితే అది వాటి పటుత్వధర్మం. ఆ పటుత్వధర్మాన్ని కూడా గ్రహించే వాణ్ణి నేను.

ఈ కారణాలనుబట్టి ఆ అంధత్వ మందత్వ పటుత్వాలు నేనుకాదు అవి యింద్రియ ధర్మాలు; కావున నావికావు. వాటి ద్రష్టనైన నేను ఘటద్రష్ట ఘటానికివలె వాటికి విలక్ష ణంగా ఉన్నాను. ఈ విధంగా నేను సూక్ష్మదేహానికి ద్రష్టనంటు నిశ్చయం చేసుకోవాలె.

వేదాంతగోష్ఠిలో సూక్ష్మదేహ విచారాన్ని గురించిన
నాల్గవ ఘట్టం ముగిసింది.

**శ్లో॥ మూత్రశోణిత దుర్గంధే, హ్యామేధ్య ద్వార దూషితే॥**
**చర్మకుండే యేరమన్తి, తేలిప్యన్తేన సంశయః॥**

తా॥ రక్త మాంసాలతో కలుషితమై మూత్రంచే మలినమై దుర్గంధ భూయిష్ఠమైన స్త్రీ శరీరంలోని "యోని" ద్వారము దుర్భేద్య, దుర్వాసనను వెదజల్లుచుండ ఆమురికి కూపంలో జలకమాడాలని, ఆ దుర్గంధాన్ని అలుముకోవాలని, ఆదుర్మలినాన్ని పులుముకోవాలని, అర్రులు చాచే వెర్రి ఆవేదన, ఉమ్మితొట్టిలో కదిలాడే పురుగుల వంటిదని, నిరసించాలి. అట్టి అయోమయ జీవులు సంసార మలిన వాసనలచే కలుషితమవుతూ, జన్మలను పొందుతూ అధోగతి పాలవుతున్నారు. మనస్సులో కదిలే ఆవేశ ప్రవాహాన్ని దారి మళ్లించి పరమాత్మయందు సమరంచేసి తరించాలని దత్త గురువు తెలియజేయుచున్నారు.



# వేదాంత గోష్ఠి

## అయిదవ ఘట్టం
## (కారణ దేహవిచారణ)

**శిష్యుడు :** కారణ శరీరమంటూ దేన్ని చెప్పాలె?

**గురువు :** (1) మనుష్యుడు సుషుప్తినుండి లేస్తూనే "నాకేమి తెలియదు" అని అంటాడు. దీనివల్ల సుషుప్తిలో అజ్ఞాన ముందనుట తెలుస్తుంది.

"నాకేమి తెలియలేదు" అనేది కూడా ఒక విధమైన జ్ఞానమే. ఈ జ్ఞానం అనుభవ రూపంకాదు. సుషుప్తిలో అనుభవించిన అజ్ఞానముయొక్క స్మృతి యిది. ఈ స్మృతికి విషయం నిద్రలో అనుభవించిన అజ్ఞానం.

(2) జాగ్రదవస్థలో కూడా "నేను బ్రహ్మాన్ని యెరుగను. నన్ను నేనెరుగను అది నాకు తెలియదు; యిది నాకు తెలియదు" అని మనుష్యుడు వ్యవహరిస్తాడు. ఈ సందర్భంలో కూడా తెలియకపోవడమనే అనుభవానికి విషయం అజ్ఞానమే.

(3) స్వప్నానికి కారణం నిద్రారూపమైన అజ్ఞానమే ఈ అజ్ఞానమే కారణదేహమని చెప్పబడ్తుంది.

అజ్ఞానమంటే ప్రకాశరాహిత్యం, తానుస్వయంగా ప్రకాశ రహితమై తాను ఆశ్రయించిన వస్తువును సైతం తెలియకుండా (అప్రకాశితం) చేస్తుంది అజ్ఞానం. ఇంటిలోని చీకటి స్వయంగా ప్రకాశరహితమై ఉండి యింటిలోని వస్తువులను, తాను ఆశ్రయించిన ఇంటిని ప్రకాశింపకుండా చేస్తుంది. అట్టిదే అజ్ఞానం.

ఈ అజ్ఞానం స్థూలసూక్ష్మదేహాలకు హేతువు కాబట్టి కారణమంటారు. ఇది తత్త్వ జ్ఞానం ద్వారా దహింపబడ్తుంది కాబట్టి దేహమంటారు.

**శిష్యుడు :** కారణదేహం నేనుకాదు; అది నాది కాదనే నిశ్చయం యెలా కల్గుతుంది?

**గురువు :** "నేనెరుగుదును – నేనెరుగను" అనేవి అంతఃకరణ వృత్తులు. ఆ వృత్తులను వాటిని విషయసహితంగా నేనెరుగుతున్నాను. కాబట్టి కారణదేహం నేనుకాదు; అది అజ్ఞానానికి చెందింది కాబట్టి నాదికాదు.

"అది అజ్ఞానానికి చెందింది" అని యీ చెప్పినమాట కూడా అంత సమంజసంకాదు. ఎందుకనగా అజ్ఞానమే కారణదేహం కారణదేహమంటే అజ్ఞానమే. "అజ్ఞానానికి చెందింది" అని అంటే, అజ్ఞానం ఒకటి ఉండి దానికి చెందిన కారణదేహం ఒకటి ఉన్నట్లు అర్థమౌతుంది. అది తప్పు.

"రాహువు తల" అనినప్పుడు "రాహుగ్రహము దానికి ఒక తల" యీ విధంగా మనం భావిస్తాం. కానీ రాహువునకు తల తప్ప మరి శరీరం లేదు. రాహువే తల. తల మాత్రమే రాహువు. అయినారాహువు తల అనుట పరిపాటి, ఆ విధమే కారణదేహం అజ్ఞానానికి చెందిందని చెప్పుట. అజ్ఞానమన్నా కారణదేహమన్నా ఒకటే.

"నేను కారణదేహాన్ని తెలుసుకొనేవాణ్ణి కాబట్టి అది నేను కాదు; అది అజ్ఞానానికి చెందింది. నాదికాదు. దాన్ని ఎరిగే ద్రష్టను నేను. ఘటద్రష్ట ఘటానికివలె నేను కారణదేహానికి భిన్నంగా ఉన్నాను" – అని యీ విధంగా నిశ్చయించాలె. ఇది కారణ దేహవిచారం.

వేదాంత గోష్ఠిలో కారణదేహ విచారాన్ని గురించిన

అయిదవఘట్టం ముగిసింది.

**శ్లో॥ ఆదౌ చతుః పాద తలైకదేశే, ద్వౌనాభిదేశే సకృదాస్యమణ్డలే।**
**సర్వాంగ దేశేషు చ సప్తవారం, దేవార్తికం భక్తజనాః ప్రకుర్యాత్॥**

తా॥ భగవంతునికి, గురువుకు హారతి ఇచ్చేటప్పుడు పాదాలకు 4 చుట్లు, నాభికి 2 చుట్లు, ముఖానికి 1 చుట్టు, సర్వాంగాలకు 7 చుట్లు ఇవ్వవలెను.



# వేదాంత గోష్ఠి

## ఆరవ ఘట్టం
## (ఆత్మ పంచకోశాతీతుడు)

**శిష్యుడు :** పంచకోశాతీతుడంటే అర్థం యేమి?

**గురువు :** అతీతుడంటే వేరై ఉండేవాడని అర్థం. పంచకోశాలకు వేరై ఉండేవాడు పంచకోశాతీతుడు.

**శిష్యుడు :** కోశమంటే యేమి?

**గురువు :** కోశమంటే ముసుగు.

1. ఖడ్గాన్ని ఉంచే ఒఱను కోశమంటారు.

2. ధనాన్ని దాచే చోటును కోశమంటారు.

3. ఒక విధమైన కీటకం (పట్టుపురుగు) తన చుట్టు అల్లుకొన్న గూటిని కోశమంటారు. కోశము ఖడ్గాన్ని మూసివేస్తుంది. కోశము ధనాన్ని దాచుతుంది. కోశము కీటకాన్ని ఆవరిస్తుంది. అట్లే పంచకోశాలు ఆత్మను ఆవరించి మూయగల్గుతాయి కాబట్టి వాటికి కోశాలని పేరు కల్గింది.

**శిష్యుడు :** ఈ పంచకోశాల పేర్లేమిటి?

**గురువు :** (1) అన్నమయము (2) ప్రాణమయము (3) మనోమయము (4) విజ్ఞానమయము (5) ఆనందమయములని వాటి పేర్లు.

**శిష్యుడు :** అన్నమయకోశమనగానేమి? ఆ పేరు యే విధంగా కల్గింది?

**గురువు :** తల్లిదండ్రులు తిన్న అన్నరసం రజోవీర్యాలుగా మారి వాటి సంయోగంతో యీ శరీరం తల్లిగర్భం నుండి జనించింది (2) జన్మించిన తర్వాత అన్నంతోనే వృద్ధి బొందింది. (3) మరణించిన తర్వాత అన్నమయమైన పృథ్వీలో లయిస్తుంది. కాబట్టి యీ స్థూలదేహాన్ని అన్నమయకోశమంటారు. అన్నం (ఆహారం)తోనే పుట్టి ఉండి, పెరిగి ఆ మీద అన్న రూప పృథ్వీలో కలిసిపోతుంది. కాబట్టి యీ స్థూల శరీరం అన్నమయ కోశమనబడింది.

**శిష్యుడు :** ఈ అన్నమయకోశము యేలాంటిది?

**గురువు :** అన్నమయకోశమని చెప్పబడే యీ స్థూల శరీర సుఖ దుఃఖ భోగాల ననుభవించే స్థానమై ఉంది, కాబట్టే దీనికి భోగాయతనమనే మరొక్క పేరు కూడా ఉంది.

**శిష్యుడు :** ఈ అన్నమయకోశానికి నేను అతీతంగా విలక్షణంగా ఉన్నాననే విషయం యేవిధంగా గ్రహించాలి.

**గురవు :** ఈ స్థూల శరీరం తల్లిగర్భమునుండి పుట్టక ముందు ఎక్కడుండిందో తెలియదు. చచ్చిన తర్వాత యేమైతుందో తెలియదు. మధ్యకాలంలో మాత్రం కానొస్తుంది. దీనికి ఉత్పత్తి వినాశాలున్నాయి. ఉత్పత్తి వినాశాలు కలవు కాబట్టి ఘటాన్ని కార్యవస్తువంటున్నాం. ఈ అన్నమయకోశానికి కూడా ఉత్పత్తి వినాశాలున్నాయి. కాబట్టి యిది కార్యవస్తువనే చెప్పబడ్తుంది.

"నేను యెప్పుడూ ఉండేవాణ్ణి; భావరూపుణ్ణి; నాకు ఉత్పత్తి నాశాలులేవు. నా స్వరూపం స్థూల శరీరానికి విలక్షణమైనది. కాబట్టి అన్న మయకోశం నేను కాదు. అది స్థూలదేహ రూపమైనది. కావున నాది కూడా కాదు. ఆ అన్నమయ కోశాన్ని తెలుసుకొనే ద్రష్టను నేను." అని ఈ విధంగా అన్న మయకోశానికి తాను అతీతమని విలక్షణమని గుర్తించాలె.

**శిష్యుడు :** ప్రాణమయకోశముయొక్క స్వరూపమేమి?

**గురువు :** పంచకర్మేంద్రియాలతో కూడిన పంచప్రాణాలను ప్రాణమయ కోశమంటారు. లేదా పంచప్రాణాలు ఉపప్రాణాలు చేరి ప్రాణమయకోశమని చెప్పొటకద్దు.

**శిష్యుడు** : స్వామీ! కర్మేంద్రియాలను ప్రాణాలను గూర్చి వెనుకటి ఘట్టాలలో చెప్పారు. కానీ ఉపప్రాణాలను గూర్చి చెప్పలేదు. వాటి వివరం చెప్పండి.

**గురువు** : నాగ, కూర్మ, కృకర, దేవతత్త, ధనంజయాలని ఉపప్రాణాలు అయిదు. అవి చేసే పనులను విను.

(1) నాగవాయువు త్రేపులను కల్గిస్తుంది. (2) కూర్మ వాయువువల్ల రెప్పపాటు సంభవిస్తుంది. (3) కృకర వాయువతో తుమ్ములువస్తాయి (4) దేవదత్తవాయువు ద్వారా ఆవలింతలు కల్గుతాయి. (5) ధనంజయవాయువు శరీరమంతానిండి దేహాన్ని స్థూలం చేస్తుంది. మరణించిన తర్వాత కూడా దేహంలో నిలిచివుండి కళేబరాన్ని ఉబ్బిస్తుంది. ఈ వాయువునకు ధనుర్వాయు ప్రాణమని అంటారు.

ఇట్లు పంచప్రాణాలు పంచ ఉపప్రాణాలు కలిసి ప్రాణమయకోశం యేర్పడింది. ఆ వాయువులు శరీరమంతా వ్యాపించి శక్తినిస్తూ ఆయా యింద్రియాలను వాటి వాటి పనులలో ప్రవర్తింపజేస్తున్నాయి.

**శిష్యుడు** : గురుదేవా! ఈ ప్రాణమయ కోశానికంటె నేను వేరంటూ యే విధంగా తెలుసుకోవాలె?

**గురువు** : నాయనా! విను రాత్రిళ్ళు జీవుడు నిద్రలో వుండేటప్పుడు ప్రాణాలు తిరుగాడ్తునే ఉంటాయి. కానీ యేమి జరిగినా తెలుసుకోలేవు. ఇష్టమిత్రులు వస్తే ఆదరించలేవు. దొంగలు దోపిడి చేస్తే అటకాయించలేవు. మొద్దువలె జడాలు.

"నేనో చైతన్య స్వరూపుణ్ణి. ప్రాణాలవలె నా స్వభావం జడంకాదు. కాబట్టి నేనాకోశానికి విలక్షణుణ్ణి. అది నేను కాదు. అది సూక్ష్మ శరీరానికి చెందింది కాబట్టి నాది కూడా కాదు. నేనాప్రాణమయ కోశాన్ని తెలుసుకొనే ఆత్మను" అంటూ విచారించి తెలుసుకోవాలె.

**శిష్యుడు** : స్వామీ! మనోమయకోశమంటూ దేన్ని చెబుతారు?

**గురువు** : పంచ జ్ఞానేంద్రియాలతో కూడిన మనస్సును మనోమయ కోశమంటారు.

అది ప్రాణమయకోశంలోగా వుంది. పంచజ్ఞానేంద్రియాలు వివరాలు వెనుక నాల్గో ఘట్టంలో చెప్పబడ్డాయి. గుర్తించుకో.

**శిష్యుడు :** మనస్సెట్టిదో దాని స్వభావ మేలాంటిదో సెలవిందు?

**గురువు :** దేహంపై 'అహం' బుద్ధి దేహసంబంధ వస్తువులపై 'మమ' బుద్ధి, యింద్రియ ద్వారాలగుండా బైటికి పరుగెత్తి పోతుండటం దానికి సహజ స్వభావం.

**శిష్యుడు :** 'ఈ మనస్సునకు ఖచ్చితమైన స్వరూపం లేదు. కామమై క్రోధమై నానా వృత్తులుగా రంగులు మారుస్తుంది. ఇది వికార శీలమైంది. నేనో ఆ వృత్తులకు సాక్షినై నిర్వికారస్వభావంతో వున్నాను.

కాబట్టి ఈ మనోమయకోశం నేనుకాదు. అది సూక్ష్మదేహానికి సంబంధించింది. అందువలన నాదికూడకాదు. దాన్ని గుర్తెరిగే ఆత్మను నేను దానికి వేరైవున్నాను" అని యీ విధంగా తన్ను మనోమయ కోశానికి భిన్నంగా గ్రహించాలె.

**శిష్యుడు :** విజ్ఞానమయకోశంయొక్క స్వరూపమేమి?

**గురువు :** పంచజ్ఞానేంద్రియాలతో కూడిన బుద్ధిని విజ్ఞానమయ కోశమంటారు. ఆ విజ్ఞానమయకోశం మనోమయ కోశానికి లోపలవుంది.

**శిష్యుడు :** బుద్ధియొక్క స్వరూపమెట్టిది?

**గురువు :** ఆ బుద్ధి సుషుప్తి కాలంలో చిదాభాస హితంగా తన ఉపదాన కారణమైన అజ్ఞానంలో లయించిపోతుంది. జాగ్రదవస్థలో నఖశిఖ పర్యంతం దేహమంతా వ్యాపించి కర్తృభావంతో వ్యవహరిస్తుంది.

**శిష్యుడు :** ఈ విజ్ఞానమయకోశముకంటె నేను భిన్నంగా వున్నానంటు యేవిధంగా గ్రహించాలె?

**గురువు :** ఈ విజ్ఞానమయకోశం (బుద్ధి) ఒక అవస్థలో వుండి మరో అవస్థలో లేకుండాపోతూంది. కుండకువలె దీనికి విలయాద్యవస్థలున్నాయి. నేను విలయాద్యవస్థలకు సాక్షిని. నాకా విలయాద్యవస్థలులేవు. అది వినాశి నేనవినాశిని. నా స్వరూపం ఆ బుద్ధికి విలక్షణమైవుంది ఇన్ని కారణాలనుబట్టి విజ్ఞానమయకోశమని

చెప్పబడే బుద్ధి నేనుకాదు. అంతేకాదు, ఆ విజ్ఞానమయకోశం సూక్ష్మదేహ సంబంధమై వుండేది. కాబట్టి నాదికాదు. నేనాకోశాన్ని తెలుసుకొనేవాణ్ణి ఆత్మను. దానికి భిన్నంగా ఉన్నాను ఈ విధంగా విచారించి గ్రహించాలె.

సూక్ష్మదేహంతో ప్రాణమయ మనోమయ విజ్ఞానమయకోశాలు మూడు చేరే యున్నాయి. సూక్ష్మదేహం ఈ కోశత్రయ స్వరూపమైంది.

1) దీపప్రకాశము ఆకాశము కలిసి ఒక్కరూపంగా కనబడినప్పటికి ప్రకాశం వేరే ఆకాశం వేరే.

2) అట్లే కాగిన యినుము అగ్గిలాగానే కానొస్తుంది. కాని యినుంవేరే. అగ్గివేరే.

అట్లే అంతఃకరణము ఆత్మా, ఏకరూపంగానే కానొస్తున్నప్పటికి దేనికది వేర్వేరుగానే ఉన్నాయి. కారణమేమంటే; నిద్రావస్థలో అంతఃకరణం తన ఉపాదాన కారణమైన అజ్ఞానం (అవిద్య)లో లయిస్తుంది. కాని ఆత్మమాత్రం ఆ అజ్ఞానానికి అవిద్యకు సాక్షియై ప్రత్యేకంగా ప్రకాశిస్తుంది అందువలన విజ్ఞానమయకోశానికంటే ఆత్మభిన్నంగా వుందని గ్రహించాలె.

**శిష్యుడు :** ఆనందమయ కోశముయొక్క స్వరూపమేమి?

**గురువు :** నిష్కామంగా చేసిన శుభకర్మలయొక్క పుణ్యఫలం అనుభవానికి వచ్చిన సమయంలో బుద్ధివృత్తిలో ఆత్మ స్వరూపంయొక్క ఆనంద ప్రతిబింబం సంభవిస్తుంది. అట్టి వృత్తిని ప్రియమోద ప్రమోద రూపంగా చెబుతారు.

ఆ ఆనందరూపవృత్తి పుణ్యకర్మ ఫలభోగం సమాప్తం కాగానే నిద్రారూపం ధరిస్తుంది. నిద్రలో లయిస్తుంది. ఆ వృత్తినే ఆనందమయకోశం అంటారు లేదా,

కారణ శరీరమనబడే అవిద్యలోని మలినతత్త్వం ప్రియమోద ప్రమోద వృత్తిరూపం ధరిస్తుంది ఆ వృత్తిద్వారా కలిగే ఆనందాన్ని ఆనందమయకోశం అంటారు.

**శిష్యుడు :** ఆ ఆనందమయకోశ మెట్టిదో చెప్పండి?

**గురువు :** ఇష్టమైన వస్తువును చూచినప్పుడు మనకు ఆనందం కల్గుతుంది. ఆ వృత్తిని ప్రియవృత్తి అంటారు. ఆ యిష్టవస్తువు లభించినప్పుడు అంతఃకరణములో

కలిగే ఆనందాన్ని మోదవృత్తి అంటారు. ఆ వస్తువును అనుభవించుటతో కలిగే ఆనందాన్ని ప్రమోదవృత్తి అంటారు. ఈ విధంగా విషయ సంబంధమైన ప్రియవృత్తి మోదవృత్తి ప్రమోదవృత్తులనే త్రివిధవృత్తులతో కూడినదే ఆనందమయకోశం.

శాస్త్రాలు పక్షిని ఉపమానంగానిచ్చి ఈ కోశాన్ని వర్ణించాయి. (1) ఆ పక్షికి శిరస్సు ప్రియవృత్తి (2) మోదవృత్తి కుడిరెక్క (3) ప్రమోదవృత్తి యెడమరెక్క (4) బుద్ధివృత్తిలో లేదా అజ్ఞాన వృత్తిలో ఆత్మస్వరూపభూతమైన యే ఆనందముయొక్క ప్రతిబింబమైతే కలదో - అది ఆ పక్షియొక్క స్వరూపం (5) బింబరూపమైన ఆత్మస్వరూప భూత ఆనందము ఆ పక్షియొక్క పుచ్ఛం అనగా ఆధారం. ఇట్టి పక్షిరూపంలో చెప్పబడిన భోక్తయే ఆనందమయకోశం.

**శిష్యుడు :** ఆ ఆనందమయ కోశానికంటె నేను విలక్షణుణ్ణి అంటూ యే విధంగా గ్రహించాలె?

**గురువు :** వర్షాకాలంలో మేఘాలు వచ్చి తర్వాత విచ్చిపోవునట్లు ఈ ఆనందమయ కోశం కొంతకాలముండి పోయేది కాబట్టి యిది క్షణికం; నేను సర్వదా సద్రూపుణ్ణి. కాబట్టే నిత్యుణ్ణి. ఈ కారణాన్నిబట్టి ఆనందమయకోశం నేను కాదు. అంతేకాదు. ఆ కోశం కారణదేహానికి చెందింది నాది కాదు. దాన్ని యెరిగే ఆత్మను నేను ఆ కోశానికి వేరై వున్నాను - అని యీ విధంగా గ్రహించాలె.

**శిష్యుడు :** ఉండే పంచకోశాలు ఆత్మకాకపోతే యిక మరి ఆత్మయేది?

**గురువు :** బుద్ధియందు లేదా వ్యష్టి అజ్ఞానమునందు ప్రతిబింబరూపంగా వుండి ప్రియమోదాది శబ్దాలలో చెప్పబడిన ఆనందమయకోశానికి బింబరూప కారణమై యే ఆనందమైతే కలదో అది నిత్యమై వుంది కాబట్టి అదే ఆత్మ.

**శిష్యుడు :** మీరు యింతవరకు చెప్పిన పంచకోశాలు అనుభవానికి వస్తాయి. కానీ వాటికి భిన్నమయినదని చెప్పే "ఆత్మ" అనుభవానికి రావడంలేదు. మరి ఆత్మ పంచకోశ లక్షణమైందంటూ యెలాగ్రహించాలో చెప్పండి.

**గురువు :** కుమారా! పంచకోశాలు అనుభవానికి వస్తున్నాయి. కాని వాటికి విలక్షణమైన ఆత్మ అనుభవానికి రావడం లేదే అని నీవడిగిన మాట సరిగానే ఉంది.

కానీ విను. యే జ్ఞానంతో ఈ పంచకోశాల అనుభవం కల్గిందో, ఆ అనుభవానికి ఆధారమయిన జ్ఞానాన్ని నిర్లక్ష్యం చేయటం తగదు. ఈ విధంగా పంచకోశాల అనుభవానికి మూలమయిన చైతన్యమే ఆత్మ. అది యీ పంచకోశాలకు భిన్నంగా వుంది.

**శిష్యుడు :** ఆ ఆత్మ యేలాంటిది?

**గురువు :** అన్నమయకోశమని చెప్పబడే స్థూలదేహం, ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ కోశములని చెప్పబడే సూక్ష్మదేహం. ఆనందమయ కోశమని చెప్పబడే కారణదేహం - ఈ పంచకోశాలకంటె - అనగా మూడు దేహాలకంటె భిన్నమయి సత్తు, చిత్తు, ఆనందాది స్వరూపమయినదే ఆత్మ.

వేదాంతగోష్ఠిలో పంచకోశ విచారాన్ని గురించిన

ఆరోఘట్టం ముగిసింది.

## నిద్రించిన ఏడుగురిని మేల్కొల్పాలి

శ్లో॥ విద్యార్థీన్ సేవకః పాంథః క్షుధార్తీ భయకారకః।
భాండారీ ప్రతీహారీచ, సప్త సుప్తాన్ ప్రబోధయేత్॥

తా॥ విద్యార్థులను, సేవకులను, బాటసారులను, ఆకలిగొన్నవారిని, భయమొందిన వారిని, పదార్థ సంరక్షకుడిని, ద్వారపాలకులను (కాపలాకాయువాడిని) ఈ ఏడుగురిని నిద్రపోవుచుండిన యెడల మేల్కొల్పవలెను.

## నిద్రించిన ఏడుగురిని మేల్కొల్పవద్దు

శ్లో॥ అహిం నృపంచ శార్దూలం, కీటంచ బాలకం తథా।
పరశ్వానంచ మూర్ఖంచ, సప్తసుప్తాన్ నబోధయేత్॥

తా॥ పామును, రాజును, పెద్దపులిని, విషపురుగులను, బాలున్ని, కరిచే ఇతరుల కుక్కను, మూర్ఖున్ని ఈ ఏడుగురిని నిద్రపోవుచున్న యెడల మేల్కొల్పవద్దు.



# వేదాంత గోష్ఠి

## ఏడవ ఘట్టం
## (ఆత్మ అవస్థాత్రయానికి సాక్షి)

**గురువు :** నాయనా! నీవు జాగ్రదాది మూడు అవస్థలకు సాక్షివై వున్నావు.

**శిష్యుడు :** స్వామీ! మూడు అవస్థలు యే వేవి? వాటికి నాకు గల సంబంధమేమి?.

**గురువు :** జాగ్రత్, స్వప్నము, సుషుప్తి అని అసవ్థలు మూడు. అవస్థ అంటే ఒక అనుభవం, ఒక స్థితి. ఆత్మవైన నీవు ఆ మూడు అవస్థలకు సాక్షివి.

**శిష్యుడు :** జాగ్రదవస్థ అనగా యేమి? యెట్టిది?

**గురువు :** మెలకువను జాగ్రదవస్థ అంటారు. స్వప్న సుషుప్తులకంటె వేరై యింద్రియజన్య జ్ఞానానికి యింద్రియజన్య జ్ఞాన సంస్కారానికి ఆధారమయివుండే కాలాన్ని జాగ్రదవస్థ అంటారు. లేదా, యింద్రియాలు పదునాల్గు. వాటి అధి దేవతలు పదునాల్గు. వాటి విషయాలు పదునాలుగు కలిసి మొత్తం నలభై రెండు తత్వాలతో నడిచే వ్యవహార కాలాన్ని జాగ్రదవస్థ అంటారు.

ఇంద్రియాలను అధ్యాత్మలని యింద్రియ దేవతలను అధిదైవాలనీ యింద్రియ విషయాలను అధి భూతాలని చెప్పటం జర్గుతుంది.

**"ఆత్మని ఇతి అధ్యాత్మం"** ఆత్మను ఆశ్రయించి ప్రవర్తించేవి కాబట్టి యింద్రియాలను అధ్యాత్మములంటారు. **"దైవే ఇతి అధిదైవం"** తన శరీరానికి భిన్నమై ఉండి చక్షురాది యింద్రియాలకు గోచరం కానట్టి వాటిని అధిదైవము అంటారు. **"భూతే ఇతి అధిభూతం"** తన.శరీరాది సంఘాతానికి భిన్నమై ఉండి నేత్రాది యింద్రియాలకు గోచరించే వాటిని అధిభూతాలంటారు.

**శిష్యుడు :** పదునాల్గు యింద్రియాలు ఏవేవి?

**గురువు :** జ్ఞానేంద్రియాలని చెప్పబడే శ్రోత్రత్వక్ చక్షుర్జిహ్వా ఘ్రాణాలు అయిదు. కర్మేంద్రియాలని చెప్పబడే వాక్పాణి పాద పాయూపస్థలు అయిదు. అంతఃకరణ చతుష్టయమని చెప్పబడే మనోబుద్ధి చిత్తాహంకారాలు నాలుగు కలసి పదునాల్గు యింద్రియాలు. వీటినే అధ్యాత్మములంటారు.

**శిష్యుడు :** ఆ యింద్రియాలకు దేవతలేవేవి?

**గురువు :** (1) దిక్కులు (దిక్పాలురు) శ్రోత్రేంద్రియానికి అధిదేవతలు (2) వాయువు త్వగింద్రియానికి అధిదేవత (3) సూర్యుడు నేత్రేంద్రియానికి అధిదేవత (4) వరుణుడు జిహ్వేంద్రియానికి అధిదేవత (5) అశ్వనీకుమార్లు ఘ్రాణేంద్రియానికి అధిదేవతలు. (6) అగ్ని వాగింద్రియానికి అధిదేవత (7) ఇంద్రుడు హస్తేంద్రియానికి అధిదేవత (8) వామనుడు పాదేంద్రియానికి అధిదేవత (9) ప్రజాపతి గుహ్యేంద్రియానికి అధిదేవత (10) యముడు గుదేంద్రియానికి అధిదేవత. ఇంతవరకు పంచ కర్మేంద్రియాలకు అధిదేవతలు. (11) చంద్రుడు మనస్సుకు అధిదేవత (12) బ్రహ్మ బుద్ధికి అధిదేవత (13) వాసుదేవుడు చిత్తానికి అధిదేవత (14) రుద్రుడు అహంకారానికి అధిదేవత ఇంతవరకు అంతఃకరణ చతుష్టయానికి అధిదేవతలు చెప్పబడ్డాయి.

**శిష్యుడు :** ఈ పద్నాలుగు యింద్రియాలకు విషయాలు యేవేవి?

**గురువు :** (1) శబ్దము (2) స్పర్శము (3) రూపము (4) రసము (5) గంధము (6)వచనము (7) ఆదానము (8) గమనం (9) రతిభోగము (10) మలత్యాగము (11) సంకల్ప వికల్పము (12) నిశ్చయము (13) చింతనము (14) అహంత్వాభిమానము (నేనని అభిమానించుట) వరుసగా విషయాలు. ఈ విషయాలనే అధిభూతాలంటారు.

విచారించి చూస్తే మనస్సుకు సంకల్ప వికల్పాలు విషయంకాదు. ఏ వస్తువును గురించి సంకల్పం కలుగుతుందో ఆ వస్తువే విషయమౌతుంది. అట్లే బుద్ధికి నిశ్చయం విషయంకాదు. ఏ సందర్భాన్ని గురించి నిశ్చయం జరుగుతుందో ఆ సందర్భమే బుద్ధికి విషయం. చిత్తాహంకారాలను గురించి కూడా యీ విధంగానే గ్రహించాలె.

**శిష్యుడు :** అధ్యాత్మం, అధిదైవం, అధిభూతము అనే మూడింటిని ఒక్కటిగా సంపుటి చేస్తే యేమంటారు?

**గురువు :** త్రిపుటి అంటారు, ఆ త్రిపుటులు పదునాల్గు.

## 1. జ్ఞానేంద్రియాల త్రిపుటి

| ఇంద్రియాలు<br>అధ్యాత్మం | దేవత<br>అధిదేవతలు | విషయాలు<br>అధిభూతాలు |
| --- | --- | --- |
| శ్రోత్రము | దిక్కులు | శబ్దము |
| త్వక్కు | వాయువు | స్పర్శము |
| చక్షువు | సూర్యుడు | రూపము |
| జిహ్వా | వరుణుడు | రసము |
| ఘ్రాణము | అశ్విని కుమారులు | గంధము |

## 2. కర్మేంద్రియాల త్రిపుటి

| ఇంద్రియాలు<br>అధ్యాత్మ | దేవత<br>అధిదేవతలు | విషయాలు<br>అధిభూతాలు |
| --- | --- | --- |
| వాక్కు | అగ్ని | వచనక్రియ |
| పాణి | ఇంద్రుడు | ఇచ్చుట పుచ్చుకొనుట |
| పాదము | వామనుడు | గమనము |
| ఉపస్థ | ప్రజాపతి | రతిభోగము |
| గుదము | యముడు | మలత్యాగము |

## 3. అంతఃకరణ త్రిపుటి

| ఇంద్రియము<br>ఆధ్యాత్మము | దేవత<br>అధిదేవతలు | విషయాలు<br>అధి భూతములు |
| --- | --- | --- |
| మనస్సు | చంద్రుడు | సంకల్ప వికల్పాలు |
| బుద్ధి | బ్రహ్మ | నిశ్చయము |
| చిత్తము | వాసుదేవుడు | చింతనము |
| అహంకారము | రుద్రుడు | అహంత్వాభిమానము |

**శిష్యుడు :** ఈ త్రిపుటులయొక్క స్వభావమెట్టిది.

**గురువు :** మూడు మూడు పదార్థాలు కలిసిన ఒక్కొక్క దళాన్ని త్రిపుటి అంటారు. ఈ మూటిలో యేఒక్కటి లోపించినా వ్యవహారం జరుగదు. ఎట్లంటే - ఇంద్రియము దేవతా ఉండి విషయం లేకపోయినా విషయము ఇంద్రియము ఉండి దేవత లేకున్నా వ్యవహారం సాగదు.

**దృష్టాంతం :** 1. నాటకం చూదాలని పోయావు. నేత్రేంద్రియం నీకు బాగా వుంది. నాట్యశాలలో కుర్చీలు బల్లలు మొదలైన విషయాలు ఉన్నాయి. కాని ప్రకాశం లేదు. అనగా అధిదేవత సహాయంలేదన్న మాట. చూడటమనే వ్యవహారం సిద్ధించదు.

2. నీకు శ్రోత్రేంద్రియం వుంది. దిక్కులనే అధిదేవతలు ఉన్నారు. కాని చుట్టు, కేవలం నిశ్శబ్దమే వుంది. శబ్దమనే విషయంలేదు. కాబట్టి శ్రోత్రేంద్రియానికి వినడమనే వ్యవహారం సిద్ధించడం లేదు. ఇదే త్రిపుటియొక్క స్వభావం.

**శిష్యుడు :** స్వామీ, త్రిపుటుల యొక్క స్వభావాన్ని సెలవిచ్చారు. నా యొక్క స్వభావ మెట్టిదో దాన్ని గ్రహించే దేలాగో సెలవిండు?

**గురువు :** పైన చెప్పిన త్రిపుటులు సమగ్రంగా ఉన్నప్పుడు నీవు వాటిని తెలుసుకొంటావు. అసమగ్రంగా కొరతగా వున్నప్పుడు గ్రహించగల్గుతావు. ఆ త్రిపుటుల యొక్క వ్యవహారం జారీగా సాగేది నీకు తెలుసు. ఆ వ్యవహారం కుంటుపడినప్పుడు నీకు తెలుస్తుంది. కాబట్టి నీ స్వభావమేదో ఇక నీవే విచారించి తెలుసుకో.

**శిష్యుడు :** ఇంతకు చెప్పుకొనివచ్చిన ప్రసంగమేమి?

**గురువు :** ఈ త్రిపుటులద్వారా వ్యవహారం జరిగే కాలాన్ని జాగ్రదవస్థ అని అంటారు. ఇదే ఫలితార్థం.

**శిష్యుడు :** గురువర్యా! జాగ్రదవస్థలోని జీవుని హంగులు అంగరక్షలు సంపూర్ణంగా వివరించండి?

**గురువు :** జాగ్రదవస్థలో జీవుడు దేహమంతా నఖశిఖపర్యంతం వ్యాపించి ఉన్నా కూడా ముఖ్యంగా వాని స్థానంనేత్రమని చెప్పుతారు. కాబట్టి జాగ్రదవస్థలో జీవునికి

(1) స్థానము నేత్రము (2) వాక్కు వైఖరీవాక్కు (3) భోగము స్థూలభోగము (4) శక్తి క్రియాశక్తి (5) గుణము రజోగుణము (6) మాత్ర అకారమాత్ర (7) ఈ అవస్థలో అభిమాని జీవుని పేరు విశ్వుడు.

**శిష్యుడు** : జాగ్రదవస్థను గురించిన యీ వర్ణన వలన తేలిన సారాంశమేమి?

**గురువు** : జాగ్రదవస్థను "ఇది జాగ్రదవస్థ" అని నీవు తెలుసుకొంటున్నావు. ఆ జాగ్రదవస్థ స్వప్న సుషుప్తులలో లేనపుడు దాని అభావాన్ని నీవు తెలుసుకొంటున్నావు. కాబట్టి జాగ్రదవస్థ నీవు కాదు. అది స్థూల దేహానికి సంబంధించింది. నీకు సంబంధించింది కాదు. నీది కాదు. నీవు దాన్ని యెరిగే సాక్షివి. ఘటానికి ఘటద్రష్టవలె దానికి నీవు వేరై ఉన్నావు. ఇది ఈ వర్ణనలో తేలిన నిగ్గు, అబ్బాయి! నీవు జాగ్రదవస్థకు సాక్షివై ఉండుటే కాదు. స్వప్నావస్థకు కూడా సాక్షివయ్యే ఉన్నావు.

**శిష్యుడు** : స్వామీ! స్వప్నావస్థ అంటే యేమి? దాని స్వరూపమెట్టిదో సెలవియ్యండి?

**గురువు** : జాగ్రదవస్థలో, కన్న, విన్న, అనుభవించిన, పదార్థాలయొక్క సంస్కారం నిద్రాసమయంలో కంఠమందుండే హితానాడిలో అణగి ఉంటుంది, ఆ హితానాడి వెంట్రుకలో వెయ్యోభాగమంతటి మహాసూక్ష్మంగా వుంటుంది. ఆ చోటి సంస్కారబలంతో నిద్రాకాలంలో కూడా పంచ విషయ పదార్థజ్ఞానం సంభవిస్తుంది. ఆ సమకాలంలో ఆ అవస్థలో అది కూడా ఒక వ్యవహారమే. ఆ అవస్థను స్వప్నావస్థ అంటారు.

ఇంద్రియాల జోక్యం లేక అంతఃకరణముయొక్క అపరోక్షవృత్తికి విషయానుభవము కల్గే సమయాన్ని స్వప్నావస్థ అంటారు. లేదా, మనస్సు ప్రాణము యే అవస్థలో పని చేస్తాయో ఆ అవస్థను స్వప్నావస్థ అంటారు.

**శిష్యుడు** : స్వప్నావస్థలో జీవుని హంగులు అంగరక్షలు సెలవియ్యండి?

**గురువు** : స్వప్నావస్థలో జీవునికి (1) కంఠము స్థానము (2) వాక్కు మధ్యమవాక్కు (3) భోగము సూక్ష్మ (వాసనా) భోగము, (4) శక్తిజ్ఞానశక్తి, (5) గుణము సత్త్వగుణము, (కొందరు రజోగుణమంటారు) (6) మాత్ర ఉకారమాత్ర, (7) ఆ అవస్థలోని అభిమాని జీవుని పేరు తైజసుడు.

**శిష్యుడు :** స్వప్నావస్థ స్వరూపాన్ని తెలియుటలో యేమి లాభం?

**గురువు :** "కలలను కల్గించే స్వప్నావస్థను దాని ఉనికిని అనుభవంతో తెలుసుకొంటున్నావు. జాగ్రదవస్థలోను సుషుప్త్యవస్థలోను దానిలేమిని కూడ తెలుసుకొంటున్నావు. స్వప్నావస్థయొక్క ఉనికి లేములను తెలుసుకొంటుండే నీవా స్వప్నావస్థకాదు. స్వప్నావస్థ నీ స్వరూపంకాదు. నీవు దాన్ని తెలుసుకొనే సాక్షివి. దానికి వేరై నీవున్నావు." అని యీ విధంగా విచారించి తెలుసుకొనుటే లాభం.

కుమారా! నీవు జాగ్రత్స్వప్నాలకే కాదు; సుషుప్త్యవస్థకు కూడా సాక్షివై ఉన్నావు.

**శిష్యుడు :** గురువర్యా! సుషుప్త్యవస్థయొక్క స్వరూపమేమి?

**గురువు :** మనుష్యుడు నిద్రనుండి లేస్తూనే "నేను సుఖంగా నిద్రించాను, నేనేమీ యెరుగ"నంటూ నిద్రలోని సుఖాన్ని అజ్ఞానాన్ని స్మరిస్తాడు. అది వానికి నిద్రలో కలిగిన అనుభవం. ఆ సుఖము ఆ అజ్ఞాన ప్రతీతి, సాక్షిచేతన రూప అనుభవం ద్వారా యే అవస్థలో సిద్ధిస్తున్నాయో, ఆ బుద్ధియొక్క (విలయరూపమై) అవస్థను సుషుప్తి అంటారు. లేదా, సుఖము అజ్ఞానము (యెరుక లేకుండుట) యే అవస్థలో అనుభవానికి వస్తాయో అట్టి అవిద్యా వృత్తి యొక్క సమయాన్ని సుషుప్త్యవస్థ అంటారు. లేదా, ప్రాణం ఒక్కటి మాత్రం యే అవస్థలో పనిచేస్తుంటుందో అది సుషుప్త్యవస్థ.

**శిష్యుడు :** సుషుప్త్యవస్థలోని జీవునికి హంగులు – అంగరక్షలు వివరించండి?

**గురువు :** సుషుప్త్యవస్థలోని జీవునికి (1) స్థానం హృదయం (2) వాక్కు పశ్యంతీవాక్కు (3) భోగము ఆనందభోగము (4) శక్తి ద్రవ్యశక్తి (5) గుణము తమోగుణము. (6)మాత్ర మకారమాత్ర. (7) అభిమాని జీవుదు ప్రాజ్ఞుడు.

పశ్యంతివాక్కు = సూక్ష్మవిచారములయొక్క సంస్కార రూపమైన వాక్కు ఆనందభోగం నిర్విషయ సుఖభోగము, ద్రవ్య శక్తి = జాగ్రదాది వ్యవహారాలకు తగిన అనుకూల పదార్థాలను ఉత్పత్తి చేసే కారణరూపశక్తిని ద్రవ్యశక్తి అంటారు. ప్ర – అజ్ఞ = విశేషించి అజ్ఞాని కాబట్టి ప్రాజ్ఞుడు.

**శిష్యుడు :** దృష్టాంత సహితంగా యీ సుషుప్త్యవస్థను విశదీకరించండి.

గురువు : ఒక స్త్రీ నీటికై బావికి (నూతికి) వెళ్ళింది. ఆమె చేతిలోని బిందె బావిలో పడిపోయింది. దాన్ని గడ్డకు తీసేందుకు తగిన మనిషిని లోపలికి దించారు. వాడు దిగి నీళ్లలో మునకవేశాడు. అడుగునకు చేరి చేతిని త్రిప్పగా మొదటిసారి దొరుకలేదు. దొరకని విషయం వానికి తెలిసివుంది మళ్ళీ ప్రయత్నంగా అట్టడుగున చేతికి దొరికింది. తెలుసుకొన్నాడు. ఆనందించాడు కాని నీళ్లలోపల ఉండేటపుడు వాగింద్రియము పని చేయలేదు; కాబట్టి దొరికిన వెంటనే బిందె దొరికిందనే మాటపై వాళ్ళకు చెప్పలేకపోయాడు. ఒక్క వాక్కు తప్పతక్కిన యింద్రియాల వ్యవహారమంతా నీటిలో జరుగ గల్గుతుంది. ఎందుకంటే, వాటి సంబంధమైన త్రిపుటి సంపూర్ణంగా ఉంది కాబట్టి. కానీ, వాగి(ంద్రియానికి అధిదేవత అయిన అగ్నియొక్క వ్యవహారం నీటిలో సాగదు. అగ్నికి నీటికి విరోధం కాబట్టి, అధిదేవతా సహాయంలేని (త్రిపుటి కొఱపడింది) వాక్కు పల్కలేకపోయింది. బిందె దొరికిందనే సంగతి తనకు తెలిసింది. ఆనందించాడు. నీటిని దాటి బయటవచ్చిన తర్వాత అగ్ని దేవతా సహాయం కల్గింది. వాగింద్రియం విషయాన్ని చెప్పకల్గింది.

అట్లే (1) సుషుప్తవ్యస్థలోని సుఖానికి అజ్ఞానానికి సాక్షియై చేతనరూప సామాన్యజ్ఞానం ఉంది. (2) కానీ విశేషజ్ఞానానికి సాధనాలైన యింద్రియాలు అంతఃకరణము ఆ సమయంలో లేవు. కాబట్టి ఆ సుఖము యొక్క ఆ అజ్ఞానముయొక్క విశేషజ్ఞానం వానికి కలిగే వీలులేకపోయింది. (3) జాగ్రదవస్థకు రావడంతోటే విశేష జ్ఞానానికి సాధనాలైన యింద్రియాలు అంతఃకరణము కూడి రావడంతో సుషుప్తిలో తాను అనుభవించిన సుఖమును అజ్ఞానమును స్మృతికి (స్మరణకు) తెచ్చుకుంటు విశేషజ్ఞానం సంభవించింది.

రెండవ దృష్టాంతం : లక్కకు సెగ తగిలిస్తే కరిగి మెత్తనైతుంది. సెగకు దూరం చేస్తే మళ్లీ గట్టిపడుతుంది. తిరిగి వేడిచూపితే మెత్తగౌతుంది. అట్లే సుషుప్త్యవస్థలో కారణ శరీరరూపమై అజ్ఞానం వుంది. ఆ అజ్ఞానం జాగ్రత్స్వప్నావస్థలలో బుద్ధి రూపాన్ని ధరిస్తుంది. తిరిగి సుషుప్త్యవస్థ ప్రాప్తించగా అజ్ఞానరూపమై వుంటుంది.

**మూడో దృష్టాంతం** : ఒక పిల్లవాడున్నాడు. వానికి చిలిపితనము దుడుకుతనము మెండు, అదో అంటే వీధిలో వెళ్ళి పడ్తుంటాడు. తల్లికి కోపమువచ్చి ఒక్కదెబ్బ

అంటించింది. వాడు కెవ్వున యేడ్చాడు. ఓదారుస్తూ తల్లి పాలు త్రాపింది. అలసిన పిల్లవాడు తల్లి ఒడిలో నిద్రించి హాయి పొందినాడు. నిద్రలేచినప్పటినుండి, మళ్ళీ మొదటి ఆటే.

కారణ శరీరరూపమైన అజ్ఞానమే తల్లి. బుద్ధి పిల్లవాడు. వానికి జాగ్రత్స్వప్నాలలో ఒకటే వెంపర్లాట. విక్షేపాలనే దెబ్బలు తగుల్తుంటాయి. సుషుప్త్యవస్థ అనే గృహంలో అజ్ఞానమనే తల్లి ఒడిలో లీనమై బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు. అదృష్టకర్మ ప్రేరేపణతో ఆ బుద్ధికి పునరుత్థానం కల్గుతుంది. బహిర్ముఖుడై జాగ్రత్స్వప్నాల వ్యవహారం ప్రారంభిస్తాడు.

**నాల్గో దృష్టాంతం :** (1) సముద్రజలముతో నిండిన కుండను, (2) దాని మెడకు త్రాడుకట్టి సముద్రంలోనికి దించాము. (3) కుండలో నీరు సముద్రజలంతో యేకీభావం చెందాయి. (4) అయినా కుండయొక్క ఉపాధితో జలం ప్రత్యేకించబడేవుంది. (5) త్రాటిని పైకి లాగేమా, కుండ దాని జలము సముద్ర జలం నుండి వేర్పడింది. కానీ (6) కుండ లోని నీటికి సముద్రజలానికి ఆధారంగా ఉండే ఆకాశానికి మాత్రమ యెట్టి భేదము లేదు. అది త్రికాలల్లోనూ ఒకటే

అట్లే (1) అజ్ఞానమనే జలంతో నిండిన లింగ దేహమనే కుండ వుంది. (2) అదృష్ట (కర్మ) మనే త్రాడు దానికి కట్టబడింది. అది సుషుప్తిలో లేదా దాని అవాంతర భేదాలైన మరణ మూర్ఛా ప్రళయకాలాలల్లో సమిష్టి అజ్ఞానరూపుడైన యీశ్వరునియందు అతని ఉపాధియైన మాయయందు (ఆ లింగదేహం) విలీనమైతుంది. (3) వ్యష్టి అజ్ఞాన రూపుడగు జీవునియొక్క ఉపాధియైన అవిద్య, సమిష్టి అజ్ఞానంతో యేకీభవిస్తుంది. (4) అయినా భిన్న బిన్న సంస్కారరూప ఉపాధులను బట్టి లింగ శరీరం వేరయ్యే వుంటుంది. (5) ఎప్పుడైతే అదృష్ట (కర్మ) రూపమగు త్రాడును అంతరాత్మ ప్రేరేపిస్తాడో అప్పుడాభేదం బయటపడుతుంది. (6) ఇంతకూ వ్యష్టి అజ్ఞాన రూపంతో కూడిన లింగ శరీరమనే ఘటానికి సమష్టి అజ్ఞానమనే సముద్రానికి సర్వాధారంగా వుండే చిదాకాశం మాత్రం ఒకటే. దానికి భేదాలు విభేదాలు లేవు. అది త్రికాలల్లో యేకరకం.

**శిష్యుడు :** ఈ విధంగా సుషుప్త్యవస్థయొక్క స్వరూపాన్ని యెరుగుటతో ఏమి లాభం?

**గురువు :** సుషుప్త్యవస్థ కల్గుట నీకు తెలుస్తుంది? జాగ్రత్స్వప్నాలలో అది లేకుండుటను నీవు తెలుసుకొంటున్నావు. కాబట్టి ఆ సుషుప్త్యవస్థ నీవుకాదు. అది కారణ దేహసంబంధమైంది. నీదికాదు. నీవు దానిని యెరిగే సాక్షివిమాత్రం. ఘటానికి ఘటద్రష్టవలె దానికి నీవు వేరైయున్నావు. ఈ విధమైన నిశ్చయం కల్గుటేలాభం.

వేదాంత గోష్ఠిలో అవస్థాత్రయ విచారాన్ని గురించి

ఏడోఘట్టం ముగిసింది.

## శ్రీ ధ్యాననిష్ఠాశ్రమంలో సంవత్సరంలో జరుగు విశేష కార్యక్రమములు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | చైత్ర | శు॥ | నవమి | "శ్రీరామనవమి" |
| 2. | వైశాఖ | శు॥ | పౌర్ణమి | "శ్రీ భూదేవమ్మ" (శ్రీస్వామి మాతృమూర్తి) ఆరాధన |
| 3. | ఆషాఢ | శు॥ | ఏకాదశి | "శ్రీ మలయాళస్వామి" ఆరాధన |
| 4. | ఆషాఢ | శు॥ | పౌర్ణమి | "గురుపూర్ణిమ" చాతుర్మాస్యవ్రతదీక్షారంభం |
| 5. | శ్రావణ | శు॥ | విదియ | "శ్రీదయానందగిరిస్వామి" ఆరాధన |
| 6. | భాద్రపద | శు॥ | చవితి | వినాయక చవితి |
| 7. | భాద్రపద | బ॥ | విదియ | శ్రీ ప్రేమస్వరూపానందగిరిస్వామి ఆరాధన |
| 8. | ఆశ్వయుజ | శు॥ | అష్టమి | దుర్గాష్టమి |
| 9. | కార్తీక | శు॥ | తదియ | శ్రీ కమలవ్వ ఆరాధన |
| 10. | కార్తీక | శు॥ | పౌర్ణమి | గంగ,నది పుణ్యస్నానాలు |
| 11. | మార్గశిర | శు॥ | ఏకాదశి | గీతాజయంతి |
| 12. | మాఘ | బ॥ | పాడ్యమి | శ్రీదయానందగిరిస్వామి జన్మదినం |
| 13. | మాఘ | బ॥ | విదియ | ఆశ్రమ వార్షికోత్సవం |
| 14. | మాఘ | బ॥ | చతుర్ధశి | మహాశివరాత్రి |



# వేదాంత గోష్ఠి

## ఎనిమిదవ ఘట్టం
## (ఆత్మయొక్క విశేషణాలు)

**శిష్యుడు :** ఆత్మయొక్క విశేషణాలు యెన్ని విధాలు?

**గురువు :** (1) విధేయ విశేషణాలు, (2) నిషేధ్య విశేషణాలు అని ఆత్మను గూర్చిన విశేషణాలు రెండు విధాలు.

"విధేయ"మనగా సాక్షాత్తుగా బోధించేది. ఉదాహరణ "సధవాస్త్రీ' అనే శబ్దం విధవాస్త్రీని నిషేధిస్తూ సౌభాగ్యవతియైన స్త్రీని సాక్షాత్తుగా బోధిస్తూంది.

అట్లే 'సత్తు చిత్తు మొదలైనవి విధేయ విశేషణాలు. అవి "అసత్తుజడము మొదలైన ప్రపంచ సంబంధమైన విశేషణాలను నిషేధిస్తూన్నాయి. మరి బ్రహ్మమును సాక్షాత్తుగా బోధిస్తున్నాయి. కాబట్టి వీటిని విధేయ విశేషణాలంటారు.

"నిషేధ్య' విశేషణాలు అనగా ప్రపంచమును నిషేధించుట ద్వారా బోధించే విశేషణాలు. ఉదాహరణ "విధవా స్త్రీ" అనే శబ్దం 'విధవా స్త్రీ'ని నిషేధించుట ద్వారా తద్విలక్షణమైన సౌభాగ్యవతియగు స్త్రీని బోధిస్తుంది. అట్లే "అనంతము' మొదలైన శబ్దాలు ఆత్మకు సంబంధించిన నిషేధ్య విశేషణాలు. అవి 'అంత'వంతమైన ప్రపంచముయొక్క ధర్మాలను నిషేధిస్తూ తద్వారానే దానికి విలక్షణమైన బ్రహ్మాన్ని బోధిస్తున్నాయి. కాబట్టి ఇట్టివాటిని "నిషేధ్య" విశేషణాలంటారు.

**శిష్యుడు :** ఆత్మయొక్క విధేయ విశేషణాలేవి?

**గురువు :** (1) సత్తు (2) చిత్తు (3) ఆనందము (4) బ్రహ్మము (5) స్వయం

ప్రకాశము (6) కూటస్థము (7) సాక్షి (8) ద్రష్ట (9) ఉపద్రష్ట (10) ఏకము మొదలైనవి ఆత్మకు విధేయ విశేషణాలు.

**శిష్యుడు :** ఆత్మను సద్రూపమంటారే యెందుకు?

**గురువు :** ఏ వస్తువునకు జ్ఞానం వలన కానీ, మరి యేవిధంగా కానీ, నివృత్తి (నాశం) అంటూ లేదో దాన్ని సద్రూపమంటారు.

ఆత్మకు తన జ్ఞానం వలన కానీ మరి యే వస్తువు వలన కానీ నివృత్తిలేదు. కావున ఆత్మ సద్రూపం **"త్రికాలాబాధ్యం సత్యం"** త్రికాలాలలో బాధింపబడని వస్తువే సత్యమంటూ శాస్త్రకారులంటారు. జాగ్రత్స్వప్నసుషుప్తులనే మూడు అవస్థలలోనూ ఆత్మ ఉంది. కాబట్టి సద్రూపం.

**శిష్యుడు :** ఆత్మ చిద్రూపమనుట యెట్లు?

**గురువు :** అలుప్త ప్రకాశం కలది కాబట్టి ఆత్మను "చిత్" అంటారు. అనగా, ఆత్మ ప్రకాశానికి లోపం యేనాడు లేదని అర్థం, ఆత్మ స్వయంగా నిరంతరం నిత్య ప్రకాశ స్వరూపమైంది. కావున "చిత్తు" అంటారు.

**శిష్యుడు :** ఆత్మను ఆనంద స్వరూపమంటారే యెందుకు?

**గురువు :** ఆత్మ పరమ ప్రేమాస్పదము (సర్వోత్తమ ప్రీతికి విషయము) కాబట్టి ఆనంద స్వరూప మంటారు ఆత్మయందు (అనగా ప్రతివానికి తనయందు తనకు) పరమ ప్రీతి ఉండడంతో ఆనందరూపమంటారు.

యాజ్ఞ వల్క్యుడు తన భార్యమైన మైత్రేయితో అంటాడు. మైత్రేయీ! ప్రపంచములో భార్యభర్తను విశేషంగా ప్రేమిస్తుందంటే నిజానికి అది భర్తకోర్కెను పూర్తి చేసే కోసంకాదు. తన కోర్కెను పూర్తిచేసుకొనేకోసమే అట్లే భర్త భార్యను అపారంగా ప్రేమిస్తాడంటే, ఆమె ఇష్టం నెరవేర్చేకోసంకాదు. తన యిష్టం నెరవేర్చుకొనేకోసమే. తల్లిదండ్రులు కుమారుని ప్రేమిస్తారంటే ఆ ప్రేమ తమకోసమే కాని పుత్రుని కోసం కాదు. అట్లే ధనంమీద చూపే ప్రేమ ధనం కోసం కాదు. ఆధనం తనకు యిష్టసిద్ధి కల్గిస్తుంది. కాబట్టి ధనాన్ని ప్రేమిస్తాడు. వెయ్యేల! ప్రపంచం ప్రపంచాపేక్షతో ప్రేమాస్పదంకాలేదు.

అత్మాపేక్షతో ప్రేమాస్పదం అయింది.

ఈ సందర్భములో మరొక్క దృష్టాంతము కూడా చెప్పుట పరిపాటిగా ఉంది. ఒక రాజుగారు తన ప్రధానితో సంభాషిస్తూ "ప్రపంచములోని ప్రాణికోటికంతకూ బిడ్డల మీద మిక్కిలి ప్రేమ. కాని కోతుల విషయంలో ఆ ప్రేమ చివరి స్థాయివరకూ పోయింది. తనకంటె కూడ తన బిడ్డలను అది అధికంగా ప్రేమిస్తుంది." అని ప్రసంగవశాత్తు అన్నాడు. ఆ మాటకు మంత్రి సమ్మతించలేదు "మహారాజా! మీ అభిప్రాయం పొరపాటు ఏ ప్రాణికానీ గాక తన్ను తాను ప్రేమించినట్లు మరి దేన్నీ ప్రేమించదు ఆత్మవంటి ప్రియవస్తువు జగత్తులో మరియొకటిలేదు." అని మంత్రిగారి వాదన "మంత్రీ! నీమాట తక్కినచోట్ల సరే కాని కోతులపట్ల చెల్లదు. అవి చచ్చిన పిల్లలనుకూడా విడిచిపెట్టక మోస్తూ తిరుగతవే" అని రాజుగారంటారు. తన మాటను నిరూపించుకొనే కోసం ఒక పిల్లలకోతిని పట్టితెప్పించాడు. ఒక పెద్ద ఖాళీతొట్టిలోదాన్ని పెట్టి యెటూ పారిపోకుండ కట్టివేయించాడు. యంత్రసహాయముతో మెల్లమెల్లగా నీరు తొట్టిలో చేర్పిస్తున్నాడు. నీరు మెట్టుకు మెట్టు పైకి యెగబడి వచ్చేకొద్దీ తల్లికోతి పిల్లలను పైకి యెత్తిపట్టి కాపాడింది. కాసేపులో నీళ్ళు తీరా దాని ముక్కు దగ్గరికి వచ్చాయి కోతి ఉక్కిరి బిక్కిరి అయి చావు భయంతో ఒక్క పెట్టున పిల్లలను తన క్రింద వేసుకొని తాను వాటిపై యెగసి నిలబడింది. ఆ దృశ్యంచూచి రాజుగారు "ఓహో! పిల్లమీద ప్రేమ తన ప్రాణంమీదికి వచ్చేటంత వరకేనే" అంటూ తనకు తాను సమాధానం చెప్పుకున్నాడు.

యాజ్ఞవల్క్యుడు చెబుతున్నాడు. "ఓ మైత్రేయి! ఆత్మాపేక్షతో సమస్త ప్రపంచము ప్రియంగా తోచుతుంది. అందుకయ్యే ఆత్మపరమ ప్రేమాస్పదమని చెప్పబడుట, ఆత్మ యానంద స్వరూపమనుట ఈ కారణాన్ని బట్టియే సుమా.".

**శిష్యుడు :** ఆత్మ బ్రహ్మస్వరూపమనుట యెలా సరిపోతుంది?

**గురువు :** (1) ఆత్మ సత్ – చిత్ – ఆనందరూపమనుట శాస్త్రం ద్వారా యుక్తిద్వారా అనుభవం ద్వారా సిద్ధించింది. (2) బ్రహ్మము సత్ చిత్ ఆనందరూపమంటూ ఉపనిషత్తులు పేర్కొన్నాయి. ఆ ఆధారాన్నిబట్టి ఆ సామ్యాన్ని బట్టి బ్రహ్మరూపమనడం నిశ్చయం. బ్రహ్మమంటే వ్యాపక వస్తువని అర్థం. దేశకాల వస్తువులతో యేది అంతం కాదోదాన్ని వ్యాపకమంటారు.

(1) ఆత్మ బ్రహ్మకంటె వేరని అంటే దానికి దేశంతో పరిచ్ఛేదం (అంతం) కల్గుతుంది. (2) దేశంలో పరిచ్ఛేదం కల్గితే కాలంతో పరిచ్ఛేదం కల్గే తీరుతుంది. (3) దేశకాల పరిచ్ఛేదాలతో కూడిన వస్తువు అనిత్యమైతుంది. అందువలన ఆత్మ బ్రహ్మానికంటే భిన్నమని చెప్పితే అనిత్యమైతుంది. ఆత్మ నిత్యవస్తువు కాబట్టే బ్రహ్మానికి భిన్నంగా ఉండ వీల్లేదు.

(1) ఆత్మకంటే బ్రహ్మం భిన్నమని చెప్పితే బ్రహ్మము అనాత్మ కాగల్గుతుంది. (2) ఘటాదికాలు అనాత్మ వస్తువులు కాబట్టి జడాలు. ఆత్మకు భిన్నవస్తువైనప్పుడు బ్రహ్మము అనాత్మవస్తువై జడం కావలసి ఉంటుంది. ఈ మాట శ్రుతికి విరుద్ధం.

ఇన్ని సాధక బాధకాలను బట్టి ఆత్మకంటే భిన్నంగా బ్రహ్మంలేదు; ఆత్మ బ్రహ్మరూపమే అనుట నిష్కర్ష

**శిష్యుడు :** ఆత్మ యేవిధంగా స్వయం ప్రకాశమై ఉంది?

**గురువు :** దీపంలాగా యేది స్వయం ప్రకాశంలో ప్రకాశిస్తూ తన ప్రకాశానికి యితర సహాయాన్ని ఆపేక్షించదో. దేని ప్రకాశంలో యితర వస్తువులు ప్రకాశిస్తూంటాయో, అట్టిదాన్ని స్వయం ప్రకాశ వస్తువంటారు.

ఆత్మ తాను ప్రకాశించేందుకు చంద్ర, సూర్య, అగ్ని నక్షత్ర విద్యదాదుల సహాయాన్ని అపేక్షించదు. కాబట్టే ఆత్మ స్వయంప్రకాశము భగవంతుడు గీతలో **"నతద్భాసయతే సూర్యోనశశాంకోనపావకః"** అని చెప్పియున్నాడు కూడా.

(1) ఏది స్వయంగా సర్వదా అపరోక్షమై ఉందో (2) ఏది యితర యజ్ఞానానికి విషయమై (ప్రకాశ్యమై) ఉండదో దాన్ని స్వయం ప్రకాశమంటారు. **"అవేద్యత్వే సతి అపరోక్ష వ్యవహార యోగ్యత్వం స్వప్రకాశత్వమ్"** అని లక్షణన్యాయం.

ఆత్మ సదా తాను అపరోక్షమై ప్రకాశ స్వరూపమై వుంది. అది అన్యజ్ఞానానికి విషయమై వుండుటలేదు. కాబట్టి ఆత్మ స్వయంప్రకాశం.

**శిష్యుడు :** ఆత్మను కూటస్థుడనుటకు కారణమేమి?

**గురువు :** కూటమనగా కమ్మరివాని దాగలి. ఆ దాగలివలె నిర్వికారమై అచలమై వుండటం బట్టి ఆత్మను కూటస్థుడన్నారు.

కమ్మరివాడు తనదాగలిపై అనేక వస్తువులను చేస్తాడు. ఆదాగలి తాను తానుగనే ఉంటుంది. అట్లే మనస్సనే కమ్మరి ఆత్మయొక్క ఆధారంతో నానా వ్యవహారాలను చేస్తాడు. అయినా ఆత్మ తాను తానుగానే వుంటుంది. (కూటస్థుడనే మాటలో అచలుడు అక్రియుడు అనే అర్థాలు వచ్చాయి.)

**శిష్యుడు** : ఆత్మను సాక్షియని యెందుకు చెప్పారు?

**గురువు** : ఏ పక్షానికి చెందక రాగద్వేషాలు లేక ఉదాసీనుడై వుండుట, సమీపములో వుండుట, చేతనుడై వుండుట, ఈ మూడు లక్షణాలు కల్గి ఉండువాడు సాక్షియని లోక వ్యవహారసిద్ధి.

ఆ విధంగానే ఆ మూడు లక్షణాలూ ఆత్మయందు వర్తిస్తవి. ఆత్మ దేహాదులయెడ ఉదాసీనమైవుంది. దేహాదులకు అత్యంత సమీపవర్తియై ఉంది. చేతన స్వరూపమై వుంది. కాబట్టి ఆత్మను సాక్షియని చెప్పడం జర్గుతుంది.

అంతఃకరణ ఉపాధిగాగల చైతన్యాన్ని సాక్షి అంటారు. లేదా, అంతఃకరణంలోనూ దాని వృత్తులలోనూ వుండే కేవలం చేతనాన్ని సాక్షి అంటారు. ఆత్మ ఆ విధమైనదే కాబట్టి సాక్షి అనుట చెల్లింది.

**శిష్యుడు** : ఆత్మను ద్రష్టయని ఎందుకన్నారు?

**గురువు** : చూచేవాన్ని ద్రష్ట అంటారు. దృశ్యాల నన్నింటిని తాను చూస్తుంది. కాబట్టి ఆత్మను ద్రష్ట అన్నారు.

**శిష్యుడు** : ఆత్మను ఉపద్రష్ట అనుటయెందుకు?

**గురువు** : యజ్ఞశాలలో యజ్ఞక్రియను జరిపించుటకు పదేనుమంది ఋత్విక్కులుంటారు. పదారోవాడు యజమాని, యజమాని భార్య పదేడో వ్యక్తి, వీరిని వీరి పనులను సమీపంలో ఉండి చూచేవాడు మరొక్కడు పద్దెనిమిదో వ్యక్తి వుంటాడు. వాన్ని ఉపద్రష్ట అంటారు. వాడేపనీ చేసేవాడుకాదు.

అట్లే స్థూలదేహమనే యజ్ఞశాలలో అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు, అయిదు ప్రాణాలు మొత్తం కలిసి పదేనుమంది ఋత్విక్కులు.

పదార్లోవాడు యజమాని మనస్సు. బుద్ధి యజమానురాలు పదేడోవ్యక్తి ఈ పదేడుమంది తమతమ విషయాలను గ్రహించుటే యజ్ఞకార్యము. వీరందరికి దగ్గరగా వుండి వీరి క్రియా కలాపాలను చూస్తుండే పద్దెనిమిదోవాడు ఆత్మ ఉపద్రష్ట.

**శిష్యుడు :** ఆత్మను యేకమనుటకు అర్థమేమి?

**గురువు :** ఆత్మకు సజాతీయమైన (సరిజాతియైన) ఆత్మ మరొక్కటిలేదు కాబట్టి ఆత్మను ఏకమన్నారు.

**శిష్యుడు :** ఆత్మకు సంబంధించిన నిషేధ్య విశేషణాలేవేవి?

**గురువు :** (1) అనంతము, (2) అఖండము, (3) అసంగము, (4) అద్వితీయము, (5) అజన్మము, (6) నిర్వికారము, (7) నిరాకారము, (8) అవ్యక్తము, (9) అవ్యయము (10) అక్షరము యీ మొదలైనవి ఆత్మకు నిషేధ్య విశేషణాలు.

**శిష్యుడు :** ఆత్మను అనంతమని యెందుకన్నారు?

**గురువు :** ఆత్మ వ్యాపకమైంది. కాబట్టి ఆత్మకు దేశగత పరిచ్ఛేదంలేదు. ఆత్మనిత్యం కాబట్టి దానికి కాలగత పరిచ్ఛేదం లేదు. ఆత్మ సర్వానికి అధిష్ఠానం కాబట్టి – అందుననే సర్వరూపం కాబట్టి దానికి వస్తుగత పరిచ్ఛేదం లేదు. దేశగతికాలగత వస్తుగత పరిచ్ఛేదాలు లేనివస్తువును అనంతమంటారు. ఆత్మ అట్టిదే కాబట్టి అది అనంతం.

ఒక ప్రదేశంలో వుండి మరొక్క ప్రదేశంలో లేకపోతే దానిని దేశగత పరిచ్ఛేదమంటారు. విశ్వనాథుడు కాశీలో ఉన్నాడు. తక్కిన చోట్లలేడు. వేంకటేశ్వర్లు తిరుపతిలో ఉన్నాడు. మిగతా చోటలేడు. వారికి దేశగతపరిచ్ఛేదం కల్గింది. ఆత్మ కాశీలోను వుంది తిరుపతిలోనూ వుంది. అంతటా వుంది కావున ఆత్మకు దేశగత పరిచ్ఛేదం లేదు.

రామకృష్ణాదులు ఒకానొక కాలంలో ఉండినారు. ప్రస్తుతం యీ కాలంలో లేరు. వారికి కాలగత పరిచ్ఛేదం సంభవించింది. ఆత్మ అన్ని కాలల్లోను వుంది. కావున ఆత్మకు కాలగత పరిచ్ఛేదం లేదు.

ప్రపంచంలో అనేక వస్తువులున్నాయి. అన్నీ అన్ని రకాలు, ఇది అదికాదు. అది

ఇదికాదు. ప్రతీ వస్తువూ తన హద్దులలో పరిచ్ఛిన్నమై ఉంది. ప్రపంచంలోని వస్తువులన్నీ వస్తుగత పరిచ్ఛేదాన్ని కల్గివున్నాయి. ఆత్మ అన్ని వస్తువులకు అధిష్ఠానం కాబట్టి దానికి ఈ వస్తుగత పరిచ్ఛేదం లేదు. ఆత్మ ఈవిధంగా త్రివిధ పరిచ్ఛేదశూన్యం కావుననే అనంతం.

**శిష్యుడు :** ఆత్మను అఖండమంటారే యెందుకు?

**గురువు :** జీవ ఈశ్వరభేదం - జీవ జీవభేదం - జీవ జడభేదం - ఈశ్వర జడభేదం - జడవస్తు పరస్పరభేదం - అనెడి పంచవిధభేదాలు లేనిదికాబట్టి ఆత్మ అఖండమైంది. లేదా సజాతీయ విజాతీయ స్వగతాలనే త్రివిధ భేద శూన్యమైనది కాబట్టి ఆత్మ అఖండమనబడింది.

**శిష్యుడు :** ఆత్మ అసంగమన్నారే యే కారణంతో?

**గురువు :** సంగమనగా సంబంధం. ఆ సంబంధం మూడు విధాలు (1) సజాతీయ సంబంధం. (2) విజాతీయ సంబంధం, (3) స్వగత సంబంధమంటూ వాటి పేర్లు.

1. తన జాతివారి తోటిసంబంధాన్ని సజాతీయ సంబంధమంటారు. ఒక బ్రాహ్మణునికి వేరొక బ్రాహ్మణునికి తోడి సంబంధంవలె, 2. తన జాతితోగాక వేరే జాతివారి తోడి సంబంధాన్ని విజాతీయ సంబంధమంటారు. బ్రాహ్మణునికి శూద్రునితోడి సంబంధంవలె, 3. తన అవయవాల తోడి సంబంధాన్ని స్వగత సంబంధమంటారు. మనుష్యునికి తన చేయి తన కాలు తలతో ఉండే సంబంధంవలె.

2. ఆత్మ చైతన్య వస్తువు; అది ఒక్కటి. దానికి స్వజాతి మరొక్కటిలేదు. జీవుడు ఈశ్వరుడు బ్రహ్మ విష్ణువు శివుడు నీవు నేను మొదలైన భేదాలు ఉపాధుల నాశ్రయించి వున్నాయి. కాని అవి నిజంకాదు. మిథ్యలు, కావున ఆత్మకు దేనితోడనూ సజాతీయ సంబంధం యేర్పడదు.

3. ఆత్మ అద్వైతం; సత్యం, దానికి భిన్నమైన మాయ మాయాకార్యమైన స్థూల సూక్ష్మ ప్రపంచం ప్రతీతమైతున్నప్పటికి అసత్తుమాత్రం. అసత్తు ఒక వస్తువుకాదు. కాబట్టి ఆత్మకు విజాతీయ సంబంధం పొసగదు.

4. ఆత్మకు అవయవాలు లేవు. ఆత్మ నిరవయవం సత్తు చిత్తు ఆనందాలు ఆత్మకు

అవయవాలు కాదు. అవి ఏకరూపమై ఆత్మకు స్వరూపమయ్యాయి. అందువల్ల ఆత్మకు దేనితో కూడా స్వగత సంబంధం లేదు. ఈ విధంగా ఆత్మ సర్వ సంబంధ రహితము కాబట్టి అది అసంగమనబడింది.

**శిష్యుడు :** ఆత్మను అద్వైతమనుట యెట్లు?

**గురువు :** ద్వైత ప్రపంచం స్వప్నంలాగా కల్పితం కాబట్టి నిజానికదిలేదు. ఆత్మద్వైత రహితం కాబట్టి అద్వైతమని చెప్పబడింది.

**శిష్యుడు :** ఆత్మను అజన్మమనుట యెందుకు?

**గురువు :** జన్మం స్థూలదేహధర్మం మాత్రం. ఈ జన్మము సూక్ష్మదేహానికి కూడా లేదు. అలాంటప్పుడు ఆత్మకెక్కడిది? ఆత్మకు జన్మాన్ని ఒప్పుకొంటే మరణాన్ని ఒప్పుకోవాలె. జన్మ మరణాలు ఆత్మకు కలవంటే అది అనిత్యమైపోయె. ఈ మాటను పరలోక వాదులైన ఆస్తికులు ఒప్పుకోరు; వేదానికి సమ్మతం కాదు.

కారణమేమంటే జన్మమరణాలు కల వస్తువు, జన్మానికి ముందు మరణానికి వెనుక ఉండే వీల్లేదు. కాబట్టి ఆత్మకు పూర్వజన్మమనీ ఆ జన్మలో చేసిన కర్మ అని సంభవించే వీల్లేదు; కర్మ లేకనే అది ఈ జన్మలో సుఖదుఃఖాలు అనుభవించుట యేర్పడ్తుంది. అది అసంబద్ధం. దీన్నే అకృతాభ్యాగమ దోషమంటారు.

మరణానంతరం ఆత్మ లేకుండాపోతే ఈ జన్మలో చేసిన కర్మ, దిక్కు లేక అనుభవానికి రాకపోతుంది. దీన్ని కృత ప్రణాశ దోషమంటారు. అలాంటప్పుడు వేదోక్తకర్మలు వ్యర్థం కావలసి వుంటుంది. ఈ దోషాలను నివారిస్తూ ఆత్మ అజన్మమని చెప్పుట జరిగింది. అజన్మమని చెప్పడంతో అజరమని అమరమని చెప్పినట్లే.

**శిష్యుడు :** ఆత్మ నిర్వికారమని యెందుకు చెప్పారు?

**గురువు :** ఒక కుండ ఉందనుకో, దానికి జన్మము – అస్తిత్వము (ఉనికి) – వృద్ధి విపరిణామము – అపక్షయము – వినాశమనే ఆరు ధర్మాలు ఉన్నవనుకో, ఆ ధర్మాలు కుండకే కాని కుండలోని ఆకాశానికి లేవు. కుండకు బైటి ఆకాశానికి కూడా లేవు.

అట్లే దేహం పుట్టింది. ఇది జన్మం. పుట్టకముందు లేనివస్తువు యిప్పుడుంది. ఇది

ఉనికి (అస్తిత్వం) దీనికి బాల్యావస్థ వచ్చింది. ఇది వృద్ధి తర్వాత యౌవనావస్థ కల్గింది. ఇది విపరిణామం. దేహానికి వార్ధక్యం యేర్పడింది. ఇది అపక్షయం, మరణించింది. ఇది వినాశం.

ఈ ఆరు వికారాలు దేహధర్మాలు, దేహాన్ని తెలుసుకొంటూ దేహానికి వేరే ఉండే ఆత్మకి వికారాలు చెందవు. అట్లు ఆత్మ ఈ షడ్భావ వికారరహితమైంది. కాబట్టి ఆత్మను నిర్వికారమన్నారు.

**శిష్యుడు :** ఆత్మను నిరాకారమని యెందుకు చెప్పాలె?

**గురువు :** ప్రపంచంలో ఆకారాలు, లావు సన్నము పొట్టి పొడుగు అది నాల్గు రకాలు, ఆత్మ, ఇంద్రియాలకు మనస్సుకు గోచరించేదిగాదు. కాబట్టి లావు (స్థూలం)గా లేదు వ్యాపకం కాబట్టి సన్న (సూక్ష్మం)గా ఉందనే వీలులేదు. అన్నిచోట్ల ఓతప్రోతం కాబట్టి పొడుగూ కాదు; పొట్టికాదు. ఫలితంగా ఆత్మ నిరాకారం.

**శిష్యుడు :** ఆత్మ అవ్యక్తమనగా యేమి?

**గురువు :** మనస్సుకు యింద్రియాలకూ అగోచరం కావడంతో ఆత్మ అస్పష్టమైంది. కాబట్టే అవ్యక్తమన్నారు.

**శిష్యుడు :** ఆత్మను అవ్యయమనుటలో అర్థమేమి?

**గురువు :** ఒక గాదెనిండా గింజలున్నాయి. గంపెడు గింజలు తీసినాము. రాశి తరిగింది. గంపెడుగింజలు వేసినాము. రాశి పెరిగింది. ఆ విధంగా ఆత్మకు తరుగు పెరుగులు లేవు; కాబట్టి అది అవ్యయం.

**శిష్యుడు :** ఆత్మను అక్షరమని అన్నారెందుకు?

**గురువు :** క్షరమనగా నాశము. ఆత్మ స్వయంగా నాశరహితమైంది. కాబట్టి అక్షర మనబడింది. అట్లే ఆత్మను అమృతమని అవినాశియని చెప్పొచ్చు.

**శిష్యుడు :** ఈ విధంగా ఆత్మకు చెప్పిన ఈ విశేషణాలు పరస్పరం అభిన్నమై యేవిధంగా ఉన్నాయి?

**గురువు :** సత్తు చిత్తు ఆనందం మొదలైన విశేషణాలు ఆత్మకు గుణాలై వుంటే పరస్పరం భిన్నంగా వుండేవి. కానీ యీ విశేషణాలు గుణాలు కావు. ఇవి ఆత్మకు స్వరూపమే కావున భిన్నాలు కావు; అభిన్నమే.

ఒకే ఆత్మ నాశములేనిది కాబట్టి 'సత్' అని చెప్పబడింది. జడానికి విలక్షణం కాబట్టి 'చిత్' అనబడింది. అతీతం కాబట్టి 'ఆనంద'మని చెప్పబడింది. ఇట్లే తక్కిన విశేషణాలనూ ఊహించేది.

ఒక మనుష్యుడున్నాడు. వాడు తండ్రి దృష్టిలో కొడుకు. తాతదృష్టిలో మనుమడు. మామ దృష్టిలో అల్లుడు, భార్య దృష్టిలో భర్త, కాని వాడు మాత్రం ఒక్కడే.

ఒక సన్యాసి పశువుకు మనుష్యుడుగా స్త్రీకి పురుషుడుగా గృహస్థ భక్తుకునికి త్యాగిగా గోచరించాడు. ఒకే సన్యాసికి మనుష్యుడు పురుషుడు, త్యాగి అనేవి విధేయ విశేషణాలు

ఆ సన్యాసినే ఘటము పాషాణము, వృక్షము వీటి అపేక్షతో చెబితే, అఘటము అపాషాణము అవృక్షము అను నిషేధ్య విశేషణాలతో చెప్పాలె. అట్లే ఒకే ఆత్మ, ప్రపంచ సంబంధమైన అసత్ జడ దుఃఖ అంతఖండ సంగ విశేషణాల నపేక్షించి చెప్పబడినప్పుడు సత్ చిత్ ఆనంద అనంత అఖండ అసంగ ప్రభృతి నామాలతో చెప్పబడింది.

ఈ విధంగా ఆత్మను గూర్చిన యీ విశేషణాలు పరస్పర భిన్నాలు కావు అభిన్నంగానే ఉంటాయి.

వేదాంత గోష్ఠిలో ఆత్మయొక్క విశేషణాలను గురించిన
యెనిమిదో ఘట్టం ముగిసినది.

**శ్లో॥ పవిత్రః పవిత్రోవా, సర్వావస్థాంగ తోపివా।**
**యస్మరే త్పుండరీకాక్షం, సబాహ్యాంభ్యంతరశ్శుచిః॥**

తా॥ అపరిశుద్ధుడైనను, శుద్ధుడైనను, ఎట్టి పాపపు పనులు చేసినవాడైనను పుండరీకాక్షుని ధ్యానించిన మానసికంగాను, శారీరకంగాను శుద్ధుడు అగుచున్నాడు. వృద్ధాప్యంలో చాతగాకున్నపుడు పరిశుభ్రత లేకున్న భగవంతుని ధ్యానించవలెను.



# వేదాంత గోష్ఠి

## తొమ్మిదవ ఘట్టం
## (సచ్చిదానంద విశేషవర్ణన)

**శిష్యుడు** : "సత్" అనగా యేమి?

**గురువు** : జాగ్రత్ స్వప్నసుషుప్త్యులనే (మూడవస్థలలో) మూడు కాలాలలో దేనికి బాధ లేదో దాన్ని "సత్" అంటారు.

**శిష్యుడు** : "చిత్" అనగా యేమి?

**గురువు** : మూడు కాలాలలో యేది సర్వము తెలుసుకుంటుందో అదియే చిత్తు.

**శిష్యుడు** : "ఆనంద" మనగా యేమి?

**గురువు** : మూడు కాలాల్లో పరమప్రీతికి యేది విషయమై ఉందో దానినే 'ఆనంద' మంటారు.

**శిష్యుడు** : నేను 'సద్రూపుణ్ణి' అని యేవిధంగా గుర్తించాలె?

**గురువు** : నీవు మూడు కాలాలలోను ఉన్నావు; కాబట్టి నీవు సద్రూపునివి తెలిసిందా?

**శిష్యుడు** : మూడు కాలాలలో నేనున్నాను. కాబట్టి నేను "సత్" రూపుణ్ణి అని తెలియుటకు ఆధారమేమి?

**గురువు** : విను! నీవు జాగ్రత్తలో ఉన్నావు. స్వప్నములో ఉన్నావు సుషుప్తిలోనూ ఉన్నావు, అట్లే ప్రాతఃకాల మధ్యాహ్నకాల సాయంకాలాలల్లోనూ ఉన్నావు. పగటిలో ఉన్నావు. రాత్రిలోనూ ఉన్నావు పక్షంలో నెలల్లో ఋతువులలో సంవత్సరాలల్లో నీవున్నావు. బాల్యంలో వున్నావు. యౌవనంలో ఉన్నావు. వార్ధక్యంలో వున్నావు. గత దేహంలో

వున్నావు. వర్తమాన దేహంలో వున్నావు. భవిష్యత్ దేహంలో వున్నావు. యుగాంతర మన్వంతర కల్పాంతరాలల్లో భూతవర్తమాన భవిష్యత్ కాలాలలో వున్నావు.

(ఈ చోట "గత దేహంలో ఉంటివి. భవిష్యత్ దేహంలో ఉంటావు" అని చెప్పక ఆచోట్ల కూడా వర్తమాన కాలమునకు చెప్పినట్లే "ఉన్నావు" అని చెప్పబడింది. దాని తాత్పర్యమేమనగా "భూతభవిష్యత్కాలాలు కేవలం కల్పనా మాత్రమే కాని ఆత్మదృష్టిలో" లేవంటూ అర్థం. ఆత్మయొక్క సద్రూపాన్ని గురించి శ్రుతులలో అనేక ప్రమాణాలున్నాయి. ఆత్మ అసత్తని చెప్పే ప్రమాణమొకటి లేదు. కావున సర్వకాలాలలో ఆత్మ సచ్చిదానంద రూపమే అని నిశ్చయించాలె).

పై విధంగా త్రికాలాలల్లో నీవున్నావు కాబట్టి "నేను సద్రూపుడను" అంటూ నిశ్చయించుకో.

**శిష్యుడు :** నాకు భిన్నమైన యీ నామరూప వస్తుసహిత కాలత్రయాన్ని యే విధంగా నిశ్చయించాలె?

**గురువు :** నీకు భిన్నమై వుండే నామరూప వస్తుసహిత కాలత్రయాన్ని అసత్తని నిశ్చయించాలె.

**శిష్యుడు :** సత్తు అసత్తుల నిర్ణయం యేవిధంగా చేయాలి?

**గురువు :** సత్తు అసత్తుల యొక్క నిర్ణయం అన్వయ వ్యతిరేక రూపమైన యుక్తితో నిర్ణయించాలె.

**శిష్యుడు :** ఆ విధానమెట్లో తెల్పండి?

**గురువు :** అన్వయమనగా సంబంధించి వుండుట. వ్యతిరేకమనగా వేరై ఉండుట, జాగ్రదవస్థలో వుండే నీవే స్వప్నావస్థలో కూడా ఉన్నావు. కాబట్టి నీవు "సత్" రూపునివి. ఇది అన్వయం జాగ్రదవస్థ నీలోయెప్పుడు సంబంధించి లేదు. అది నీలో లేదు. కావున జాగ్రదవస్థ అసత్తు. ఇది వ్యతిరేకం. స్వప్నంలో వుండే నీవే సుషుప్తిలో కూడా వున్నావు. కాబట్టి నీవు సద్రూపుడివి. ఇది అన్వయం, స్వప్నం నీయందు లేదు. కావున అది అసత్తు. ఇది వ్యతిరేకం.

నిద్రలో ఉండే నీవే మేల్కొన్నాక కూడా ఉన్నావు కావున నీవు సద్రూపుడివి. ఇది అన్వయం. సుషుప్తి నీలోలేదు కావున అది అసత్తు. ఇది వ్యతిరేకం.

ఈ విధంగానే ప్రాతర్మధ్యాహ్న సాయంకాలాల్లోను పగలు రాత్రి పక్షము మాసము ఋతువు మొదలైన కాల విభాగాలల్లోను బాల్య యౌవన వార్ధక్యాది అవస్థలలోను వెనుకటి యిప్పటి ముందటి జన్మాలల్లోనూ యుగాంతర మన్వంతర కల్పాంతరాలల్లోను భూత వర్తమాన భవిష్యత్ కాలాల్లోను నీవున్నావు. కాబట్టి నీవు సద్రూపునివి. ఆత్మవు. అకాలవిభాగాలు నీలోలేవు. కాబట్టి అవి అసత్తులు. ఈ విధమైన అన్వయ వ్యతిరేక రూపమైన యుక్తిద్వార సత్తు అసత్తులను నిర్ణయించుకోవలసి వుంటుంది.

**శిష్యుడు :** "నేను చిద్రూపుణ్ని" అని తెలుసుకొనే దేలాగ?

**గురువు :** మూడు కాలాలను తెలుసుకొంటున్నావు కాబట్టి నీవు చిద్రూపునివి.

**శిష్యుడు :** "మూడు కాలాలను నేను తెలుసుకొంటున్నాను కాబట్టి నేను చిద్రూపుడిని" అని తెలియుట యెట్లో వివరించండి.

**గురువు :** విను. జాగ్రత్తను నీవు తెలుసుకొంటున్నావు. స్వప్నాన్ని తెలుసుకొంటున్నావు. సుషుప్తిని తెలుసుకొంటున్నావు.

అట్లే ప్రాతఃకాలాన్ని మధ్యాహ్నకాలాన్ని సాయంకాలాన్ని తెలుసుకొంటున్నావు. అట్లే రాత్రింబగళ్ళను పక్షమాసఋతు సంవత్సరాలను నీ వెరుగుతున్నావు. ఆ విధంగానే బాల్య యౌవన వార్ధక్య దశలను అతీతవర్తమాన అనాగత దేహాలను యుగాంతర మన్వంతర కల్పాంతరాలను భూత భవిష్యద్వర్తమాన కాలాలను నీవు తెలుసుకొంటున్నావు. ఈ అన్ని కాలాలను యెరిగే వానివి కాబట్టి నీవు చిద్రూపునివి. ఈ విధంగా నేను చిద్రూపిని అంటూ విచారించి నిశ్చయించుకో.

**శిష్యుడు :** నాకంటే భిన్నములైన దేశకాల నామరూపవస్తువులను యెట్టివని నిర్ణయించాలె?

**గురువు :** చిద్రూపుడవైన నీకంటే భిన్నములైన వాటినన్నిటిని జడములని నిశ్చయించాలె.

**శిష్యుడు :** చిత్తనగా యిట్టిదని జడమనగా యిట్టిదని యే విధానంతో నిర్ణయించాలె?

**గురువు :** చిజ్జడాల నిర్ణయాన్ని అన్వయవ్యతిరేక యుక్తితో చేసుకోవలసి యుంటుంది.

**శిష్యుడు :** అన్వయ వ్యతిరేక యుక్తి అనగా దాని విధానమెట్లు?

**గురువు :** నీవే జాగ్రదవస్థనూ యెరుగుచున్నావు. ఆ నీవే స్వప్నావస్థనూ యెరుగుచున్నావు. కాబట్టి నీవు చిద్రూపునివి. ఇది అన్వయం. జాగ్రదవస్థ నిన్ను తెలుసుకోలేదు. కాబట్టి అది జడం. ఇదివ్యతిరేకం. స్వప్నాన్ని తెలుసుకొనే నీవే సుషుప్తినీ తెలుసుకొంటూన్నావు. కాబట్టి నీవు చిద్రూపునివి. ఇది అన్వయం. స్వప్నము నిన్ను తెలుసుకోలేదు. కాబట్టి అది జడం. ఇది వ్యతిరేకం ఈ విధంగా చిజ్జడముల నిర్ణయించుటకు అన్వయ వ్యతిరేక యుక్తిని ఉపయోగించాలె.

**శిష్యుడు :** నేను ఆనందరూపుణ్ణి అనుట యెట్లు?

**గురువు :** మూడు కాలాలలో సైతం నీవు పరమప్రియుడివై వున్నావు. కాబట్టి ఆనంద స్వరూపునివి.

**శిష్యుడు :** త్రికాలాలల్లో నేను పరమప్రియంగా ఆనందరూపునిగా ఉన్నాననుటకు నిదర్శనమేమి?

**గురువు :** జాగ్రత్తలోనూ నీవు ప్రియంగా వున్నావు. స్వప్నావస్థలోనూ ప్రియంగా ఉన్నావు. సుషుప్తిలోనూ ప్రియంగా ఉన్నావు. అట్లే ప్రాతర్మధ్యాహ్న సాయంకాలాలలోను దివారాత్రి పక్షమాస ఋతువర్షాలలోను బాల్య యౌవన వార్ధక్యాలలోను గత దేహ వర్తమాన దేహ భావి దేహాలలోనూ యుగాంతర మన్వంతర కల్పాంతరాలలోను భూత వర్తమాన భవిష్యత్ కాలాలలోను నీవు పరమప్రియంగానే వున్నావు. కాబట్టి అనంద స్వరూపుడవు.

**శిష్యుడు :** నాకంటే భిన్నములైన నామరూప వస్తు సహిత కాలత్రయాన్ని యెట్టిదని నేను నిర్ణయించుకోవాలె?

**గురువు :** ఆనందస్వరూపుడైన నీకంటే భిన్నములైన వస్తువులను దుఃఖరూపాలంటూ తెలుసుకోవాలె.

**శిష్యుడు :** ఆనందమని దుఃఖమని వాటిస్వరూపాన్ని నిశ్చయించే పద్ధతి యేది?

**గురువు :** పూర్వోక్త అన్వయ వ్యతిరేక పద్ధతినే అనుసరించాలె.

**శిష్యుడు :** వివరించండి?

**గురువు :** జాగ్రత్తలో పరమప్రియంగా వుండే నీవే స్వప్నంలోను పరమప్రియంగా వున్నావు. కాబట్టి నీవు ఆనందరూపుడివి. ఇది అన్వయం, జాగ్రదవస్థ నీకు ప్రీతిపాత్రమైలేదు. కాబట్టి అది దుఃఖరూపమైయ్యేవుంది. ఆత్మయందు తోచేజాగ్రదాది అవస్థలు నిజానికి దుఃఖరూపాలే అయినా అధ్యాసబలంతో ఆయా అవస్థలు ఆత్మయొక్క చిదాభాసుని ద్వారా ప్రియంగా తోస్తున్నాయి. అనుభవిస్తున్న అవస్థతప్ప అన్యమైన అవస్థలు కాని కాలాలు కాని ప్రీతి పాత్రంగా తోచుటలేదు. వాటియందలి ప్రీతిని వ్యభిచారప్రీతి అంటారు. వాస్తవానికి అది దుఃఖరూపమే. ఆత్మకు తనయందు తనకు గల ప్రీతి అవ్యభిచారమైవుంది. కాబట్టే ఆత్మ ఆనంద స్వరూపమనుట జరిగింది.

**శిష్యుడు :** నేను పరమప్రియుణ్ణి అని తెలుసుకొనుట యెట్లు?

**గురువు :** నిగాతో విను. (1) నీ కొడుక్కు ఒక మిత్రుడున్నాడనుకో, వాన్ని కూడా నీవు ప్రేమిస్తూంటావు. ఎందుకు, నీ కొడుకుపైగల ప్రేమను బట్టి వాన్నీ ప్రేమిస్తావు అంతేగాని స్వంతంగా వానిపైననే కల ప్రేమతో కాదుకదా! ఇక (2) నీ పుత్రుని ప్రేమిస్తావు ఆ ప్రేమ వాని చెలికాన్ని ఆశ్రయించి వచ్చిన ప్రేమకాదు. సొంతంగా కొడుకుమీద ఉండే ప్రేమే. కాబట్టిపుత్రుడు అధిక ప్రేమాస్పదుడు.

ఇట్లే ధనము ధాన్యము ఆలుబిడ్డలయందు చూపే ప్రేమ తన్ను ఆశ్రయించి అనగా ఆత్మను ఆపేక్షించి యేర్పడినట్టిది. ఆత్మయందలి ప్రేమ అనగా తనయందు తాను చూపే ప్రేమ దేన్నీ ఆశ్రయించింది కాదు అది నిరపేక్షిక ప్రేమ. కాబట్టి అన్నిటికంటే తానే (ఆత్మే) అధికప్రియుడు. ఈ విధంగా నేను పరమప్రియుణ్ణి అంటూ నిశ్చయించుకో

**శిష్యుడు :** ప్రేమ (ప్రీతి)లో హెచ్చుతగ్గులు ఉన్నాయా?

**గురువు :** ఉన్నాయి విను.

శ్లో॥ విత్తాత్ పుత్రః ప్రియఃపుత్రాత్ । పిండః పిండాత్తథేంద్రియం।
ప్రాణ ఇంద్రియాచ్చ ప్రియః ప్రాణాదాత్మా పరఃప్రియః॥

(1) ప్రంపచములో అందరికి డబ్బుమీద ప్రీతిమెండు ఆ డబ్బుకోసం నానా దేశాలు తిరుగుతాడు, ఎన్నో తిప్పలు పడ్తాడు. కావున ధనము ప్రియ వస్తువు.

(2) ద్రవ్యానికంటె కొడుకు అధిక ప్రియుడు, కుమారుడు జైల్లో పడితే యెంత డబ్బైనా యిచ్చి వాన్ని విడిపించుకొంటాడు. కావున ధనానికంటె సుతుడు ప్రేమాస్పదుడు.

(3) కొడుకుకంటే తన దేహం అధిక ప్రీతిపాత్రమై ఉంటుంది. కరువు కాటకాలు వచ్చి బ్రతుకుటే దుర్భరమైపోతే బిడ్డలనైన అమ్మి బ్రతకాలని తల్లిదండ్రులు ప్రయత్నిస్తారు. కాబట్టి కొడుకుకంటె శరీరం అధికప్రియం.

(4) శరీరానికంటె ఇంద్రియాలు అధికప్రియాలు. ఎవడైన కొట్టేదాకికై వస్తే గప్పున కళ్ళు మూసుకొంటాము ఆ దెబ్బ దేహానికి తగిల్తెమానె, కన్ను చెవి ముక్కు మొదలైన యింద్రియాలకు తాకరాదంటూ యిష్టము. అందుచేతనే శరీరానికంటే యింద్రియాలు ప్రియాలని చెప్పుట.

(5) యింద్రియాలపై కంటే ప్రాణంపైగల ప్రీతిమిక్కుటం. ఒక ఉదాహరణం ఒకడు ఖూనీచేశాడు. న్యాయాధిపతి వానికి మరణదండన విధిస్తాడు. ప్రాణం నిలపుకోవాలని ధనం ధాన్యం ఆలుబిడ్డలనైనా కుదవ పెట్టేదానికి వాడు సిద్ధపడ్తాడు. చివరకు కాలు చేయి ముక్కు మొదలైన యింద్రియాలనైనా యిస్తానంటాడు. కాబట్టి యింద్రియాలకంటె ప్రాణం అధికప్రియమని తేలింది.

(6) ప్రాణానికింటె ఆత్మ అధికాధిక ప్రియమైంది. భయంకర రోగపీడితుడైన ఒకానొకడు ఆ బాధ కోర్వలేక "అయ్యో! ఈ ప్రాణంపోతే నాకు హాయిగా వుంటుం"దంటాడు అందువల్ల ప్రాణానికంటె ఆత్మ మరింత ప్రియవస్తువని అర్థం.

ప్రేమలో యీ విధంగా న్యూనాధిక భావం వుంది. ఇన్నీ విచారించి ఆత్మ సర్వాధిక వస్తువంటూ నిశ్చయించుకోవాలె.

వేదాంతగోష్ఠిలో సచ్చిదానంద విశేషవర్ణనాన్ని గురించిన
తొమ్మిదోఘట్టం ముగిసింది.



# వేదాంత గోష్ఠి

## పదవ ఘట్టం
## (అవాచ్య సిద్ధాంత వర్ణన)

**శిష్యుడు :** బ్రహ్మస్వరూపమై వున్న ఆత్మ వాక్కు విషయం కాదని అంటిరి. అట్లైతే సత్ – చిత్ ఆనందాది విశేషణాలతో దానిని చెప్పుట యేలా పొసగుతుంది?

**గురువు :** బ్రహ్మ స్వరూపమైన ఆత్మకు విధేయ విశేషాలని నిషేధ్యవిశేషాలని రెండు విధాలైన విశేషణాలున్నాయి.

సత్తని చిత్తని ఈ విధంగా విధిముఖంతో బ్రహ్మమును బోధించే శబ్దాలను విధేయ విశేషణాలంటారు. అనంతము (అంతములేనిది) అఖండము (ఖండము కానిది) అంటూ నిషేధ ముఖంగా బ్రహ్మాన్ని బోధించే శబ్దాలను నిషేధ్య విశేషణాలంటారు.

సత్తు చిత్తు మొదలైన విధేయ విశేషణాలు ప్రపంచాన్ని నిషేధించగా సర్వనిషేధావధి భూతమై మిగిలిన బ్రహ్మాన్ని లక్షణద్వారా బోధిస్తవి. ఆ పద్ధతిని వివరిస్తాను విను.

1) మాయయందూ ప్రపంచమునందు సాపేక్షిక సత్యత్వం వుంది. బ్రహ్మమునందు నిరపేక్షిక సత్యత్వం వుంది. ఈ రెంటిని కలిపి సత్పదానికి వాచ్యార్థమంటారు. అందులో మాయ ప్రపంచాలయొక్క సత్యత్వాన్ని త్యజించి కేవలం బ్రహ్మముయొక్క సత్యత్వాన్ని గ్రహించుట 'సత్' పదానికి లక్ష్యార్థం.

2) అంతఃకరణవృత్తి రూపజ్ఞానము చేతన రూపజ్ఞానము, రెండు కలిసి చిత్ పదానికి వాచ్యార్థం. అందులో వృత్తి రూపజ్ఞానాన్ని వదలి చేతన రూపజ్ఞానాన్ని గ్రహించుట "చిత్" పదానికి లక్ష్యార్థం.

3) విషయానంద, వాసనానంద, బ్రహ్మానందాలు మూడూ కలిసి ఆనంద పదానికి

వాచ్యార్థం. విషయానంద వాసనానందాలను విసర్జించి కేవల బ్రహ్మానందాన్ని గ్రహించుట. "ఆనంద" పదానికి లక్ష్యార్థం.

4) మాయయందును దానికి కార్యాలైన ఆకాశాదుల యందును ఆపేక్షిక వ్యాపకత్వం వుంది. బ్రహ్మరూపమగు ఆత్మయందు నిరపేక్షిక వ్యాపకత్వం వుంది. రెండూ కలిసి బ్రహ్మ (విభు) పదానికి వాచ్యార్థం. నిరపేక్షిక వ్యాపకమైన బ్రహ్మము మాత్రమే బహ్మ పదానికి లక్ష్యార్థం.

5) సాభాసబుద్ధియందు అపేక్షిక స్వప్రకాశత్వం వుంది చేతనమందు నిరపేక్షిక స్వప్రకాశత్వం వుంది. ఈ రెండు కలిసి స్వయంప్రకాశకపదానికి వాచ్యార్థం. నిరపేక్షిక స్వప్రకాశత్వంకల కేవల చేతనమే స్వయంప్రకాశ శబ్దానికి లక్ష్యార్థం.

6) రజ్జువు మొదలైన వాటియందు ఆపేక్షికమైన అవికారిత్వం వుంది. చేతనంలో నిరపేక్షికమైన అవికారత్వం వుంది. ఈ రెంటికి కూటస్థపదం వాడ్తారు. ఇది వాచ్యార్థం. కేవల చేతనం కూటస్థపదానికి లక్ష్యార్థం.

7) సాక్షి అనే పదం, లోకంలో సాక్ష్యం చెప్పేవానికి మాయా (అవిద్యా) ఉపహిత చేతనానికి చెప్పబడ్తుంది. ఇది వాచ్యార్థం. మాయ (అవిద్య) ఉపహితచేతనం సాక్షి పదానికి లక్ష్యార్థం.

8) అభాస సహిత అంతఃకరణ వృత్తిరూప దృష్టితో విశిష్టమైన చేతనము 'దృష్ట' పదానికి వాచ్యార్థం, కేవల చేతనభాగం ద్రష్ట పదానికి లక్ష్యార్థం.

9) ఉపద్రష్ట అనేపదం యజ్ఞంలోని ఉపద్రష్టకు ప్రత్యగాత్మకు చెప్పబడ్తుంది. అది వాచ్యార్థం. కేవల ప్రత్యగాత్మ ఉపద్రష్ట పదానికి లక్ష్యార్థం.

10) 'ఏకం' అనే పదం ఒంటరి వానికిని సజాతీయాది భేదరహితమైన బ్రహ్మానికి చెప్పబడ్తుంది. అది వాచ్యార్థం. కేవల బ్రహ్మం ఏకపదానికి లక్ష్యార్థం.

ఈ రీతిగానే విధేయ విశేషణాలన్నిటికి వాచ్యార్థ లక్ష్యార్థాలను గ్రహించుటకై ప్రయత్నించాలె.

మరియు అనంతము అఖండము యీ మొదలగు నిషేధ్య విశేషణాలు సాక్షాత్తుగా

ప్రపంచాన్ని నిషేధిస్తాయి. అందువలన ఆ ప్రపంచానికి విలక్షణమైన బ్రహ్మరూపమగు ఆత్మ సహజంగా సిద్ధిస్తుంది.

బ్రహ్మరూపమగు ఆత్మ (సహజసిద్ధము కాబట్టి) అవాచ్యమే. దానిని యే విశేషణాలతోను చెప్ప వీలులేదు.

**శిష్యుడు :** సత్తు చిత్తు మొదలగు విధేయ విశేషణాలు ప్రపంచాన్ని నిషేధిస్తూ అవశేషమగు బ్రహ్మాన్ని యే విధంగా బోధిస్తాయి?

**గురువు :** సత్తని చెప్పుటతో అసత్తుకు నిషేధం కల్గింది. మిగిలింది సత్ స్వరూపం. అది లక్షణ ద్వారా సిద్ధించింది. అట్లే.

చిత్ అని చెప్పుటతో జడము నిషేధింపబడింది. చిద్రూపము మిగిలింది. లక్షణమూలంగా అది సిద్ధించింది. ఆనందమని చెప్పుటతో దుఃఖానికి నిషేధం కల్గింది. మిగిలినది ఆనందరూపం, లక్షణావృత్తితో అది సిద్ధించింది. బ్రహ్మమని చెప్పుటతో పరిచ్ఛిన్నతకు నిషేధం కల్గింది. మిగిలినది అపరిచ్ఛిన్నవ్యాపక బ్రహ్మమే. అది లక్షణ ద్వారా సిద్ధిస్తుంది. స్వయంప్రకాశమనుటతో పరప్రకాశాలు నిషేధింపబడ్డాయి. మిగిలి వుండేది స్వయంప్రకాశమే. అది లక్షణంతో సిద్ధిస్తుంది. కూటస్థమని చెప్పుటతో వికార వస్తువులు నిషేధించబడ్డాయి. మిగిలినది అవికారి కూటస్థం. అది లక్షణద్వారా సిద్ధించింది. సాక్షి అని చెప్పుటతో సాక్ష్యవస్తువులు నిషేధింపబడ్డాయి. మిగిలినది సాక్షి మాత్రం. అది లక్షణావృత్తితో సిద్ధించింది.

ఇట్లే మరియు ద్రష్ట ఉపద్రష్ట ఏకము మొదలగు విధేయ విశేషణాలను విచారించుకోవాలె.

**శిష్యుడు :** అనంతాది నిషేధ్య విశేషణాలు ప్రపంచాన్ని యే విధంగా నిషేధిస్తాయి?

**గురువు :** అనంతమని చెప్పుటతో దేశకాల వస్తుకృత పరిచ్ఛేదాలు నిషేధింపబడ్డవి. మిగిలినది అనంతం. అది లక్షణార్థంతో సిద్ధిస్తుంది. ఈ విధంగానే తక్కిన నిషేధ్య విశేషణాలను గూర్చి కూడా నిర్ణయించుకొనేది.

**శిష్యుడు :** ఈ విశేషణాలను ఈ విధంగా అర్థము చేయుటలో ప్రయోజనమేమి?

గురువు : "చేతనము మనోవాక్కులకు విషయంకాదు." అని చెప్పిన శ్రుతితో పొందిక కల్గించుట కొరకై యీ విశేషణాలకు యీ మాదిరిగా అర్థం చెప్పబడింది.

మనస్సుకు వాక్కుకు ప్రవృత్తిని కల్గింపజేసే గుణ క్రియాజాతి సంబంధాది ధర్మాలు బ్రహ్మమునందు లేవు. ధర్మ విరహితం కాబట్టి బ్రహ్మం నిర్విశేషం. అందుకయ్యే శ్రుతి కూడా మనో వాక్కులకు అవిషయంగానే చెప్పింది.

మరేమంటే మాటలన్నీ ద్వైతంలోనే వర్తిస్తాయి. అద్వైతంలో యే మాటాలేదు. కాబట్టి ఆ విశేషణాలకు పై విధంగా అర్థాన్ని చెప్పుటతో శ్రుతికి విరుద్ధమైన ద్వైతం సిద్ధించదు. అద్వైత స్వరూపం సహజంగా తెలియబడ్తుంది.

వేదాంత గోష్ఠిలో అవాచ్యసిద్ధాంత వర్ణనను
గురించిన పదోఘట్టం ముగిసింది.

**భగవద్గీతలో అర్జునుడు శ్రీకృష్ణభగవానుని సంబోధించిన పేర్లు - 38**

1. అచ్యుతుడు. 2. అనంతుడు. 3. అప్రతిమ ప్రభావుడు. 4. అరిసూదనుడు. 5. జనార్దనుడు. 6. దేవుడు. 7. దేవదేవుడు. 8. దేవవరుడు. 9. దేవేశుడు. 10.పరమేశ్వరుడు. 11. పురుషోత్తముడు. 12. ప్రభువు. 13. భగవంతుడు. 14.ఆద్యుడు. 15. కమలప్రతాక్షుడు. 16. కృష్ణుడు. 17. కేశవుడు. 18.భూత భావనుడు. 19. భూతేశుడు. 20. మధుసూదనుడు. 21 మహాత్ముడు. 22.మహా బాహువు. 23. మాధవుడు. 24. యాదవుడు. 25.యోగి. 26. యోగేశ్వరుడు. 27.కేశినిషూదనుడు. 28.గోవిందుడు. 29. జగత్పతి. 30. జగన్నివాసుడు. 31.వార్ష్ణేయుడు. 32. వాసుదేవుడు. 33. విశ్వమూర్తి. 34. విశ్వేశ్వరుడు. 35.విష్ణువు. 36. సర్వుడు. 37. సహస్రబాహువు. 38. హృషీకేశుడు.

**శ్రీకృష్ణభగవానుడు అర్జునుని సంబోధించిన పేర్లు - 24**

1. అనఘుడు. 2.అనసూయుడు. 3. అర్జునుడు. 4. కపిధ్వజుడు. 5. కిరీటి. 6. కురుప్రవీరుడు. 7. కురునందనుడు. 8.కురుశ్రేష్ఠుడు. 9. కురుసత్తముడు. 10. కౌన్తేయుడు. 11. గుడాకేశుడు. 12. తాత. 13. దేహభృతాంవరుడు. 14.ధనంజయుడు. 15. పరన్త పుడు. 16. పాండవుడు. 17. పార్థుడు. 18. పురుషర్షభుడు. 19.భరతర్షభుడు. 20.భరత శేష్ఠుడు. 21. భరతసత్తముడు. 22. భారతుడు. 23.మహాబాహువు. 24. సవ్యసాచి



# వేదాంత గోష్ఠి

## పదకొండో ఘట్టం
## (సామాన్య విశేష చైతన్య వర్ణన)

**శిష్యుడు :** విశేష చైతన్యమంటే యేమి?

**గురువు :** బ్రహ్మము సామాన్య చైతన్యం. ఆ సామాన్య చైతన్యం అంతఃకరణంలోనూ దాని వృత్తులలోనూ ప్రతిబింబిస్తుంది. ఆ ప్రతిబింబాన్ని చిదాభాసుడంటారు. ఆ చిదాభాసుడే విశేష చైతన్యం. ఈ విశేష చైతన్యం ముందు పదమూడోగోష్ఠిలో చెప్పబోయే కల్పిత విశేషాంశంలో అంతర్భావం బొందుతుంది.

**శిష్యుడు :** చిదాభాసుని లక్షణమేమి?

**గురువు :** చైతన్యం యొక్క లక్షణం లేకున్నా చైతన్యంవలె ప్రకాశించేవాడు చిదాభాసుడు.

**శిష్యుడు :** ఈ చిదాభాసుణ్ణి విశేష చైతన్యమంటూ యెందుకన్నారు?

**గురువు :** పరిమిత దేశంలో పరిమిత కాలంలో వుండే వస్తువును విశేషమంటారు. ఈ చిదాభాసుడు అంతఃకరణ ప్రదేశంలో జాగ్రత్కాల స్వప్నకాల అజ్ఞాన కాలాలలో ప్రకాశిస్తాడు కావున వీన్ని విశేషచైతన్యమన్నారు.

అధిష్ఠానము అధ్యస్తము అంటూ విశేషము రెండు విధానాలు. (1) భ్రాంతి కాలంలో యేది అగుపడదో దేని జ్ఞానంతో భ్రాంతి నశిస్తుందో దాన్ని అధిష్ఠానరూప విశేషమంటారు. (2) భ్రాంతికాలంలో తోచి అధిష్ఠానజ్ఞాన కాలంలో కానరానిదాన్ని అధ్యస్తరూప విశేషమంటారు. దీనినే కల్పిత విశేషమని కూడా అంటారు.

**శిష్యుడు :** ఈ విశేషచైతన్యాన్ని దృష్టాంతం ద్వారా విశదం చేయండి?

**గురువు :** (1) సూర్యప్రకాశం అంతటా వ్యాపించి వుంటుంది కాని దాని ప్రతిబింబం అంతటా యేర్పడే వీల్లేదు, అద్దము నీరువంటి ఉపాధులు గలచోట ప్రతిబింబమేర్పడి ఆ ప్రకాశం విశేషరూపం ధరించి భాసిస్తుంది. (2) అంతేగాక, సామాన్యరూపంతో అంతట వ్యాపించి వుండే సూర్య ప్రకాశం గుడ్డను కాని దూదిని కాని కాల్చలేదు.. కానీ ఆ సూర్య ప్రకాశానికి సూర్య కాంతమణి కాని భూతద్దం కాని ఉపాధిగా లభిస్తే ఆ ప్రకాశం అగ్నియై విశేషరూపం ధరించి బట్టను దూదిని దహింపగల్గుతుంది అట్లే.

(1) సామాన్య చైతన్యం యెల్లప్పుడూ యెల్లెడలా యథా రూపంలో వుంటుంది. ఆ సామాన్యరూపం యతార్థమైంది.

(2) ఉపాధిద్వారా తోచే విశేషరూపం వ్యభిచార శీలమైంది. కాబట్టి అది అల్పకాలస్థాయి కల్గింది. అయథార్థమైంది.

(1) అస్తిభాతి ప్రియరూపమైన సామాన్య చైతన్యం సర్వత్రా సమానంగా వుంది. తినుట తిరుగుట మొదలగు విశేష వ్యవహారం దీనిద్వారా సిద్ధింపదు. (2) ఎచ్చట అంతఃకరణమనే ఉపాధి వుంటుందో అచ్చట విశేష చైతన్యం చిదాభాస రూపంతో వెలిసి మాట్లాడుట నడచుట కర్తృత్వము భోక్తృత్వము లోకాంతర గమనాగమనాలను కల్గివుంటుంది. ఈ విశేష వ్యవహారం విశేషచైతన్యం ద్వారానే సిద్ధిస్తుంది.

అందులో (1) సామాన్య చైతన్యమైన బ్రహ్మ వస్తువు సత్యము (2) ఉపాధివల్ల తోచే విశేష చైతన్యమైన చిదాభాసుడు మిథ్య అట్లే ఆ చిదాభాసునికి సంబంధించిన పుణ్య పాపకర్తృత్వం సుఖదుఃఖ భోక్తృత్వం లోకాంతర గమనా గమనం జన్మ మరణాలు ఎనుబది నాల్గులక్షల జీవయోని పరిభ్రమణం యీ సంసార ధర్మాలన్నీ కూడా మిథ్యలే.

**శిష్యుడు :** ఈ విశేషచైతన్యం స్వరూపజ్ఞానంతో యేమని నిశ్చయించుకోవలె?

**గురువు :** "విశేష చైతన్యమనబడే చిదాభాసుడూ అతని ధర్మాలు నేనుకాదు; అవి నావీకావు. నాయందు కల్పితాలు మాత్రం, దానికి భిన్నమై దానికి అధిష్టానమైన సామాన్య చైతన్యమే నేను!" అని నిశ్చయించుకోవాలె.

**శిష్యుడు :** సామాన్యచైతన్యమని దేన్ని చెప్పాలె?

**గురువు :** ఆకాశమువలె సర్వత్రా నిండివుండేది 2. సమస్త నామరూపాలకు అధిష్ఠానమై వుండేది. 3. అస్తి భాతిప్రియ రూపమైంది. 4. నిర్వికార బ్రహ్మమనబడేది అదే సామాన్య చైతన్యం.

**శిష్యుడు :** బ్రహ్మమును సామాన్య చైతన్యమని యెందుకు చెప్పారు?

**గురువు :** అధిక ప్రదేశంలో అధిక కాలంలో వ్యాపించివుండే వస్తువును సామాన్య మంటారు. బుద్ధికల్పితాలైన అన్ని ప్రదేశాలలో అన్ని కాలాలలో బ్రహ్మము వ్యాపించి వుంది. కావున దాన్ని సామాన్య చైతన్యం అన్నారు.

**శిష్యుడు :** సామాన్య చైతన్య స్వరూపాన్ని దృష్టాంత సహితంగా స్పష్టం చేయండి?

**గురువు :** ఒక త్రాడు వుంది, భ్రాంతివలన దాన్ని ఒకడు పామనుకొన్నాడు. ఒకడు కర్ర అనుకొన్నాడు. ఒకడు నేలపగులు అనుకొన్నాడు. ఇంకొకడు నీటిజాలు అనుకొన్నాడు. వారు భ్రాంతితో చేసే వ్యవహారంలో సామాన్యాంశం విశేషాంశమని రెండంశాలున్నాయి. ఇది కర్ర; ఇది పాము; ఇది నేలపగులు; ఇది నీటిజాలు; అనే మాటలలో ఇది అనే అంశం అన్నిటిలోను వ్యాపించి వున్నది. భ్రాంతికాల వ్యవహారంలో కూడా ఈ అంశం లోపించలేదు. ఈ (ఇదం) ఇది అనే అంశం త్రాటికి స్వరూపం; దీన్ని సామాన్యాంశమంటారు. భ్రాంతిలేని కాలంలో ''ఇది త్రాడు'' అని వ్యవహరించేటప్పుడూ "ఇది" అనే అంశం వుంది. ఇది (ఇదం) అనే సామాన్యాంశం అవ్యభిచారి; అనగా భ్రాంతి కాలంలోను భ్రాంతిలేని కాలంలోను మారిపోదు కాబట్టి సత్యమంటారు. పరస్పరం వ్యభిచారాలై సర్పాదికాలు మారిపోతుంటాయి. కాబట్టి అవి విశేషాంశాలు, అవి కల్పితాలనబడ్డాయి. ఇది దృష్టాంతం.

అట్లే అన్ని పదార్థాలలో 1) అస్తి 2) భాతి 3) ప్రియ 4) నామ 5) రూపములని అయిదంశాలున్నాయి. ఉదాహరణానికి ఒక కుండను తీసుకో. 1) కుండ వున్నది. ఉన్నది అనుట అస్తి అనే అంశం. ఆ అంశాన్నే సత్ అని అంటారు. 2) కుండ ప్రకాశిస్తుంది. (తెలియవస్తుంది) ప్రకాశించుట అనగా భాతి అదే చిత్. 3) కుండ ఉపయోగకరం కాబట్టి ప్రేమాస్పదం. అది ప్రియమనే అంశం. అదే ఆనంద

మనబడ్తుంది. 4) కుండ అనే రెండక్షరాలు ఆ వస్తువుకు నామం. 5) కడుపు గొంతు అంచు మొదలైన ఆకారం దానికి రూపం. ఈ విధంగా అన్ని భూతాలలో భూత కార్యాలలో అస్తి భాతి ప్రియనామ రూపాలనే అయిదు అంశాలను గ్రహించాలె.

ఈ అయిదు అంశాలను కేవలం బైటి పదార్థాలలోనే గాక దేహంలో కూడా పరిశీలించాలె (1) నేనున్నాను. ఇది "అస్తి" అంశం (2) నేను తెలుసుకొంటున్నాను. ఇది "భాతి" అంశం. (3) నేను నాకు ప్రేమాస్పదంగా వున్నాను, ఇది "ప్రియ" అంశం. (4) దేహేంద్రియ ప్రాణ మనోబుద్ధి చిత్తాలూ వాటి ధర్మాలూ "నామ" అంశంలో చేర్తాయి. (5) కలిగివుండే ఆకారం ఒడ్డు పొడుగు లావు సన్నం 'రూప' అంశంలో చేర్తాయి. ఇవే దేహంలోని అయిదంశాలు.

ఘటాది కార్యవస్తువుల కన్నిటికి పృథ్వికారణ వస్తువు, (1) పృథ్వివున్నది, (2) పృథ్వి అగపడ్తుంది. (3) పృథ్వి ప్రియమైవుంది. (4) పృథ్వి అని దీనికి నామం. (5) గంధగుణం కల్గిన ఆకారమే దీనిరూపం. ఇవే పృథ్విలోని పంచ అంశాలు. పృథ్విలోని పంచ అంశాలు త్యజిస్తే జలం మిగులుతుంది. దానిలోనూ అయిదు అంశాలున్నాయి. జలంలోని అయిదు అంశాలు త్యజిస్తే తేజస్సు మిగుల్తుంది. తేజస్సులోని ఐదు అంశాలు త్యజిస్తే వాయువు మిగుల్తుంది. వాయువుయొక్క పంచ అంశాలను త్యజిస్తే ఆకాశం మిగుల్తుంది. అట్లే దాని యొక్క అయిదు అంశాలు తీసివేస్తే అజ్ఞానం శేషిస్తుంది.

అజ్ఞానముయొక్క నామరూపాది అంశాలన్నింటిని త్యజిస్తే "ఇక మిగిలేదేమిలేదని" తోచే (భాతి) అభావం సర్వవస్తు భావం మిగిలివుంది. (అస్తి) ఆ అభావం శూన్య ధ్యానులకు ప్రియంగానేవుంది. అభావనమనేదే దాని నామం. నిషేధముఖంగా ప్రతీతికి విషయమైన సర్వవస్తు అభావమే దాని రూపం.

ఆ భావం యొక్క అంశాలన్నీ త్యజిస్తే ఆ అభావానికి స్వరూపం భూతమగు అధిష్ఠానము సద్వస్తువు మిగుల్తుంది. అది ఆ అభావాన్ని అభావత్వాన్ని ప్రకాశింపజేస్తుంది. కాబట్టి అది చిత్తు. అది దుఃఖానికి భిన్నం కాబట్టి ఆనందం.

ఈ విధంగా నామరూపాలన్నిటిలో అనుగతమై అవ్యభిచారియై నామరూపాలకు అధిష్ఠానమై వుండే బ్రహ్మము సామాన్య చైతన్యమనబడ్తుంది. అది సత్యవస్తువు.

ఘటమునందుండే నామరూపాలు పటములో లేవు. పటములోని నామరూపాలు ఘటములోలేవు. కాబట్టి నామరూపాలు వ్యభిచారశీలాలు. ఒకచోట వుండి ఒకచోట లేకుండాపోయాయి. ఈ చెప్పిన ఉదాహరణల ననుసరించి సామాన్య చైతన్యము యొక్క స్వరూపాన్ని నీవృత్తిలో దృఢంచేసుకో.

(1) సుషుప్తిని మూర్ఛను సమాధిని ప్రకాశింపజేసేది సామాన్యచైతన్యం. (2) 'నేను ఘటాన్ని తెలుసుకుంటూన్నాను' అనే వ్యవహారంలో వినూత్న ప్రమాణ ప్రమేయ రూప త్రిపుటిని ప్రకాశింపజేసే సాక్షియే సామాన్య చైతన్యం (3) జాగ్రదాది అవస్థల సంధిని ప్రకటించునదే సామాన్య చైతన్యం. (4) సంకల్ప వృత్తులయొక్క సంధులను వెల్లడించునది సామాన్య చైతన్యం. (5) బొటనవ్రేలి అగ్రభాగానికి ప్రకాశకమైనది సామాన్య చైతన్యము. (6) సూర్యచంద్రాది పదార్థాకారమైన వృత్తియొక్క మధ్యభాగాన్ని ప్రకాశింపజేసేది సామాన్య చైతన్యము. (7) 'మేరుపర్వతాన్ని నేనెరుగను' అనే అజ్ఞాన విశిష్ట మేరువునకు ప్రకాశనము సామాన్య చైతన్యము.

ఇట్లు సామాన్య చైతన్య సంబంధమైన వివరణలను విచారిస్తూ గమనించాలె.

**శిష్యుడు :** పైన చెప్పినట్లు సామాన్య చైతన్య స్వరూపమగు బ్రహ్మానికి అన్నిటికంటె సూక్ష్మత్వము వ్యాపకత్వము యెందుకు కల్గింది?

**గురువు :** ఏవేవి కార్యవస్తువులో అవియవి స్థూలంగాను పరిచ్ఛిన్నంగాను వుంటాయి ఏవేవి కారణవస్తువులో అవియవి సూక్ష్మంగా వ్యాపకంగా వుంటాయి. ఇదొక నియమం.

బ్రహ్మము అన్నిటకి కారణము, కాబట్టి అది అన్నిటికంటె సూక్ష్మము వ్యాపకము కూడా. వివరంగా విను.

1) సముద్ర జలమునుండి నురుగు వస్తుంది. ఉప్పు కల్గుతుంది. అది నీటికంటె కఠినమైంది. దానిని బట్టి పృథ్వి జలమునకు కార్యమనుట నిశ్చయము, కాబట్టి పృథ్వికంటె జలం సూక్ష్మము వ్యాపకము కూడా.

వస్త్రంలో నీరుపోస్తే కారిపోతుంది. కానీ భూసంబంధమగు మట్టిరాళ్ళు ఆ విధంగా దిగజారిపోవు భూమిని ఏ చోట త్రవ్వినా తప్పక నీళ్ళు లభిస్తాయి. అంతేగాక పురాణాలలో కూడ భూ ప్రదేశంకంటె జలప్రదేశం పదిరెట్లు అధికమైనదని చెప్పబడింది. ఇన్ని

కారణాలను బట్టి పృథ్వికంటె జలం సూక్ష్మము వ్యాపకము అయివుంది.

2) వేడిమికి దేహంలో చెమట కల్గుతుంది. అట్లే వాతావరణంలో తాపం హెచ్చినప్పుడు వర్షం వస్తుంది. దీన్నిబట్టి అగ్ని కార్యమని తెలియాలె. కావున జలం కంటె అగ్ని సూక్ష్మము వ్యాపకము కూడా. నీరు వస్త్రంలో నిలుపకపోయినా కుండలో బంధింపబడుతుంది. కానీ సూర్యాదికాల తేజస్సు ఆ విధంగా బంధింపబడదు. పురాణాలు సైతం జలానికంటె తేజస్సు పదిరెట్లు అధికమంటూ అంటాయి. అందుచేత జలముకంటే తేజస్సు (అగ్ని) సూక్ష్మము వ్యాపకము అయివుంది.

3. అగ్నియొక్క ఆవిర్భావ తిరోభావాలు వాయువుకు అధీనం కావున తేజస్సు వాయువునకు కార్యమంటారు. సూర్యాదుల తేజస్సు పటాది పాత్రలలో బంధింపబడక పోయినా కంటికి కానొస్తుంది. వాయువు కానొచ్చేదికాదు. తేజస్సుకంటె వాయువు పదిరెట్లు అధికవిస్తారమని పురాణప్రసిద్ధి. యిందువల్ల వాయువు తేజస్సుకంటె సూక్ష్మము వ్యాపకముఐవుంది.

4. వాయువుయొక్క ఉత్పత్తి స్థితిలయాలు ఆకాశంలో సంభవిస్తాయి. కాబట్టి వాయువు ఆకాశానికి కార్యం. కార్యమైన వాయువుకంటె ఆకాశము సూక్ష్మమును వ్యాపకమును వాయువు చూపుకు అందనిదే అయినా చర్మానికి గ్రాహ్యమై ఉంటుంది. ఆకాశాన్ని చర్మశక్తి గ్రహించలేదు. పురాణాలు ఆకాశాన్ని వాయువుకంటె పదిరెట్లు అధిక విస్తారంగా వర్ణించాయి. కాబట్టి ఆకాశము వాయువుకంటె సూక్ష్మము వ్యాపకము అయివుంది.

ఆకాశానికి పైన ఏముంది? 'ఏమో తెలియదు' అనేదే జవాబు. ఆ చోట బుద్ధి కుంఠితమైంది. ఆ కుంఠిభావానికి ఆశ్రయ విషయమేదని? అజ్ఞానమే ఆశ్రయం. ఆకాశము అజ్ఞానముయొక్క కార్యం.

5. ఆకాశము చర్మగ్రాహ్యము కాకున్నా మనోగ్రాహ్యము కాగల్గుతుంది. అజ్ఞానము మనస్సుకు అందరానిది. అజ్ఞానము ఆకాశానికంటె అనంతగుణిత విస్తారమంటూ శాస్త్రాలు చెబుతాయి. కాబట్టి ఆ అజ్ఞానం ఆకాశానికంటె సూక్ష్మము వ్యాపకము అయివుంది.

'అదేమోనాకు తెలియదు' అనే అనుభవానికి విషయమైన అజ్ఞానాన్ని ప్రకాశింప

చేసేది. జ్ఞానరూపమైన చేతనమే 'అజ్ఞానముప్పుంది, అది భాసిస్తుంది; అజ్ఞానానికి అది ప్రియమై వుంది' అని ఈ విధంగా అజ్ఞానంలో అస్తి భాతి ప్రియరూపముగ అనుస్యూతమై బ్రహ్మ చేతనము ప్రకాశిస్తుంది. కాబట్టి బ్రహ్మ చేతనాన్ని ఆశ్రయించి అజ్ఞానం ఉంది. అజ్ఞానానికంటె బ్రహ్మచేతనము సూక్ష్మమును వ్యాపకమును.

మనస్సుతో అజ్ఞానాన్ని గ్రహించ వీలేదనుట నిజమే. 'దాన్ని నే నెరుగను' అని ఒకడంటాడు. అది ఒక అనుభవమే. అది ఒక లింగమే అనగా గుర్తే ఆ గుర్తుద్వారా అజ్ఞానము ఊహింపబడ్తుంది. కాని బ్రహ్మ చేతనము స్వయంప్రకాశము కాబట్టి అది యేలింగమునకు ఏ ప్రమాణమునకు అందదు.

దేహంపైన మచ్చవున్నట్లు బ్రహ్మమునకు యేక దేశంలో అజ్ఞానం వుంది. తక్కిన బ్రహ్మము శుద్ధవస్తువే, అది స్వయంప్రకాశము. అజ్ఞానానికంటె ఎంతో సూక్ష్మమును వ్యాపకమును అయివుంది. ఈ విధంగా సామాన్య చైతన్య రూపమైన బ్రహ్మము సర్వ ప్రపంచానికంటె సూక్ష్మమై వ్యాపకమై వుందని తెలుసుకోవాలె.

**శిష్యుడు :** ఆ విధంగా సామాన్య చైతన్య స్వరూపాన్ని తెలియడంతో కలిగే నిశ్చయం యేమి?

**గురువు :** "అస్తి భాతి ప్రియ రూప సామాన్య చైతన్యమగు బ్రహ్మమే నేను, నేనే అస్తిభాతి ప్రియరూప సామాన్య చైతన్యమైన బ్రహ్మమును. ఈ నామరూప జగత్తు నా యందు కల్పింపబడింది." అనే నిశ్చయం యేర్పడ్తుంది.

**శిష్యుడు :** ఆ నిశ్చయంతో కలిగే ఫలమేమి?

**గురువు :** సర్వానర్థ నివృత్తి పరమానంద ప్రాప్తి అని చెప్పబడే మోక్షమే దానిఫలం.

వేదాంతగోష్ఠిలో సామాన్య విశేష చైతన్య వర్ణనమనే
పదుకొండో ఘట్టం ముగిసింది.

**శ్లో॥ బ్రహ్మచారి సహస్రంచ, వానప్రస్థ శతత్రయః॥**
**బ్రహ్మణాంతు చ కోటిశ్చ, యతిరేకో విశిష్యతే॥**

తా॥ వేయిమంది బ్రహ్మచారులకంటె మూడువందల మంది వాన ప్రస్థులకంటె, కోటిమంది బ్రాహ్మణులకంటె ఒక యతి (సన్న్యాసి) గొప్పవాడు.



# వేదాంత గోష్ఠి

## పంద్రెండో ఘట్టం
## (బ్రహ్మాత్మైక్య నిరూపణము)

**శిష్యుడు :** 'తత్ –త్వమ్' పదములు యే చోటివి?

**గురువు :** సామవేదము ఛాందోగ్యోపనిషత్తు ఆరో అధ్యాయములో ఉద్ధాలక మహర్షి తన పుత్రుడైన శ్వేతకేతువునకు **'తత్త్వమసి'** మహావాక్యాన్ని ఉపదేశించాడు. ఆ మహా వాక్యంలోని మొదటి పదము "తత్" రెండవ పదము 'త్వం.'

సామవేదానికి 'తత్వమసి'వలెనే ఋగ్వేదానికి **'ప్రజ్ఞానం బ్రహ్మ'** యజుర్వేదానికి **'అహంబ్రహ్మాస్మి'** అథర్వణ వేదానికి **"అయమాత్మాబ్రహ్మ"** అనునవి మహావాక్యాలు.

1) తత్త్వమసి మహావాక్యంలోని "తత్" పదానికి వాచ్యార్థము ఈశ్వరుడు, లక్ష్యార్థము శుద్ధబ్రహ్మము.

(2) "త్వం" పదానికి వాచ్యార్థము జీవుడు. లక్ష్యార్థము కూటస్థుడు.

(3) మొత్తము తత్త్వమసి మహావాక్యము జీవబ్రహ్మలయొక్క ఏకత్వాన్నే ప్రతిపాదిస్తుంది.

**శిష్యుడు :** వాచ్యార్థము లక్ష్యార్థమంటే అర్థమేమి?

**గురువు :** శబ్దానికి అర్థానికి ఉండే సంబంధాన్ని శబ్దవృత్తి అంటారు. అది శక్తి వృత్తి అని లక్షణావృత్తి యని రెండు విధాలు.

1) శక్తివృత్తి శబ్దంలో ఒక సామర్థ్యం ఉంది, శబ్దాన్ని వినగానే దాని అర్థ విషయక మైన పదార్థం మన అంతఃకరణ వృత్తికి కట్టెదుట కానొస్తుంది. ఆ శబ్దానికి ఆ పదార్థంతో

ఉండే సాక్షాత్తు సంబంధాన్ని శక్తివృత్తి అంటారు. ఒక దృష్టాంతం. "అగ్ని" అనేమాట వినగానే శక్తి వృత్తి ద్వారా పొయ్యిలో వుండే నిప్పు మనకు తోస్తుంది.

2) లక్షణావృత్తి శక్తివృత్తి చూపిన అర్థాన్ని ఆధారంగా తీసుకొని పరంపరగా మరొక్క అర్థాన్ని గ్రహిస్తాము. శబ్దానికి మనం గ్రహించిన పదార్థానికి పరంపరా రూప సంబంధం వుంటుంది. శబ్దానికి పదార్థంతోగల ఆ పరంపరారూప సంబంధాన్ని లక్షణావృత్తి అంటారు.

దృష్టాంతం-ఎవరినైన ఉద్దేశించి మనం మాటవరుసకు "వీనిలో అగ్ని దేవుడున్నా" డంటాము. అగ్నివలె కాల్చివేసే కోపమును అక్కడ గ్రహించాలి. పదానికి పదార్థంతో యీలాగా పరంపరగా వుండే సంబంధాన్ని లక్షణావృత్తి అంటారు.

శక్తివృత్తి ద్వారా తెలియబడే అర్థము శబ్దానికి వాచ్యార్థము. దీన్నే శక్యార్థమని లేదా ముఖ్యార్థమని కూడా అంటారు. వృత్తిద్వారా తెలియబడే అర్థం లక్ష్యార్థం.

**శిష్యుడు** : లక్షణావృత్తి యెన్ని విధాలు?

**గురువు** : జహత్తు అజహత్తు భాగత్యాగమని మూడు విధాలు.

**శిష్యుడు** : ఉదాహరణ సహితముగా వాటిని వివరించండి?

**గురువు** : వాచ్యార్థాన్ని బొత్తిగా వదలిపెట్టి ఆ వాచ్యార్థానికి సంబంధించిన పదార్థాన్ని గ్రహించుట జహల్లక్షణమంటారు.

దృష్టాంతము : ఒక మనుష్యుడు యింకొకనితో "గొల్లపల్లె యొక్కడుం"దని అడిగినాడు. వాడు "గంగలో ఉం"దని జవాబు చెప్పినాడు గంగలో పల్లెవుండే వీల్లేదు. ఆ మాటకు తగిన అర్థాన్ని గ్రహించాలి. గొల్లపల్లె గంగాతీరంలో ఉంటుంది. కాని గంగలో కాదు. గంగ అనే శబ్దము యొక్క వాచ్యార్థాన్ని పూర్తిగా వదలి ఆ వాచ్యార్థానికి సంబంధం కలతీరము గ్రహింపబడింది. ఇట్లు వాచ్యార్థాన్ని వదలిపెట్టి దానికి సంబంధించిన పదార్థాన్ని గ్రహించుట జహల్లక్షణమంటారు.

ఇక రెండవది అజహల్లక్షణ. వాచ్యార్థాన్ని వదలిపెట్టక దానికి సంబంధించిన వస్తువును గ్రహించుట అజహల్ల క్షణమంటారు.

దృష్టాంతం "తప్పెటలు పోతున్నాయి" అని ఒకడంటాడు. తప్పెటలు పోయేవికావు. వచ్చేవికావు, వాటికి గమనక్రియ సంభవించదు. తప్పెటలు అనే శబ్దానికి వాద్య విశేషాలు వాచ్యార్థం. వాచ్యార్థం మాత్రం గ్రహిస్తే అర్థం పొసగదు. కాబట్టి వాచ్యార్థాన్ని వదలకుండా దానికి సంబంధించిన అర్థాన్ని కూడా గ్రహించాలి. "తప్పెటలను పట్టుకొన్న మనుష్యులు పోతున్నారు." ఈ ప్రయోగంలో వాచ్యార్థమైన తప్పెటలు కలిసి వచ్చాయి. ఇది అజహల్లక్షణపద్ధతి.

ఇక మూడవది భాగత్యాగలక్షణ. వాచ్యార్థంలోని విరోధాంశాన్ని వదలి, పొందగలిగే అవిరోధమైన అంశాన్ని గ్రహించుట భాగ త్యాగ లక్షణమంటారు.

దృష్టాంతము : పూర్వము ఒకానొక కాలంలో ఒకానొక ప్రదేశంలో ఒక పురుషున్ని ఒకడు చూచినాడు. వాడే మరోచోట మరికొంత కాలానికి కనపబడినాడు. చూచువాడంటాడు. "వాడేవీడు" ఆ(దూర) దేశంలో ఆ(భూత) కాలంలో కనబడినవాడే ఈ (సమీప) దేశంలో ఈ (వర్తమాన) కాలంలో కనపడే వీడు అని అంటాడు. ఆ దేశం యీ దేశంకాదు. ఆ కాలం యీ కాలంకాదు ఆ దేశకాలాలకు యీ దేశకాలాలకు యేకత్వం పొసగదు. ఏకత్వానికి విరోధాంశాలైన వాచ్యార్థంలో ఉండే దేశకాలాలను పరిత్యజించి. ఆ వాచ్యార్థంలోనే విరోధాంశము కానటువంటి కేవలం పురుషున్ని గ్రహించి "వాడేవీడు" అనే అన్వయాన్ని స్వీకరించాలి. దీన్ని భాగత్యాగ లక్షణమంటారు.

**శిష్యుడు** : ఈ త్రివిధ లక్షణాలలో మహావాక్యానికి పొసగే లక్షణమేది?

**గురువు** : విను, వాచ్యార్థాన్ని సంపూర్ణంగా వదిలేది జహల్లక్షణ. ఇది మహావాక్యాన్ని సమన్వయించేందుకై గ్రహిస్తామా! వీలుపడదు. కారణమేమంటే! తత్పద వాచ్యార్థంలో బ్రహ్మ చైతన్యము త్వంపద వాచ్యార్థంలో కూటస్థ చైతన్యము కలుసుకొనే వుంది. పూర్తి వాచ్యార్థాన్ని వదలుటతో ఆ బ్రహ్మ చైతన్యాన్ని ఆ కూటస్థ చైతన్యాన్ని వదలవలసి వస్తుంది. వాటిని వదులుట అంటే. వాటికి భిన్నమైన అసజ్జడ దుఃఖాత్మక ప్రపంచాన్ని గ్రహించడమన్నమాట. లేదా! విడిచిపెట్టిన వాచ్యార్థంతో పాటు చైతన్య సహిత సమిష్టి వ్యష్టి ఉపాధి ప్రపంచమంతా త్యజింపబడింది కాబట్టి యిక మిగిలేది శూన్యం మాత్రం. అట్లైనా అనర్థమే సిద్ధిస్తుంది కాని పురుషార్థ సిద్ధిలేదు. కాబట్టి మహావాక్యంలో జహల్లక్షణ పొసగదు.

పోనీ! అజహల్లక్షణమాటో! అది యీ బాబతే. కారణమేమంటావా! విను. వాచ్యార్థాన్ని లవలేశం వదలక క్రొత్త విశేషాన్ని కూడా అదనంగా గ్రహించేది అజహల్లక్షణ యొక్క నియమం. మహావాక్యంలోని "తత్ – త్వం" పదాల వాచ్యార్థాన్ని పూర్తిగా ఉంచి పైగా ఉపరి విశేషం గ్రహించాలంటే ఉపరిగా ఉండేది శూన్యమే. అంతేగాక దీనివలన ఏకత్వ విరోధం పరిహారంగాదు. ఈ లక్షణవల్ల ఏమి ప్రయోజనం లేదు. అందువలన మహా వాక్యంలో అజహల్లక్షణ కూడా పొసగదు.

ఇక మిగిలింది భాగత్యాగలక్షణ. అందులోని విరోధాంశాన్ని వదలి అవిరోధాంశాన్ని గ్రహించాలి. తత్త్వం పదాలయొక్క వాచ్యార్థంలో ధర్మసహిత మాయ, అవిద్యలు విరోధాంశాలు. అవిరోధాంశమయిన అసంగశుద్ధ చేతనాన్ని గ్రహించాలి. అప్పుడు ఏకత్వం పొందుతుంది. పరమపురుషార్థ ప్రాప్తి కల్గుతుంది. కాబట్టి మహావాక్యంలో భాగత్యాగ లక్షణ సంభవిస్తుంది.

**శిష్యుడు** : తత్పదానికి వాచ్యార్థమేది?

**గురువు** : వాచ్యార్థ విషయము ముందు విను. అవ్యాకృతమాయ యీశ్వరునికి దేశము. ఉత్పత్తి స్థితిలయాలు యీశ్వరునికి కాలాలు. సత్త్వరజస్తమో గుణాలు యీశ్వరునికి సృష్టి సామాగ్రి వస్తువులు. మాయ అనినా త్రిగుణాలనినా ఒకటే పదార్థము. దీనిచే యీశ్వరుని దేశకాల శరీరాలకు భిన్నత్వం లేకపోవచ్చు. కుమ్మరి వాని శరీరము మృద్వికారమే. వాడు నిలిచే దేశము భూమియే. వాడు వాడుకొనే మట్టి సైతం భూభాగమే ఈ దృష్టాంతం వలెనే యీశ్వరుని దేశకాల శరీరాలకు యేకత్వం అసంభవం కాదు.

విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులు యీశ్వరునికి శరీరాలు వైశ్వానర సూత్రాత్మ అంతర్యాములు యీశ్వర పదవికి అభిమానులు. **"ఏకోహం బహుస్యామ్"** నేనొక్కని బహురూపులై తాను. అనెడి వీక్షణము మొదలుకొని **"తదేవాను ప్రావిశత్"** జీవరూపంతో ప్రవేశించే వరకూనైన సృష్టి యీశ్వర కార్యము, సర్వజ్ఞత్వము, సర్వశక్తిత్వము, సర్వ వ్యాపకత్వము, ఏకత్వము, స్వతంత్రము, సమర్థత్వము, పరోక్షత్వము, మాయో పాధిత్వమనే యెనిమిది యీశ్వరునికి ధర్మాలు.

వీటి అన్నింటితో గూడిన మాయ దానిలో ప్రతిబింబించిన చిదాభాసుడు, దానికి అధిష్ఠానబ్రహ్మము, యీ మొత్తము కలిసి యీశ్వరుడనబడ్డాడు. ఇది "తత్" పదానికి

వాచ్యార్థము.

మొత్తము మాయయొక్క భాగాన్ని, చిదాభాసుని యొక్క భాగాన్ని పరిత్యజించినంత శుద్ధ బ్రహ్మము మిగుల్తుంది. అది విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులకు అధిష్ఠానమైన యీశ్వరసాక్షి. అదే తత్ పదానికి లక్ష్యార్థం.

**శిష్యుడు :** బ్రహ్మానికి మాయా ప్రతిబింబమైన యీశ్వరునికి అన్యోన్యాధ్యాసం ఏలా సంభవించింది? దానిరూపమేమి?

**గురువు :** అవిచారదృష్టితో సంభవించింది. బ్రహ్మము సత్యము, దాని సత్యత్వ సంసర్గము (తదాత్మ్య సంబంధము) యీశ్వరునిలో ఆరోపింపబడింది. దాని వల్ల ఈశ్వరుడు సత్యంగా తోస్తాడు. ఈశ్వర స్వరూపము అతని కారణత్వ స్వరూపము బ్రహ్మములో ఆరోరింపబడింది. కాబట్టి బ్రహ్మము జగత్తుకు కారణంగా తోస్తాడు. శ్రుతులు, పురాణాలు, ఆచార్యపురుషులు, తటస్థ లక్షణాన్ని బోధించే ఉద్దేశ్యంతో ఈ విషయాన్ని అనువదిస్తారు. ఈ విధంగా బ్రహ్మమునకు యీశ్వరునికి పరస్పరాధ్యాసం కల్గింది.

**శిష్యుడు :** ఈ పరస్పరాధ్యాసం ఎట్లు నివర్తిస్తుంది?

**గురువు :** వివేకజ్ఞానంతో నివృత్తి అవుతుంది.

**శిష్యుడు :** తర్వాత 'త్వం' పదానికి వాచ్యార్థమేది? లక్ష్యార్థమేది?

**గురువు :** ముందు వాచ్యార్థ విషయం విను. చక్షు కంఠ హృదయాలు జీవునికి ప్రదేశాలు. జాగ్రత్స్వప్న సుషుప్తులు జీవునికి కాలాలు. స్థూలసూక్ష్మ కారణాలు జీవునికి (భోగసామాగ్రి) వస్తువులు. శరీరాలు కూడ అవే. విశ్వతైజసప్రాజ్ఞులు జీవత్వానికి అభిమానులు. జాగ్రత్త మొదలుకొని మోక్ష పర్యంతమైన భోగరూప సంసార జీవుని కార్యము. అల్పశక్తిత్వము, అల్పజ్ఞత్వము, పరిచ్ఛిన్నత్వము, నానాత్వము, పరతంత్రత్వము, అసమర్థత్వము, పరోక్షత్వము, అవిద్యోపాధిత్వము – ఈ యెనిమిది జీవుని ధర్మములు.

ఈ మొత్తమన్నిటితో కూడిన అవిద్యయును, దానియందు ప్రతిబింబించిన చిదాభాసుడునూ దానికి అధిష్ఠానమైన కూటస్థుడు, ఇంత పట్టూ కలిసి జీవుడనబడ్డాడు. ఆ జీవుడే 'త్వం' పదానికి వాచ్యార్థం.

దీంట్లో అవిద్యా చిదాభాసుల త్రోసివేస్తే కూటస్థాత్మ మిగుల్తుంది. స్థూలసూక్ష్మ కారణ శరీరాలకు అధిష్ఠానమైన జీవసాక్షి. అదే 'త్వం' పదానికి లక్ష్యార్థం.

**శిష్యుడు :** బుద్ధియందు ప్రతిబింబ రూపమై ఉండే జీవునికి కూటస్థునికి పరస్పరా ధ్యాసం యే విధంగా కల్గింది?

**గురువు :** విచారదృష్టి లేకపోవుటతో కల్గింది. కూటస్థుడు సత్యము; అతని సత్యత్వ సంసర్గము (తాదాత్మ్య సంబంధము) జీవునిలో అధ్యసింపబడింది. కాబట్టి జీవుడు సత్యంగా తోస్తాడు. మిథ్యగా తోచదు. జీవ స్వరూపము అతని కర్తృత్వాది ధర్మాల స్వరూపం కూటస్థునిలో ఆరోపింపబడింది. కాబట్టి కూటస్థుని యథార్థ స్వరూపం మరుగైంది. దానివల్ల అతడు కర్తగా, భోక్తగా, సంసారిగా, బద్ధుడుగా, సంగిగా జీవరూపుడుగా తోస్తాడు. నిజానికి కూటస్థుడు అకర్త అభోక్త అసంసారి నిత్యముక్తుడు అసంగుడు బ్రహ్మ రూపుడు. అధ్యాస ప్రభావంతో విపరీతంగాతోస్తాడు. ఇదే కూటస్థ జీవులకు పరస్పరాధ్యాసం.

**శిష్యుడు :** ఈ అధ్యాస ఎలా తొలగుతుంది?

**గురువు :** వివేకజ్ఞానంతో తొలగుతుంది.

**శిష్యుడు :** మహావాక్యంలోని ఈ 'తత్ – త్వం' పదార్థాలకు యేకత్వం యే విధంగా చేకూరుస్తుంది.

**గురువు :** 'తత్ – త్వం' పదాలయొక్క వాచ్యార్థాన్ని అంగీకరిస్తే ఉపాధిసహిత చైతన్యము – అనగా, యీశ్వరుడు జీవుడు యేర్పడ్తారు. వారికి యేకత్వము పొసగదు. ఆ 'తత్ – త్వం' పదాల లక్ష్యార్థాన్ని గ్రహిస్తే శుద్ధ బ్రహ్మము కూటస్థుడు వస్తారు. వారిద్దరికి యేకత్వం కుదుర్తుంది.

**శిష్యుడు :** "నేను బ్రహ్మమును" అని బ్రహ్మాత్మైక్య జ్ఞానమును పొందేది యెవరు?

**గురువు :** ఈ జ్ఞానాన్ని చిదాభాసుడు పొందుతాడు.

**శిష్యుడు :** చిదాభాసుడు బ్రహ్మమునకు భిన్నుడు. వాడు తన్ను బ్రహ్మరూపునిగా యెలా గ్రహించగల్గుతాడు?

**గురువు :** జీవ భావానికి అధిష్ఠానంగా ఉండే కూటస్థునికి బ్రహ్మముతో ముఖ్యమైన అభేదం ఉంది. బుద్ధి సహిత చిదాభాసునికి తన స్వరూపాన్ని బాధించుట ద్వారా బ్రహ్మముతో అభేదం ఘటిస్తుంది. చిదాభాసుడు తన స్వరూపాన్ని బాధించి తన్ను "అహం" శబ్ద లక్ష్యార్థమైన కూటస్థునిగా భావిస్తాడు. "నేను కూటస్థుణ్ణి" అనేది తన స్వరూపభూత కూటస్థుని యందలి అభిమానాన్ని ధరించి ఆపై **"నేను బ్రహ్మమును"** అని నిశ్చయిస్తాడు. ఇట్లు చిదాభాసుడు తన్ను బ్రహ్మరూపంగా తెలుసుకొంటాడు.

**శిష్యుడు :** ఈ 'తత్ – త్వం' పదాలయొక్క లక్ష్యార్థాలకు యేకత్వ మెలా సిద్ధిస్తుందో దృష్టాంత సహితంగా చెప్పండి?

**గురువు :** ఘటము ఉపాధిగాగల ఘటాకాశానికి మఠము ఉపాధిగాగల మఠాకాశానికి యేకత్వం కుదురదు. అయినా ఆ ఉపాధులను వదిలితే కేవల ఆకాశానికి ఏకత్వం కల్గుటలో యెట్టి విరోధము లేదు.

రెండు ప్రమిదలున్నాయి. ఒకటి కంచుది. మరొకటి మట్టిది. ఈ రెంటిలో వెలిగే దీపాలకు యేకత్వం చెప్పుటకు యెట్టి అభ్యంతరము లేదు. ఉండే విరోధ ఉపాధులవద్ద ఉండొచ్చు. ప్రకాశ ధర్మాన్ని బట్టి రెండు దీపాలకు ఏకత్వం సిద్ధిస్తుంది. ప్రభువు భటుడు ఉన్నారు వారి వారి బాహ్య పరిచార పటాటోపాన్ని ఉపాధులను దృష్టిలో పెట్టుకొన్న వారికి ఏకత్వం చెప్పలేకపోవచ్చు. కానీ మనుష్యత్వమనే ధర్మాన్ని బట్టి ఏకత్వం చెప్పుట విరుద్ధంకాదు. సముద్రానికి జలబిందువుకు ఏకత్వాన్ని చెప్పుట సబబు కాకపోవచ్చు గానీ జలధర్మ సామ్యాన్ని బట్టి చూస్తే రెండు ఒకటే అనొచ్చు. సింధువు బిందువు.

ఒక యాత్రికుడు కాశీకిపోయాడు. కాశీరాజును దర్శించాడు. రాజుగారు రాజలాంఛనాలతో ఒప్పి సింహాస నాసీనుడై ఉండినాడు. యాత్రికుడు తిరిగి తన గ్రామం చేరుకొన్నాడు. కొంతకాలం గడచింది. కాశీరాజుకు తీవ్ర వైరాగ్యం కల్గింది. రాజ్యాన్ని గిజ్యాన్నీ ఆ పటాటోపాలన్నీ వదలి గోచి ధరించి దండకమండలాలు దాల్చి దేశాటనం బయలుదేరాడు. ఆ అదాటుగా ముందు చెప్పిన యాత్రికుని గ్రామానికి వచ్చాడు. ఆ యాత్రికుడు ఆ సన్యాసిని చూచి వెనుకటి విషయాన్ని తలంచి తన ప్రక్కన వున్న వానితో అంటాడు. "అదో! చూచావా! ఆయన కాశీరాజు. నేను కాశీ వెళ్లినపుడు చూచాను. అతడే యితడు" అని అన్నాడు. ప్రక్కవాడు యిట్లంటాడు. "అరే! అదేమిమాట.

అతని దేశం వేరే, యితని దేశం వేరే, అతని అవస్థవేరు, యితని అవస్థ వేరు, అతని సంభారం వేరు, యితని సంభారం వేరు, అతని అభిమానం వేరు, యితని అభిమానం వేరు, అతని పని వేరు, యితని పని వేరు, అతని ధర్మం వేరు, యితని ధర్మం వేరు, కాశీరాజు, బిచ్చగాడు ఒకడే యెట్లైతారు?

కానీ వానికి వీనికి సంబంధించి ఉందే (1) దేశ (2) అవస్థా (3) సంభార (4) అభిమాన (5) కార్య (6) ధర్మాలను వదిలిపెట్టితే రెంటిలో అనుస్యూతంగా ఉండే మనుష్యుడు మాత్రం ఒకడేకదా!

ఆ విధంగానే జీవునికి యీశ్వరునికి సంబంధించిన దేశ కాలాదులను త్యజించి రెంటిలో వ్యాపకమైన అనుస్యూతంగా ఉండే చేతన మాత్రమైన ఆత్మను బ్రహ్మమును ఒక్కటిగా తెలియాలె. బ్రహ్మమునే నేను, నేనే బ్రహ్మమునంటు దృఢంగా నిశ్చయించాలి. ఈ తత్త్వజ్ఞానం ద్వారానే సర్వ దుఃఖ నివృత్తి పరమానంద ప్రాప్తియనెడి మోక్షం లభిస్తుంది.

వేదాంత గోష్ఠిలో బ్రహ్మాత్మైక్య నిరూపణమనే

పంద్రెండో ఘట్టం ముగిసింది.

1. శ్రీ వివేకానందులవారు కాశీ పండితులకు సోమరితనం గూర్చి చెప్పినమాట. ఓ పండితులారా! మిమ్ములను చూస్తే నాకు నిద్ర వచ్చుచున్నది. మా గురువుగారిని చూస్తే చచ్చిన శవం లేచి పరుగెత్తును. మన మెదుడున చదరపు అంగుళమునకు 10 కోట్ల జీవరాసులు ఉంటాయట. సామాన్యులకు 3 మాత్రమే వికసించును. ఇంకా కొంచెం గొప్పవారికి 20 వికసించును. వివేకానందులకు అన్నియు వికసించునట.

2. శ్రీరామతీర్థులవారి అత్తగారు వారి భార్యను తీసుకవెళ్లి, ఈ అమ్మాయిని గురించి ఎప్పుడైనా తలపించినారా? అని అడిగితె, ఆమె నాకంటె వేరుగా ఉంటెగదా? గుర్తుకు వచ్చేది.

3. ఆశ్రమములు ఎందుకు? మలవిక్షేప ఆవరణ దోషాల నివారణకు.

4. తల్లికొరకు బిడ్డ తపించినట్లు, భక్తుడు భగవంతుని కొరకు తపించాలి.



# వేదాంత గోష్ఠి

## పదమూడవ ఘట్టం
## (ప్రపంచమిథ్యా నిరూపణము)



**శిష్యుడు :** ఆత్మయందు మూడు అవస్థలు యెలాతోచాయి?

**గురువు :** విను. ముత్యపుచిప్పలో వెండికానొచ్చింది. అభ్రకం కానొస్తుంది. కాగితం తోస్తుంది. ఈ మూడు వస్తువులు ముత్తెపు చిప్పను వున్నదున్నట్లు తెలియకపోవడంతో గోచరిస్తాయి. శుక్తి (మత్తెపుచిప్ప) యొక్క అజ్ఞానంతో కల్పితాలై భాసిస్తున్నాయి. అవి పరస్పరంగా కానీ లేదా ముత్తెపు చిప్పలో కాని పొత్తు కల్గిలేవు. వ్యతిరేకంగా వున్నాయి. ముత్తెపు చిప్ప ఆ మూడు వస్తువులతోనూ సంబంధించి అన్వయంగా వుంది.

అది ఎట్లంటే – ఆశుక్తిలో వెండి కానొచ్చేటప్పుడు అభ్రకం గాని కాగితం కాని తోచదు అభ్రకం అగపడేటపుడు కాగితము వెండి కానరావు. కాగితం కానొస్తే వెండికి అభ్రకానికి ప్రతీతిలేదు. ఈ విధంగా ఆ మూడు వస్తువులు పరస్పర వ్యతిరేకంగా వున్నాయి. ఆ మూడు వస్తువులు శుక్తిలో వ్యావహారికంగా గానీ, పారమార్థికంగా గానీ ఎప్పుడు లేనేలేవు. కాబట్టే అవి ముత్యపుచిప్పలో సైతం వ్యతిరేకంగా చెప్పబడ్డవి.

ఇది వెండి ఇది అభ్రకము, ఇది కాగితము అని వాటిని ముత్తెపు చిప్పలో కల్పించి చెప్పేటప్పుడు కూడా ఆశుక్తికి సంబంధించిన సామాన్యాంశం అనగా “ఇది” (ఇదం) అని చెప్పేమాట ఆ మూడు వస్తువులతోను సంబంధించి కలుసుకొనే వుంది. ఆ వ్యాపకత్వం శుక్తికి సంబంధించింది. కాబట్టే ముత్యపుచిప్ప ఆ మూడు వస్తువులతోను సంబంధించి అన్వయంగా వుందని చెప్పుట కల్గింది.

శుక్తికి యీ చోట సామాన్యంశము విశేషాంశము. కల్పిత విశేషాంశము అని మూడు

అంశాలున్నాయి.

1. ఇది (ఇదం) అనుట సామాన్యాంశము. ఈ అంశము బహుకాలము నిలిచి వుంటుంది. కాబట్టి సామాన్యాంశం అనబడింది. ఇదం అనే సామాన్యాంశం భ్రాంతి కాలంలో సైతం ఆ కల్పిత వస్తువులతో కూడి ప్రతీతమైతుంది. భ్రాంతిలేని కాలంలో "ఇది ముత్తెపుచిప్ప" అంటూ సత్యవస్తువుతో కూడి ప్రతీతమైతుంది.

2. నీలపృష్ఠము త్రికోణాకృతి ముత్తెపుచిప్పకు విశేషాంశము. పరిమిత స్వల్పకాలంలో ప్రతీతమైతుంది. కాబట్టి దీని విశేషాంశమంటారు. భ్రాంతి సమయములో నీలపృష్ఠము త్రికోణాకృతి కానరాదు అది కానొస్తే భ్రాంతి నిలువదు. కాబట్టి దాన్ని విశేషాంశమంటారు. దీన్ని అధిష్ఠానమనుట కూడా కద్దు.

3. వెండి అభ్రకం కాగితము ఈ మూటినీ కల్పిత విశేషాంశాలంటారు. అధిష్ఠాన జ్ఞాన కాలంలో ఇవి తోచవు. కాబట్టే కల్పిత విశేషాంశాలనుట అజ్ఞానకాలంలో తోచి జ్ఞానకాలంలో తోచవు కాబట్టి ఈ మూడునూ శుక్తియందు వ్యభిచరించాయి. వీటిని భ్రాంతులని కూడా అంటారు.

అధిష్ఠానమైన ఆత్మలో జాగ్రత్స్వప్న సుషుప్తులు మూడునూ భ్రాంతిమాత్రాలు ఆత్మయొక్క అజ్ఞానంతో అవి కలిగాయి. తోచాయి. అవి పరస్పరం వ్యతిరేకించి వున్నాయి. అధిష్ఠానమైన ఆత్మయందు కూడా వ్యతిరేకమయ్యే వున్నాయి. ఆత్మమాత్రం యీ మూటిలో అన్వయమై వుంది.

వ్యతిరేకం = అభావం - వ్యావృత్తి - ఖండసంబంధం; అన్వయం = భావం - అనువృత్తి - అఖండ సంబంధం; ఇవి పర్యాయపదాలు.

ఈ విషయాన్ని మరింత వివరిస్తాను. దత్త చిత్తుడవై విను జాగ్రత్త వున్నప్పుడు స్వప్నములేదు. సుషుప్తి వున్నప్పుడు స్వప్నము కాని జాగ్రత్త కానిలేదు. ఈ విధంగా మూడు అవస్థలు పరస్పర వ్యతిరేకమైవున్నాయి.

అధిష్ఠానమైన ఆత్మలో యీ మూడు అవస్థలకు పారమార్థికమైన అత్యంతా భావమే సిద్ధిస్తుంది. ఆత్మయందు అవి నిత్యనివృత్తి చెందే వున్నాయి. కాబట్టి మూడు అవస్థలకు అధిష్ఠానంలో వ్యతిరేకం చెప్పబడ్తుంది.

అధిష్ఠానమైన ఆత్మ ఆ మూడు అవస్థల్లో అనుస్యూతమైవుంది. వాటిని వెల్లడిచేస్తుంది. కావున ఆత్మ మూడు అవస్థల్లోనూ అన్వయరూపమై వుంది. అవిద్యా ఉపాధియొక్క సహాయంతో ఆత్మయందు (1) సామాన్య (2) విశేష (3) కల్పిత విశేషాలనే మూడు అంశాలు కల్పింపబడ్డాయి.

సద్రూపము సామాన్యాంశము. (సత్ = ఉనికి) జాగ్రత్త వుంది. స్వప్నమువుంది. సుషుప్తివుంది. ఈ విధంగా వుంది. అనే సత్ అంశము భ్రాంతి కాలంలో సైతం తొలగకనే వుంది. భ్రాంతి నివృత్తించిన కాలంలో సైతం 'నేను సద్రూపుడనై వున్నాను; చిద్రూపుడనై వున్నాను. ఆనందరూపుడనై వున్నానంటూ ఈ విధంగా ఆత్మసత్తా (ఉనికి) ప్రకాశిస్తూనే వుంది. దీన్నే సామాన్యాంశం అంటారు. దీనినే ఆధారమని కూడా అంటారు.

ఆత్మకు విశేషణాలైన చేతన ఆనంద అసంగ అద్వితీయత్వాదులు విశేషాంశంగా చెప్పబడ్డాయి. ఇవి భ్రాంతి కాలంలో గోచరింపవు. ఇవి గోచరిస్తే భ్రాంతి నిలువదు. కావున వీటిని వివేషాంశంగా చెప్పుతారు. దీనినే అధిష్ఠానమని కూడా అంటారు.

అవస్థాత్రయ రూపమై వుండే ఈ ప్రపంచము కల్పిత విశేషాంశము. బ్రహ్మాభిన్నమైన ఆత్మయొక్క అజ్ఞానకాలంలో యిది ప్రతీతమైతుంది. నేను బ్రహ్మముననే ఆత్మజ్ఞానం కల్గిన కాలంలో ఆత్మకంటె భిన్నంగా మరొక్క సత్తాగోచరించదు. కాబట్టి అవస్థాత్రయ సహితమైన ఈ ప్రపంచము కల్పిత విశేషాంశమని భ్రాంతియని చెప్పబడ్తుంది. ఈ విధంగా విచారిస్తే మూడు అవస్థలూ ఆత్మయందు మిథ్యాప్రతీతులు మాత్రం.

**శిష్యుడు :** ఆత్మలో మిథ్యా ప్రపంచ ప్రతీతి అయిందన్నారు. అలాంటి మిథ్యాప్రతీతికి దృష్టాంతాలుగా మరికొన్ని చెప్పండి?

**గురువు :** 1) స్థాణువులో పురుషప్రతీతి 2) సాక్షియందు స్వప్న ప్రతీతి 3) ఎండ మావులలో జలప్రతీతి 4) ఆకాశంలో నీలవర్ణ ప్రతీతి 5) నీటియందు మనిషికాని చెట్టుకాని తలక్రిందుగా కనపడడం 6) అద్దంలో మరొక్క వస్తువు (పట్టణాదికాలు) కానరావడం, ఈలాంటి దృష్టాంతాలు, ఇవన్నీ మిథ్యా ప్రతీతులు. తనయొక్క అజ్ఞానంతోనే ఆత్మయందు ప్రపంచ ప్రతీతి యేర్పడింది. ఇది మిథ్యామాత్రం. ఈ విధంగా విచారించి ప్రపంచము మిథ్యయని నిశ్చయించుకొనుటే బాధ అంటారు. బాధ అనగా మిథ్యాత్వ

నిశ్చయమన్నమాట. ఈ బాధ శాస్త్రీయమని యౌక్తికము (యుక్తి ద్వారా సిద్ధించినది) అని అపరోక్షమని మూడు విధాలు.

**శిష్యుడు** : ప్రపంచ భ్రాంతులెన్ని విధాలు?

**గురువు** : భ్రాంతి అయిదు విధాలై వుంది. వీటినే పంచభ్రమలనీ అంటారు. (1) భేదభ్రాంతి (2) కర్తృత్వ భోక్తృత్వ భ్రాంతి (3) సంగ భ్రాంతి (4) వికార భ్రాంతి (5) బ్రహ్మాభిన్నమైన జగత్తు సత్యమనే భ్రాంతి అని అయిదు విధాలు.

**1) భేదభ్రాంతి :** 1) జీవేశ్వర భేదం 2) జీవులలో పరస్పర భేదం (3) జడములలో పరస్పర భేదం 4) జీవజడభేదం 5) జడ ఈశ్వర భేదం అని భేదభ్రాంతి అయిదు విధాలు.

2) కర్తృత్వ భోక్తృత్వ భ్రాంతి : అంతఃకరణ ధర్మాలైన కర్తృత్వ భోక్తృత్వాలు ఆత్మయందు తోచుట.

3) సంగభ్రాంతి : దేహాదికాలందు అహంకారము గృహాదికాలయందు మమకారము వీటి సంబంధం ఆత్మయందు తోచుట లేదా, సజాతీయ విజాతీయ స్వగత వస్తువులతోడి సంబంధం ఆత్మయందు ప్రతీతమగుట.

4) వికారభ్రాంతి : పాలకు పెరుగువలె జీవజగత్తులు బ్రహ్మమునకు పరిణామాలని తోచుట.

5) బ్రహ్మాభిన్నమైన జగత్తు సత్యమనే భ్రాంతి : బ్రహ్మాభిన్నమైన జగత్తు అసత్యమైనా కూడా దీనియందు సత్యత్వమును ఆరోపించుట

## ఇవి పంచవిధ భ్రాంతులు

**శిష్యుడు** : ఈ పంచవిధభ్రాంతులను యేదృష్టాంతాలద్వారా నివృత్తి చేయాలె?

**గురువు :** 1) బింబ ప్రతిబింబ దృష్టాంతం ద్వారా భేదభ్రాంతిని నివృత్తి చేసుకోవాలె. (2) స్ఫటిక లోహిత దృష్టాంతంతో (దాసాని పూవురంగు స్ఫటికంలో తోచుట) కర్తృత్వ భోక్తృత్వ భ్రాంతిని నివృత్తి చేసుకోవలె. (3) ఘటాకాశ దృష్టాంతంతో సంగభ్రాంతిని నివృత్తి చేసుకోవాలె (4) రజ్జు సర్పదృష్టాంతంతో వికార భ్రాంతిని నివృత్తి చేసుకోవాలె. (5) కనక కుండల దృష్టాంతంతో జగత్సత్యత్వ భ్రాంతిని నివారించుకోవాలె.

**శిష్యుడు :** ఈ దృష్టాంత దార్ష్టాంతాలను విడివిడిగా వివరించండి?

**గురువు :** విను. భేదభ్రాంతి నివృత్తియందు బింబ ప్రతిబింబ దృష్టాంతము చెప్పబడింది.

అద్దంలో ముఖప్రతిబింబము అగుపడింది. ఆ ప్రతిబింబము నిజానికి అద్దంలో లేదు. అద్దంవైపు ప్రసరించిన నేత్రవృత్తి అద్దాన్ని తాకి ఆగి ముందుకుపోలేక వెనక్కు తిరిగి బింబభూతమైన ముఖాన్ని చూస్తుంది. కాబట్టి ప్రతిబింబము బింబమైన ముఖము కంటె భిన్నంకాదు అభిన్నమే. అందువలన ప్రతిబింబము మిథ్యకాదు; సత్యమే. అయితే బింబానికి భిన్నంగా తోచడం అద్దంలో నిలిచి వుండడం బింబానికి యెడపెడగా వుండడం, ఈ మూడు ప్రతిబింబం యొక్క ధర్మాలు. ఇవి ప్రతీతి మాత్రాలే కాబట్టి భ్రాంతి రూపాలు.

ఈ ధర్మాలను మిథ్యయని నిశ్చయించుటే వాటిని బాధించుట. ఆ విధంగా ఆ ధర్మాలు బాధింపబడినప్పుడు బింబప్రతిబింబాలు ఎప్పుడూ అభేదమేనను నిశ్చయం గల్గుతుంది.

**ఇక దార్ష్టాంతం :** శుద్ధబ్రహ్మము బింబరూపము. అజ్ఞానమను అద్దంలో దాని ప్రతిబింబము జీవరూపముతో భాసించింది. స్వప్నంలోవలె ఒక్కజీవుడు ముఖ్యం. తక్కిన స్థావర జంగమరూప నానా జీవభేదాలు జీవభాసాలు మాత్రం. ఆ జీవరూపమైన ప్రతిబింబం ఈశ్వర రూపమైనబింబంతో సదా అభిన్నమయ్యే వుంది. అయితే,

మాయాబలంతో తోచే జీవధర్మాలు, బింబరూపమైన యీశ్వరునికంటె భిన్నం గాతోచుట, జీవత్వ నానాత్వ అల్పజ్ఞత్వ పరిచ్ఛిన్నత్వాదులు, వాటి ప్రతీతిరూప జ్ఞానము యీ జీవధర్మాలన్ని మొత్తం భ్రాంతి మాత్రం.

అవి మిథ్యలంటూ నిశ్చయించి వాటిని బాధిస్తే జీవరూప ప్రతిబింబము యీశ్వరరూప ప్రతిబింబము రెండు సదా అభేదమేననే నిర్ధారణ కల్గుతుంది. ఈ విధంగా బింబ ప్రతిబింబ దృష్టాంతం ద్వారా భేదభ్రాంతిని నివృత్తి చేయాలె.

2. స్ఫటిక లోహిత దృష్టాంతం ద్వారా కర్తృత్వ భోక్తృత్వ భ్రాంతిని నివారించుకోవాలె.

తేటైన తెల్లని స్ఫటికమణి సమీపంలో ఎఱ్ఱని దాసాని పూవును పెట్టితే దాని సామీప్య సంపర్కంతో స్ఫటికము యెఱ్ఱగా భాసిస్తుంది. కాని ఆ యెరుపు పుష్ప ధర్మం మాత్రం. పుష్పాన్ని స్ఫటికాన్ని వేరువేరు చేస్తే స్ఫటికంలో ఆ యెరుపు లేదు. కాబట్టి అది స్ఫటిక ధర్మం కాదు. భ్రాంతి వల్ల స్ఫటికంలో అగుపడింది.

అట్లే తాదాత్మ్య సంబంధాన్ని బట్టి అంతఃకరణ ధర్మాలైన కర్తృత్వ భోక్తృత్వాలు ఆత్మయందు తోస్తాయి. కాని అవి అంతఃకరణ ధర్మాలు మాత్రం. సుషుప్తియందు ఆత్మకు అంతఃకరణంతో యెడబాటు కలిగే సరికి ఆ కర్తృత్వాది ధర్మాలు ఆత్మలో కానవచ్చుటలేదు. కావున అవి ఆత్మధర్మాలుకావు. కేవలం భ్రాంతివల్ల ఆత్మలో తోస్తున్నాయి. ఈ విధంగా స్ఫటిక లోహిత దృష్టాంతం ద్వారా కర్తృత్వ భోక్తృత్వ భ్రాంతిని నివృత్తి చేసుకోవాలె.

3. ఘటాకాశ దృష్టాంతంతో సంగ భ్రాంతిని నివృత్తి చేసుకోవాలె.

ఘటము ఉపాధిగా వుండే ఆకాశాన్ని అనగా కుండలో కనపడే ఆకాశాన్ని ఘటాకాశ మంటారు. ఆ ఆకాశము (ఆ కుండలోని బయలు) కుండతో సంబంధము కలదానివలె తోచినప్పటికి ఘట ధర్మాలైన ఉత్పత్తి నాశాలు గమనాగమనాలు ఆ ఆకాశానికి సంబంధించవు. ఆకాశము అసంగము. ఆకాశమునకు కుండతో సంబంధము వున్నట్లు తోచుటకూడా భ్రాంతిమాత్రమే, అట్లే

దేహాది సంఘాతము ఉపాధిగాగల ఆత్మను జీవుడంటారు. ఆ అత్మ సంఘాతంతో సంగముగలదానివలె తోస్తుంది. అయినా సంఘాతధర్మాలైన జననమరణాదులు ఆత్మను స్పృశించలేవు. కారణమేమంటే సంఘాతము దృశ్యము. ఆత్మ ద్రష్ట, ఆత్మ సంఘాతానికి వేరై వుంది. కాబట్టి ఆత్మ సంఘాతరూపంకాదు. సంఘాతము తాను కాదు కాబట్టి ఆత్మకు సంఘాతంతో అహంతా రూపసంగంలేదు. ఈ సంఘాతము (సంఘాతమనగా దేహేంద్రియ ప్రాణమనోబుద్ధుల కూటమి) ఆత్మకు సంబంధించింది కాదు; పంచ మహాభూతాలకు సంబంధించింది కాబట్టి ఆత్మకు యీ సంఘాతంతో మమతారూప సంగంలేదు. ఆత్మ సంఘాతానికంటె భిన్నం కాబట్టి ఈ సంఘాతానికి సంబంధించిన పుత్రమిత్ర కళత్ర గేహాలతో ఆత్మకు సంగంలేదు. ఈ విధంగా సంఘాతంతోడి ఆత్మకు అహంతా మమతారూపసంగం లేదు. కాబట్టి ఆత్మ అసంగము.

ఈ ప్రకారంగా ఘటాకాశదృష్టాంతం ద్వారా సంగంభ్రాంతిని నివృత్తి చేసుకోవాలె.

4. వికారభ్రాంతి నివృత్తియందు రజ్జుసర్పదృష్టాంతం చెప్పబడింది.

త్రాడు పడి వుంది; సంధ్య చీకటివేళ. త్రాడును చూచేందుకు కంటిగుండా ప్రసరించిన అంతఃకరణవృత్తి త్రాటివరకు పోయింది. మందాంధకార దోషంతో ఆ అంతఃకరణవృత్తి త్రాడును త్రాడని గ్రహించలేకపోయింది. కాబట్టి ఆ వృత్తి ద్వారా రజ్జువుయొక్క ఆవరణభంగం జరగలేదు ఆ సమయంలో రజ్జు ఉపహిత చైతన్యాన్ని ఆశ్రయించి వుండే తూలావిద్య క్షోభచెంది సర్పరూప వికారాన్ని ధరించింది. ఆ సర్పము అవిద్యయొక్క పరిణామం; రజ్జు ఉపహిత చైతన్యానికి వివర్తమే కాని పరిణామంకాదు.

ఈ ప్రకారంగానే బ్రహ్మచైతన్యాన్ని ఆశ్రయించి వుండే మూలావిద్య ప్రారబ్ధాదుల నిమిత్తంతో క్షోభనుబొంది జడచైతన్యం (చిదాభాస) ప్రపంచరూప వికారాన్ని ధరించింది. ఈ ప్రపంచం అవిద్యయొక్క పరిణామము. అధిష్ఠానబ్రహ్మ చైతన్యమునకు వివర్తము; పరిణామం (వికారం) కాదు.

ఈ విధంగా రజ్జు సర్పదృష్టాంతంతో వికారభ్రాంతిని నివృత్తి చేసుకోవాలె.

తూలావిద్య = ఘటాది విషయ ఉపహిత చైతన్యాన్ని ఆశ్రయించి దాన్ని ఆవరించిన అవిద్య.

మూలావిద్య = శుద్ధ బ్రహ్మరూపమగు ఆత్మను ఆశ్రయించి దానికి ఆవరణ కల్గించే అవిద్య.

క్షోభ = కార్య వ్యాపారమునందు తత్పరమగుట.

పరిణామము = పూర్వరూపాన్ని వదలి వేరొక రూపాన్ని ధరించుట. లేదా ఉపాదానమునకు సమానసత్తా కల అన్యథా స్వరూపము.

అథవా = ఉపాదానముయొక్క అన్యవిధాకారము, ఎట్లనగా.

పాలయొక్క పరిణామము పెరుగు, పాలవలె పెరుగు కూడా సమాన (వ్యవహార) సత్తా కలదియే అయివుంది. కాని పెరుగుయొక్క ఆకారము గుణము పాలకు లేవు. అది పాలకు పరిణామరూపము; వికారరూపము.

అధిష్ఠానము = తాను స్వయంగా నిర్వికార రూపంలోనుండి అవిద్యాకృత కల్పిత కార్యానికి ఆశ్రమమై వుండునది. ఈ అధిష్ఠానము వ్యావహారికమని, పారమార్థికమని రెండు విధాలు. కల్పిత సర్పానికి రజ్జువు వ్యావహారిక అధిష్ఠానము. ఇది పరిణామ ఉపాదానముకంటె విలక్షణము; దీన్ని వివర్త ఉపాదానమని కూడా అంటారు.

**వివర్తము :** అధిష్ఠానమునకంటె విషమసత్తా కలిగిన అన్యము భిన్నమూనైన అన్యధా స్వరూపము. త్రాటికి వివర్తము సర్పము. దాన్ని కల్పిత కార్యమని లేదా కల్పిత విశేషాంశ మని కూడా అంటారు.

5. జగత్సత్యత్వభ్రాంతియందు కనక కుండల దృష్టాంతం చెప్పబడింది.

బంగారం ఆభరణాలకు వుండే భేదము కారణ కార్యముల ననుసరించి తోస్తుంది. ఇది కల్పితం. బంగారం కంటే ఆభరణాలకు భిన్న స్వరూపంలేదు. వాస్తవానికి బంగారుకూ ఆభరణాలకు భిన్నస్వరూపంలేదు. వాస్తవానికి బంగారుకు ఆభరణాలకు అభేదమేవుంది. బంగారుకు భిన్నంగా ఆభరణాలకు సత్తానేలేదు. అట్లే,

బ్రహ్మానికి జగత్తుకు కల భేదం కార్యకారణాలను ఆశ్రయించి తోస్తుంది. కానీ యిది కల్పితమాత్రం. విచారించి చూస్తే అస్తిభాతి ప్రియాలకు భిన్నమైన నామరూప జగత్తుకు ఉనికి లేదు మిథ్య అనియే తేల్తుంది. ఏ వస్తువునందు కల్పితమైవుందో ఆ కల్పిత వస్తువు తన కల్పనకు ఆధారమైవుండే వస్తువుకంటే భిన్నంగా వుండే వీలులేదు. జగత్తు బ్రహ్మముతో ప్రస్తుతః అభేదమైవుంది జగత్తుకు బ్రహ్మముకంటె భిన్నమైన సత్తాలేదు.

ఈ విధమున విచారముతో కనకకుండల దృష్టాంతం ద్వారా బ్రహ్మమునకు భిన్నమైన జగత్తుయొక్క సత్యత్వ భ్రాంతిని నివృత్తి చేసుకోవాలి.

**శిష్యుడు :** భ్రాంతి అనగా యేమి?

**గురువు :** భ్రాంతి అనగా అధ్యాస.

**శిష్యుడు :** అధ్యాస అనగా యేమి?

**గురువు :** భ్రాంతి జ్ఞానానికి విషయమైన మిథ్యావస్తువు భ్రాంతి జ్ఞానముకలసి

అధ్యాస అని చెప్పబడ్తుంది. అధిష్ఠానమునకు విషయమై (వేరై)న సత్తాకల్గిన అవభాసాన్ని అధ్యాస అంటారు. శుక్తిలో రజతభ్రాంతి కల్గింది. అసలు శుక్తికి(ముత్తెపుచిప్ప) వ్యావహారిక సత్తాలోనిది రజతము కల్పితం కాబట్టి ప్రాతిభాసిక సత్తాలోది. అందువల్ల శుక్తి యందుతోచే రజతజ్ఞానము, రజతము రెండు కూడా సిద్ధాంతంలో అవభాసమని అధ్యాసయని చెప్పబడ్తాయి లేదా.

తాను లేనిచోట అధికరణంలో తాను వున్నట్లు తోచుటను "అధ్యాస" అంటారు. స్థాణువులో దొంగవున్నట్లు తోచాడు. అది అధ్యాస, ముత్తెపుచిప్పలో వెండిలేదు. అధికరణమైన శుక్తిలో వెండితోస్తుంది. ఇది అధ్యాస. పాము త్రాటిలో ఆ అధికరణమైన త్రాటిలో పాము తోచింది. ఇది అధ్యాస.

భ్రాంతి కల్గేందుకు ఆశ్రయమైన వస్తువు అధిష్ఠాన (అధికరణ)మంటారు. అది వ్యావహారిక సత్తాకలదిగాను వుండొచ్చు. పారమార్థికసత్తా కలదిగాను వుండొచ్చు. భ్రాంతివలన కల్పింపబడిన వస్తువును "ఆరోప్య" మంటారు.

**శిష్యుడు :** ఈ అధ్యాస యెన్ని రకాలు?

**గురువు :** స్వరూపాధ్యాసయని సంసర్గాధ్యాసయని అధ్యాస రెండు విధాలు. లేదా– జ్ఞానాధ్యాసయని అర్థాధ్యాసయని రెండు విధాలు.

**శిష్యుడు :** ఈ అధ్యాసను గురించిన విచారాన్ని సుబోధంగా చెప్పండి.

## స్వరూపాధ్యాస

**గురువు :** అనాత్మయొక్క స్వరూపము ఆత్మయందు అధ్యాస చేయబడ్తుంది.

లేదా పదార్థముయొక్క స్వరూపము అనిర్వచనీయమై యేర్పడ్తుంది. అట్టి సందర్భాన్ని స్వరూపాధ్యాసమంటారు.

1. 'నేను అజ్ఞాని' ఈ విధంగా అజ్ఞానము శుద్ధ చేతనంలో అధ్యాస చేయబడింది.

2. 'నేనున్నాను' ఈ విధంగా అహంకారము (అంతఃకరణము) అజ్ఞానోపహిత చేతనంలో అధ్యాస చేయబడింది.

3. 'నేను సుఖిని - దుఃఖిని - కర్తను - భోక్తను.' అని ఈ విధంగా అంతఃకరణ ధర్మాలు అంతఃకరణ ఉపహిత చేతనంలో అధ్యాస చేయబడ్డాయి.

4. నేను గ్రుడ్డివాన్ని; మూగవాన్ని; చెవిటివాన్ని; నేను వింటున్నాను కంటూన్నాను అంటున్నాను.' అని యీ విధంగా యింద్రియ ధర్మాలు అంతఃకరణ ఉపహిత చేతనంలో అధ్యాస చేయబడ్తున్నాయి.

5. 'నేను మనుష్యున్ని; బాలకున్ని; యువకున్ని; ముసలివాన్ని; బ్రాహ్మణున్ని' అంటూ దేహమును దేహధర్మాలను అంతఃకరణ యింద్రియ ధర్మాల ఉపహిత చేతనంలో అధ్యసిస్తూన్నారు.

6. "నేను లావుగా వున్నాను, సన్నగా వున్నావు, ఎర్రటివాన్ని, నల్లటివాన్ని" అంటూ దేహధర్మాలను దేహోపహిత చేతనంలో అధ్యాసము చేస్తున్నారు.

ఇంద్రియాలలోని దేహంకాని స్వరూపంతో కూటస్థునియందు అధ్యసింపబడలేవు. అవి బ్రహ్మచేతనంలో అధ్యసింపబడినాయి. కానీ యింద్రియ ధర్మాలు దేహధర్మాలు కూటస్థునికి, అభేదంగా తోస్తాయి.

"నేను కన్ను, నేను దేహము" అంటూ కేవలం దేహము యింద్రియాల అభేద ప్రతీతి కూటస్థునికి కల్గదు.

పైన 1 నుండి 6వ నెంబరు దృష్టాంతము వరకు చెప్పినట్లు అజ్ఞానాదులు చైతన్యంలో అధ్యాస చేయబడినాయి. ఆయా పదార్థాల స్వరూపం అనిర్వచనీయమై యేర్పడింది. కావున ఆ మొత్తము స్వరూపాధ్యాసలోనిది.

(సత్తుకాక అసత్తుకాక ఆ రెంటికి విలక్షణమైనదాన్ని అనిర్వచనీయమంటారు. త్రాటిలో సర్పం తోచింది. ఆ సర్పము సత్యమే అయితే రజ్జు జ్ఞానంతో తొలగిపోరాదు. కానీ తొలగిపోతుంది. కాబట్టి ఆ సర్పము సత్తుకాదు. సత్తుకు విలక్షణము. అది సత్తయితే వంధ్యాపుత్రునివలె ప్రతీతి కారాదు. ప్రతీతి అవుతుంది. కాబట్టి అసుత్తుకాదు. అసత్తుకు విలక్షణం. ఈ విధంగా సత్తుకు అసత్తుకు విలక్షణమైనదాన్ని అనిర్వచనీయమంటారు

ఇంతవరకూ చెప్పి యీ స్వరూపాధ్యాసలో కేవల ధర్మాధ్యాసము ధర్మసహిత ధర్మియొక్క

అధ్యాసము అన్యతరాధ్యాసము, ఈ మూడు అంతర్భూతమై వున్నాయి వెనుక చెప్పివున్న పంచ విధభ్రాంతులలో ఒక్క సంగభ్రాంతి తప్పతక్కిన నాల్గు భ్రాంతులు అనగా భేద భ్రాంతి కర్తృత్వ బోక్తృత్వ భ్రాంతి వికారభ్రాంతి జగత్సత్యత్వభ్రాంతి అనే యీ నాల్గు భ్రాంతులు ఈ స్వరూపాధ్యాసలోనికి వచ్చేశాయి. సంగభ్రాంతి యిక చెప్పబోయే సంసర్గాధ్యాసలోనికి వస్తుంది.

పదార్థము మొదట్లో సిద్ధమైవుండాలె. అది వ్యావహారిక కానీ పారమార్థిక పదార్థం కానీగాక. దానితో అనిర్వచనీయ సంబంధం యేర్పడితే సంసర్గాధ్యాస అంటారు.

ఆత్మయొక్క స్వరూపము సత్యము. అది అధ్యస్తం కాదు. దాని సంసర్గము అనాత్మయందు అధ్యస్తమైతుంది. దాన్నే సంసర్గాధ్యాస అంటారు.

1) ముఖానికి అద్దంతో యెట్టి సంబంధములేదు. రెండు పదార్థాలు (ముఖము - అద్దము) వ్యావహారికాలే. అద్దంలో ముఖానికి సంబంధం వున్నట్లు తోస్తుంది. అక్కడ అనిర్వచనీయ సంబంధం యేర్పడింది.

అట్లే ఎఱ్ఱరంగుగల గుడ్డను 'యెఱ్ఱగుడ్డ' (రక్తః పటః) అంటాము. అది ఎఱ్ఱరంగు కల్గిన గుడ్డకాని ఎఱ్ఱగుడ్డకాదు. ఎఱ్ఱగుడ్డ అని తోచింది. ఎఱ్ఱరంగుతో గుడ్డకు తాదాత్మ్య సంబంధం తోచింది. తోచిందేకాని నిజంగా తాదాత్మ్య సంబంధంలేదు ఎఱ్ఱరంగు కుసుంబా పుష్పానికి చెందింది. ఎరుపుకు కుసుంబాపుష్పానికి తాదాత్మ్య సంబంధం వుంది. గుడ్డకులేదు. ఎఱ్ఱరంగుకల్గిన కుసుంబాపుష్పం కాని గుడ్డకాని రెండు వ్యావహారికాలే. వాటికి తాదాత్మ్య సంబంధం అనిర్వచనీయమై యేర్పడింది.

2) ఎఱ్ఱటి స్ఫటికము అంటాము. స్ఫటికము తెల్లనిది. ఎరుపుతో తాదాత్మ్య సంబంధం స్ఫటికంలో తోచింది. ఎరుపుయొక్క తాదాత్మ్య సంబంధం పైన చెప్పినట్లు పుష్పానికి కాని స్ఫటికానికి కాదు. అయినా అనిర్వచనీయ తాదాత్మ్య సంబంధం ప్రతీతమైంది.

ఈ విధంగా అనేక స్థలాలలో సంబంధి వస్తువు వ్యవహారికంగా వుంటుంది. దాని సంబంధ జ్ఞానము అనిర్వచనీయమై ఉద్భవిస్తుంది. దీన్నే సంసర్గాధ్యాస అని సంబంధా ధ్యాస అని అంటారు.

ఆ విధంగానే చేతనానికి అహంకారంలో అధ్యాసలేదు. ఆ చేతనము పారమార్థిక మైంది. కాని చేతనము యొక్క సంబంధం అహంకారంలో అధ్యాస పొందింది. ఆత్మత్వం చేతనంలో వుంది. కాని అహంకారంలో ప్రతీతమైతుంది. ఆత్మయొక్క తాదాత్మ్యం చేతనానాకి సంబంధించిందైనా కూడా అహంకారంలో ప్రతీతమైతుంది. అహంకారం తోచే ఆత్మ చేతనముయొక్క తాదాత్మ్య సంబంధము అనిర్వచనీయమైన సంబంధం. చేతనం కల్పితం కాదు. కాని చేతనానికి అహంకారానికి ఉండే సంబంధం కల్పితమైంది.

ఈ ప్రకారంగా అహంకారాదికాలైన అనాత్మలయందు చేతనాత్మయొక్క అధ్యాస సంభవించింది. ఆత్మకు అనాత్మతో యేర్పడిన ఈ తాదాత్మ్య సంబంధం అధ్యస్తమైంది అనగా కల్పితమైంది. ఇది ఆత్మకు స్వరూపం కాదు. ఇది ఆత్మకు అనాత్మయందు యేర్పడిన కేవల సంబంధా ధ్యాసము; దీనినే సంసార్గధ్యాస అని అంటారు.

## జ్ఞానాధ్యాసము అర్థాధ్యాసము

జ్ఞాన + అధ్యాసము = జ్ఞానాధ్యాసము, అనిర్వచనీయ వస్తువుయొక్క ప్రతీతిని లేదా భ్రాంతి జ్ఞానాన్ని జ్ఞానాధ్యాస అంటారు. రజ్జులో సర్పప్రతీతి స్థాణువులో చోరప్రతీతి శుక్తిలో రజత ప్రతీతి ఈ మొదలగునవి జ్ఞానాధ్యాసకు దృష్టాంతాలు.

అర్థం + అధ్యాస = అర్థాధ్యాస. అర్థము = విషయము; పదార్థము. జ్ఞానము యొక్క అనిర్వచనీయ విషయాన్ని లేదా మిథ్యా వస్తువును అర్థాధ్యాస అంటారు. పైన చెప్పిన సర్పము చోరుడు రజతము మొదలైనవి అర్థములు అనగా విషయ పదార్థాలు.

## అర్థాధ్యాస ఆరు విధాలు

1) కేవల సంబంధా ధ్యాస (సంసర్గాధ్యాస) 2) సంబంధ సహిత సంబంధియొక్క అధ్యాస, 3) కేవల ధర్మాధ్యాస. 4) ధర్మసహిత ధర్మియొక్క అధ్యాస. 5) అన్యోన్యాధ్యాస. 6) అన్యతరాధ్యాస – అని వాటి పేర్లు.

భ్రమజ్ఞానముదయించే అన్ని సందర్భాలలోను అనిర్వచనీయ పదార్థం ఉద్భూతమైంది.

కొన్నిచోట్ల సంబంధి వస్తువుయొక్క ఉత్పత్తి కల్గి దాని అధ్యాస యేర్పడ్తుంది. శుక్తియందు రజతము త్రాడునందు పాము వగైరా. శుక్తియందు రజతముయొక్క

అధ్యాసను అర్థాధ్యాస అంటారు. ఆ రజత ప్రతీతిని జ్ఞానాధ్యాస అంటారు.

1) కేవల సంబంధాధ్యాస = అనాత్మయందు ఆత్మకు కేవల సంబంధాధ్యాసే యేర్పడుతుంది. ఎట్లనగా అనాత్మలైన అహంకారాది కాలలో ఆత్మకు అధ్యాస కల్గింది.

కొన్నిచోట్ల ధర్మముయొక్క సంబంధానికి అధ్యాస సంభవిస్తుంది.

2) సంబంధసహిత సంబంధియొక్క అధ్యాస = "నేను అజ్ఞానిని" అంటూ శుద్ధ చేతనమునందు అనాత్మయైన అజ్ఞానముయొక్క సంబంధము దాని స్వరూపము రెండు అధ్యస్తమై వున్నాయి.

3) కేవల ధర్మాధ్యాసము = జ్ఞాన స్వరూపము ఆత్మ అంతఃకరణము కాదు. జ్ఞానము యొక్క సంబంధము అంతఃకరణంలో వున్నటు తోస్తుంది. ఆత్మయొక్క సంబంధానికి అంతఃకరణంలో అధ్యాస యేర్పడింది.

**'ఘటః స్ఫురతి – పట ః స్ఫురతి'** ఘటము స్ఫురిస్తుంది. పటము స్ఫురిస్తుంది. అనే మాటలలో ఆత్మకు చెందిన స్ఫురణత్వము అన్ని పదార్థాలకు సంబంధించి ప్రతీతమౌతుంది. ఈ విధంగా ఆత్మ సంబంధమునకు అన్ని పదార్థాలలో అధ్యాస యేర్పడింది.

అట్లే గ్రుడ్డితనము, చెవిటితనము, మూగతనము మొదలైన యింద్రియ ధర్మాలు ఆత్మయందు ప్రతీతమౌతాయి. కాబట్టి నేను గ్రుడ్డివాడను మూగవాన్ని అంటున్నాడు. నేను కన్ను అని యెవడు అనడు. నేను గ్రుడ్డివాన్ని అని అంటాడు ఇక్కడ ధర్మ అధ్యాసలేదు. ధర్మాధ్యాసేకల్గింది. కంటి ధర్మమైన గ్రుడ్డితనం ఆత్మయందు అధ్యాస చేయబడింది. ఇది కేవల ధర్మాధ్యాసకు దృష్టాంతము.

4) ధర్మసహిత ధర్మియొక్క అధ్యాస = కర్తృత్వ భోక్తృత్వాదులను ధర్మము అంటారు. అవి అంతఃకరణము యొక్క ధర్మాలు. కాబట్టి అంతఃకరణాన్ని ధర్మి అంటారు.

"నేను యజ్ఞ దాన తపస్సులను చేస్తున్నాను. వీటిద్వారా స్వర్గానికి వెళ్ళి అక్కడ భోగాలను అనుభవిస్తాను" అని తలుస్తాడు. వెళ్లుట భోగాల ననుభవించుట ఈ ధర్మాలు అంతఃకరణానివి ఈ చోట అంతఃకరణ దాని ధర్మములు చేతనమైన ఆత్మయందు

(నేను యందు) అధ్యాస చేయబడ్డాయి.

5) అన్యోన్యాధ్యాస = ఇనుముకు అగ్నికివలె ఆత్మయందు అనాత్మకు అనాత్మయందు అత్మకు కలిగే అధ్యాసే యిది.

6) అన్యతరాధ్యాస = రెంటిలో ఏ ఒక్కదానికో కలిగే అధ్యాసయిది. ఆత్మయందు అనాత్మకో అనాత్మయందు ఆత్మకో కలిగే అధ్యాస యిది. అనాత్మయందు ఆత్మయొక్క స్వరూపాధ్యాస కల్గదు. కాని ఆత్మయందు అనాత్మ యొక్క స్వరూపం అధ్యాస చేయబడ్తుంది.

అహంకారాదికాలైనా అనాత్మలకు ఆత్మకు యేర్పడే అధ్యాసను తెలియుటకు అయిదవదగు అన్యోన్యాధ్యాస విశేషంగా ఉపయోగిస్తుంది. ఈ అధ్యాసం సర్గాధ్యాస స్వరూప ధ్యాసలలో రెంటిలో చేరివుంది.

**శిష్యుడు :** అన్యోన్యాధ్యాస అనగా యేమి?

**గురువు :** పరస్పరంలో పరస్పరము యొక్క ఆధ్యాస కల్గుట.

**శిష్యుడు :** ఆత్మ అనాత్మలకు పరస్పరధ్యాస యెలాకల్గింది?

**గురువు :** సత్తు చిత్తు ఆనందము అద్వైతము యీ నాల్గు విశేషణాలు ఆత్మవి. అసత్తు, జడము, దుఃఖము, ద్వైతము యీ నాల్గు విశేషణాలు అనాత్మవి. వీటిలో

అనాత్మ ధర్మాలైన దుఃఖము ద్వైతము, ఆత్మధర్మాలైన ఆనందము అద్వైతము అనువాటిలో స్వరూపంతో అధ్యాసబొంది వాటిని కప్పివేశాయి. అట్లే

ఆత్మ ధర్మాలైన సత్తు చిత్తులు అనాత్మ ధర్మాలైన అసత్తు జడములలో సంసర్గంద్వారా అధ్యాస బొంది వాటిని కప్పివేశాయి.

ఆత్మ ధర్మాలైన ఆనంద అద్వైతాలు అనాత్మ ధర్మాలైన దుఃఖద్వైతాలతో ఆవరింప బడడంచేత "నేను ఆనందరూపున్ని; అద్వైత రూపున్ని" అని తోచుటలేదు. నేను దుః ఖిని; పరిచ్ఛిన్నున్ని" అని తోస్తుంది. ఆత్మ ధర్మాలైన సత్తు చిత్తులు అనాత్మ ధర్మాలైన అసత్తు జడాలను ఆవరించడంతో అహంకారాదికాలగు అనాత్మలు అసత్తులుగా

జడాలుగా తోచుటలేదు. "ఉన్నవి; ప్రకాశిస్తున్నవి" అంటూ వ్యవహారంలో ప్రతీత మైతున్నాయి. ఈ ప్రకారంగా ఆత్మానాత్మల అన్యోన్యా (పరస్పరా) ధ్యాస యేర్పడింది.

వేదాంత గోష్ఠిలో ప్రపంచమిథ్యా నిరూపణమనే
పదమూడవవ ఘట్టం ముగిసింది

### ధ్యానం నాలుగు విధములు

1. శబ్దావలంబనధ్యానం - అంటే "అహం బ్రహ్మాస్మి అద్వితయోహం" అనుకునే ధ్యానం. శబ్దం పలుకుతారు.

2. అర్థావలంబన ధ్యానం - బ్రహ్మ చింతన తప్ప శబ్దోచ్చారణ ఉండదు.

3. ఉభయావలంబన ధ్యానం - శబ్దోచ్చారణతోపాటు శబ్దార్థంను కూడ ధ్యానం చేస్తుంటారు.

4. అనుభవాలంబన ధ్యానం-శబ్ద-చింతన, అర్థ చింతన రెండు ఉండని స్థితి.

### వ్రతములు

**కృచ్ఛ్రవ్రతం**

కృచ్ఛ్రవ్రతం అనగా - మూడు దినములు ప్రొద్దున కుక్కుటాండ పరిమాణం గల 26 అన్న కబలమును భుజించి, తర్వాత మూడు రోజులు సాయంకాలమున 32 కబలములను భుజించి, తదనంతరం మూడు దినములు అయాచితముగా లభించిన 24 కబలములను తిని, మరల మూడు దినములు శుష్కోపవాసం చేయుట.

### చాంద్రాయణ వ్రతం

చాంద్రాయణవ్రతం అనగా - శుక్లపక్ష ప్రతిపత్తు నుండి మొదలిడి మయూరాండ ప్రమాణమగు ఒక్కొక్క కబళంను హెచ్చించుచు, పూర్ణిమనాడు పదిహేను కబలములను భుజించి, కృష్ణపక్ష పాడ్యమి నుండి ఒక్కొక్క కబళంను తగ్గించుచు, అమావాస్యనాడు శుష్కోపవాసం చేయుట.

### సాంతనవ్రతం

మొదటిరోజు ఎనిమిది మాషముల యెత్తు ఎర్రని ఆవు పంచితం, 16 మాషముల యెత్తు తెల్ల ఆవు గోమయం, 12 మాషముల యెత్తు బంగారు చాయగల ఆవుపాలు. 10 మాషములుయెత్తు నల్లని ఆవునేయి, వీటన్నింటి పరిమాణంలో కుశజలం (పంచగవ్యం)ను కలిపి త్రాగవలయును. మరుసటి రోజు ఉపవాసం చేయవలయును.



# వేదాంత గోష్ఠి

## పదునాల్గవ ఘట్టం
## (జ్ఞానియొక్క కర్మనివృత్తి నిరూపణ)

**శిష్యుడు :** కర్మ అంటే యేమి?

**గురువు :** శరీరంతో వాక్కుతో మనస్సుతో చేయబడే క్రియను కర్మ అంటారు.

**శిస్యుడు :** అది యెన్ని విధాలు?

**గురువు :** సంచితము, ప్రారబ్ధము, ఆగామి అని కర్మలు మూడు విధాలు.

**శిష్యుడు :** సంచితకర్మ అంటే యేమి?

**గురువు :** అనేక అతీత జన్మలలో కూడబెట్టిన కర్మను సంచిత కర్మ అంటారు.

**శిష్యుడు :** ప్రారబ్ధకర్మయొక్క స్వరూపం యేమి?

**గురువు :** సంచితములైన అనేక కర్మలలో నుండి పరిపాక దశకు వచ్చి ఈశ్వరుని సంకల్పబలంతో వర్తమాన దేహానికి ప్రారంభరూపమై ఉన్న కర్మను ప్రారబ్ధ కర్మమంటారు. ఈ దేహంలో కలిగే సుఖదుఃఖాలకు అది నిమిత్తమై వుంది.

**శిష్యుడు :** ఆగామి కర్మ అంటే యేమి?

**గురువు :** జ్ఞానం కల్గిన తర్వాత కాని ముందుకాని యీ దేహంతో మరణపర్యంతం చేసే కర్మలను ఆగామి (క్రియమాణ) కర్మలు అంటారు.

**శిష్యుడు :** జ్ఞానికి కర్మలతో నివృత్తి యెలాగా సిద్ధిస్తుంది.

**గురువు :** జ్ఞానమువల్ల అజ్ఞానము యొక్క ఆవరణాంశము తొలగుతుంది. ఆవరణ

నివృత్తి కలిగేసరికి దాన్ని ఆశ్రయించి వుండే సంచిత కర్మ నశిస్తుంది. (సంచిత కర్మము అజ్ఞానము యొక్క ఆవరణాంశాన్ని ఆశ్రయించి వుంటుంది).

జ్ఞానం కల్గిన తర్వాత కాని ముందు కాని యీ జన్మలో చేసిన (ఆగామి) కర్మలు "నేను అకర్తను; అభోక్తను; అసంగుణ్ణి; బ్రహ్మమును" అని నిశ్చయించిన జ్ఞానబలంతోనూ భ్రమజన్య తాదాత్మ్యనాశంవల్లను రాగద్వేషాదుల అభావంవల్లను తామరాకుపై నీటివలె జ్ఞానిని స్పృశింపలేవు.

అయితే ఆ కర్మలు అనగా జ్ఞానిచేసే క్రియమాణ కర్మలు వాటి ఫలాలు యేమైతాయి? ఎవరికి చెందుతాయి? అనే శంకకు జవాబిస్తున్నాడు.

**శ్లో॥ ప్రారబ్ధం భోగతో నశ్యేత్ - శేషం జ్ఞానేనదహ్యతే।**
**శారీరం త్వితరత్కర్మ - తద్వేషప్రియ వాదినోః॥**

జ్ఞాని యీ జన్మలో చేసిన శుభ (ఆగామి) కర్మయొక్క ఫలము సుహృత్తులకు సకామ భక్తులకు శిష్యులకు చెందుతుంది. అశుభకర్మల యొక్క ఫలం ద్వేషించిన వారికి నిందించిన వారికి చేర్తుంది.

అజ్ఞానముయొక్క విక్షేపసక్తిని ఆశ్రయించి వుండునదియు పూర్వమొకానొక జన్మలో కానీ అనేక జన్మాలలో కాని చేయబడి నట్టిదియు యీ దేహానికి ప్రారంభక సామగ్రిగా వుండునట్టిదియు అయిన జ్ఞాని యొక్క ప్రారబ్ధకర్మ అనుభవ (భోగ)ము ద్వారా నివృత్తి పొందుతుంది.

కావున జ్ఞాని సర్వకర్మల నుండి ఈ విధంగా విముక్తి పొందుతాడు. కర్మరచితమైన జనన మరణ సంసార బంధం నుండి విముక్తుడౌతాడు. ఇది జ్ఞానియొక్క కర్మ నివృత్తి పద్ధతి.

వేదాంతగోష్ఠిలో జ్ఞానియొక్క కర్మనివృత్తి
నిరూపణమనే పదునాల్గవ
ఘట్టం ముగిసింది.



# వేదాంత గోష్ఠి

## పదునైదవ ఘట్టం

## (జ్ఞానభూమికలు అజ్ఞానభూమికలు)

**శిష్యుడు :** జ్ఞానులందరి అభిప్రాయం ఒకటే అయినప్పుడు వారిలో కనబడే స్థితి భేదం యెందుకు కల్గుతుంది?

**గురువు :** జ్ఞాన భూమికల భేదాన్ని బట్టి వారికాస్థితి భేదం కలిగింది.

**శిష్యుడు :** జ్ఞానభూమికలు యెన్ని? అవి యేవి?

**గురువు :** అవి యేడు, (1) శుభేచ్ఛ, (2) విచారణ, (3) తను మానస, (4) సత్త్వాపత్తి, (5) అసంసక్తి, (6) పదార్థభావిని (7) తుర్యగ అని వాటి పేర్లు.

(మహాత్మా అనాథ దాసుగారు విచారమాల అనే తమ గ్రంథంలో యీ జ్ఞానభూమికలను గురించి క్రింది విధంగా వర్ణించారు).

**దోహా॥ విషయవిషే భ ఈద్వేషతా – గురుతీరథ అనురాగ్**
**తాతైః శుభ ఇచ్ఛాకహీ – కథాశ్రవణ మనలాగ్॥**

**అర్థము :** "విషయాలు అనిత్యాలు సాతిశయ దోషవంతాలు స్పర్శమాత్రంతో దుఃఖం కల్గించేవి" అని తెలిసి వాటియందు త్యాగబుద్ధి కలిగి గురువులయందు ప్రీతి తీర్థాటనంలో అనురాగం పారమార్థిక కథలపై ఆసక్తి కలిగి వుండటాన్ని శుభేచ్ఛ అంటారు. జ్ఞానభూమికలలో యిది మొదటిది.

**దోహా॥ భగవతి రతి గతి అసమతి ప్రేమయుక్త నితచిత్త ।**
**గుణగావత పులకిత హృదయ దినదిన సరస సుహిత్త॥**

**అర్థము :** భగవంతునిపై ప్రీతి, భగవంతుని జ్ఞానంతో మోక్షం కల్గుతుందనే నిశ్చయం,

భగవదాసక్తమైన చిత్తం అన్యాసక్తం కాకుండుట; భగవద్గుణగానంతో తమ మనస్సు పులకరించడం, ఉత్తమ గుణాలు నానాటికి వృద్ధిబొందుట ఇవి శుభేచ్ఛా భూమికకు చిహ్నాలు.

**దోహా॥ దూజీ కహీవిచారణా ఉపజ్యోతత్త్వ విచార।**
**ఏకాంత హైవ్యాశోధనలగ్యోకోహం కో సంసార॥**

**అర్థము :** ప్రపంచంలో సత్యమేది? అసత్యమేది? అనే జిజ్ఞాసతో ఏకాంతవాసం చేస్తూ "నేనెవరు? ఈ జగత్తు యొక్క స్వరూపమేమి?" అనే విచారంలో కాలం గడుపుట విచారణ అనే రెండవ భూమిక.

**దోహా॥ తను మానసాసు తీసరీ మనకో ప్రత్యాహార్।**
**స్థిరహై శుద్ధ స్వరూపకో రాఖై నిత సంభార్॥**

**అర్థము :** బైటి లోపలి విషయాల నుండి చిత్తాన్ని నిరోధించి తన స్వరూపమై వుండే పరబ్రహ్మమును నిరంతరం స్మరిస్తూండుట తను మానస అనే మూడో భూమిక. తను మానస అనగా సూక్ష్మస్థితిని బొందిన మనస్సని అర్థము.

**దోహా॥ చతుర్థీ సత్త్వాపత్తి యహ అనుభవ ఉదయ అభంగ।**
**ఆత్మాజగ దరస్యోభవై జోం మధ్యసింధు తరంగ॥**

**అర్థము :** నిరంతరం బ్రహ్మ చింతనం చేయడంతో సంశయ విపర్యయాలు తొలగి స్వరూప సాక్షాత్కారానుభవనం సిద్ధిస్తుంది. తద్వారా **"సముద్రమధ్యంలోని తరంగం సముద్ర రూపమే"** అయివున్నట్లు యీ జగత్తు ఆత్మ అనే సముద్రంలో అల ఇది ఆత్మరూపమే కాని భిన్నంకాదు. అనే ఆరూఢ జ్ఞానం కల్గుతుంది. ఈ భూమికను సత్త్వాపత్తి అంటారు. ఇది నాల్గో భూమిక.

**దోహా॥ ఛూట్యౌ తన అభిమానజబ – నిశ్చయ కియోస్వరూప।**
**అసంసక్తి యహభూమికా – పంచమ మహా అనూప ॥**

**అర్థము :** స్వరూప నిశ్చయం కల్గడంతో దేహాభిమానం గళితమైపోయి (తన్ను శరీరానికంటె భిన్నంగా యెరిగి)న నిరూపయోగస్థితియే అసంసక్తి అనే అయిదవ భూమిక.

**దోహా॥ కహే పదార్థ బుద్ధి లౌం సబకోహోఇ అభావ ।**
**యహపదార్థాభావినీ షష్ఠీభూమిలఖావ్**

**అర్థము :** గొలుసులు, కడియాలు కమ్మలు ఉంగరాలు మొదలైన ఆభరణాలు యెన్ని వున్నా వస్తుస్వరూపం తెలిసిన వానికి అంతటా బంగారే ప్రతీతమైనట్లు దేహం మొదలు కొని బుద్ధివరకు తోచే పదార్థాలన్ని ప్రతీతిమాత్రాలే కాని వస్తుతః లేనివేనని అవన్ని అధిష్ఠానమైన బ్రహ్మరూపంతో యే అవస్థతో అయితే గోచరిస్తాయో ఆస్థితిని పదార్థా భావిని అంటారు. ఇది ఆరోభూమిక.

**దోహా॥ భావాభావ నతహాఁ కఛు సప్తమ తురీయామాఁహి**
**మైంతూ తహాఁన సభవై కహా ఆహై కహనాహి॥**

**అర్థము :** నేను (ప్రమాత) నీవు (ప్రమేయం) అనే ఈ రెంటితో సిద్ధించే ప్రమాణం కలిసి (త్రిపుటి) ద్వైతం నాల్గవ అయిదవ భూమికలతో వుంటుంది. ఆరవ భూమికలో వుండదు. ఆ (వుండుట లేకపోవుట) భావాభావాలు లేని భూమికనే తురీయమంటారు. ఇది జ్ఞాన భూమికలలో యేడవది.

భావాభావ పదార్థానికి భిన్నమైన వస్తువేదైనా వుంటుందా? వుండదా? "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" మనస్సుతో కూడా సర్వేంద్రియాలు దేన్ని పొందలేక వెనక్కు మళ్ళుతాయో ఆ "అవ్యాచ" వస్తువే అది.

(ఈ జ్ఞాన భూమికలను గురించి పూజ్యపాద శ్రీనిత్యానంద ప్రకాశానందస్వాముల వారి సంభాషణలో క్రిందివిధంగా చెప్పబడింది.

1. శుభేచ్ఛ – నే నింతకాలం మూఢత్వంలో పడి జీవితాన్ని వృథా చేసుకొన్నాను. జరిగిందేదో జరిగింది. లేచినప్పటినుండే తెల్లవారిందనుకోవాలె; మరచిన చోటినుండే మళ్ళీ లెక్క పెట్టాలె. ఆ విధంగా యిప్పటి నుండి అయినా నా ఆత్మ కల్యాణానికి పాటుపడ్తాను. శ్రోత్రియ బ్రహ్మ నిష్ఠుడైన సద్గురుని ఆశ్రయించి మోక్షశాస్త్రాలను అభ్యసిస్తాను. వారు బోధించిన ప్రకారం ఆత్మవిచారం చేస్తాను". అని యీ విధంగా సాధన చతుష్టయ సంపత్తి కల్గిన అధికారికి కల్గెడి యిచ్ఛయే "శుభేచ్ఛ" అని చెప్పబడ్తుంది.

తాత్పర్యమేమంటే : నిషిద్ధకర్మలను పరిత్యాగంచేసి ఫలాభి సంధిరహితంగా విహితకర్మల నాచరిస్తూ చిత్తశుద్ధిని సంపాదించి వివేకము వైరాగ్యము శమాదిషట్క

సంపత్తి ముముక్షుత్వమనే నాల్గు సాధనాలను సమకూర్చుకొని వేదాంతశాస్త్రాలను శ్రవణం చేసి ఆత్మ సాక్షాత్కారం పొందాలనే ఉత్కటమైన యిచ్ఛనే శుభేచ్ఛ అంటారు.

2. తీవ్ర వైరాగ్యంతో కూడి నియమ నిష్ఠలతో వేదాంత శాస్త్రాలను శ్రవణం మననం చేస్తూ శ్రద్ధాయుక్తుడై గురుసేవ నాచరిస్తూ ఏకాంతవాసము హితమితాశనము నవలభించి గురూపదిష్ట వాక్యాలను మోక్ష శాస్త్రాలను పునః పునః విచారించుటే(ను) "విచారణ" అని రెండవ భూమిక.

3. పై రెండు భూమికలతో కూడి శబ్దాది విషయాలలో ఆసక్తిలేక శ్రవణ మనన నిదిధ్యాసల నవలంబించి సవికల్ప సమాధిబలంతో బుద్ధికి తనుత్వం – అనగా – సూక్ష్మత్వం కల్గినప్పుడు "తనుమానస" అనే మూడవభూమిక సిద్ధించినట్లు.

4. పూర్వోక్తమైన మూడు భూమికలు నభ్యసించినపుడు బాహ్యా పదార్థాలకు సంబంధించిన రాగ సంస్కారం నిర్మూలం కాగలదు. మనస్సు విషయ వాసన నుండి విరక్తం కాగలదు. మాయకూ దాని కార్యాలకు అతీతమైన శుద్ధ సన్మాత్రచిన్మాత్ర ఆనంద ఘనమైన ఆత్మయందు త్రిపుటి లయించి (నిర్వికల్ప సమాధిరూప) సాక్షాత్కార పర్యంతమైన స్థితికల్గినపుడు "సత్త్వాపత్తి" అంటారు. ఇది నాల్గో భూమిక. ఈ నాల్గవ భూమికకు చెందిన జ్ఞానిని బ్రహ్మ విదుడంటారు.

5. పై నాల్గు భూమికల నభ్యసించిన బలంతో బాహ్యాభ్యంతర వస్తువులయొక్క రూపములు కాని సంస్కారములు కాని చిత్తమునకు అంటుకోక సమాధి పరిపాక ఫలప్రభావంతో చిత్తం బ్రహ్మాత్మభావనా స్థితమైవుండుటే "అసంసక్తి" అనే అయిదవ భూమిక. ఈ భూమికలో అవిద్యయొక్క దాని కార్యాల యొక్క సంబంధం వుండదు కాబట్టి దీని పేరు "అసంశక్తి" అని చెప్పబడింది. ఈ భూమికకు చేరిన జ్ఞానిని బ్రహ్మ విద్వరుడంటారు.

6) ఆరవ భూమిక పదార్థభావిని పైన చెప్పిన అయిదు భూమికల నభ్యసించి స్వాత్మారామ పరాయణుడైన వానికి భాహ్యాభ్యంతర పదార్థాల ప్రతీతి నశిస్తుంది. కావుననే ఈ భూమికను "పదార్థాభావిని" అన్నారు. ఇట్టివానికి స్వయంగా పదార్థాల భావన (ప్రతీతి) లేకున్నా యితరుల ప్రేరేపణతో కల్గుతూంటుంది. తద్ద్వారా శరీర నిర్వహణ జరుగుతుంటుంది. ఈ భూమిక కలవానిని బ్రహ్మావిద్వరీయుడంటారు.

7) ఏడవ భూమికను తుర్యగ అని తురీయమని అంటారు. పూర్వోక్తాలైన భూమికలను చిరకాలం అభ్యసించడంతో అట్టి వానికి భేదప్రతీతి బొత్తిగా వుండదు. అవస్థాత్రయాతీతమైన ఆత్మ బ్రహ్మరూపమే అనెడి జ్ఞానం అఖండితంగా వుంటుంది. ఈ భూమిక యందలి జ్ఞాని బ్రహ్మవిద్వరిష్ఠుడు.

ఈ తురీయావస్థ జీవన్ముక్తుని పరాకాష్ఠస్థితి. ఇక తురీయాతీతము బ్రహ్మమే ఇది విదేహముక్తికి చెందిన మాట. బ్రహ్మమునందు భూమికా భేదాలు లేవు.

ఈ యేడు భూమికలలో మొదటి మూడు సాధక కోటిలోవి. నాల్గవది తత్త్వజ్ఞాన రూపమైంది. కాబట్టి జీవన్ముక్తికి కాని విదేహముక్తికిగాని అది సాధనమైవుంటుంది. అయిదు ఆరు యేడు భూమికలు జీవన్ముక్తులకు గల ఆనందము యొక్క విలక్షణత్వాన్ని సూచిస్తాయి. ఉత్తరోత్తర భూమికలలో జీవన్ముక్తునికి దేహభావన తగ్గివుంటుంది. చివరికి ఉన్మత్తదశ కూడా కల్గుతుంది.

నాల్గవ భూమికవరకు ఉపదేశములు బోధలు తగినంత వ్యవహారమూ జరుపుకొంటాడు. అయిదవ భూమికలో ఉన్మత్తదశను బొంది శకునివలె జడభరతునివలె ప్రవర్తిస్తూ యేదో ఉత్తమాధి కారియై ఉత్తమ ప్రారబ్ధం కలవానికి ఉపదేశించ గల్గుతాడు. ఆరవ భూమికలో అది కూడా లేదు. ఏడవ భూమికను పొందినప్పుడు ఆ శరీరం యిరవై ఒకరోజుకు మించి నిలువదని మహాత్ములంటారు.

నాల్గవ భూమికలో చెప్పిన జ్ఞానానికి అధికారులు కృతోపాస్తి అకృతోపాస్తి అని రెండు విధాలు. కృతోపాస్తి అంటే బ్రహ్మజ్ఞానం ఆత్మ బ్రహ్మరూపమే అనే జ్ఞానం కల్గక పూర్వం లెస్సగా ఉపాసనలకు ఆచరించినవాడు. అకృతోపాస్తి అంటే ఉపాసనలకు ఆచరించని వాడని అర్థం.

ఈ యిద్దరిలో కృతోపాస్తి అయినవాడు సాధన చతుష్టయ సంపత్తి కలవాడై వుండుటబట్టి సులభంగా జ్ఞానం పొంది ఆయా ఊర్ధ్వ భూమికలను అధిరోహించ కల్గుతాడు.

రెండవ వాడైన అకృతోపాస్తికి సాధన సంపూర్ణత వుండదు. ఒకటిరెండు సాధనాలు మాత్రం స్పష్టమై తక్కినవి అస్పష్టమై వుంటాయి. ఇట్టి సాధకుడు బుద్ధిమంతుడైనచో నాల్గవ భూమికను చేరి తత్త్వజ్ఞానం పొందగల్గుతాడు. వాడు దీర్ఘకాలాభ్యాసంతో కాని

పైపై భూమికలకు చేరలేదు. తత్త్వజ్ఞానసిద్ధికృతోపాస్తికివలె అకృతోపాస్తికి సులభంకాదు.

ఈ సప్తభూమికల విషయాన్ని వసిష్ఠమహర్షి (యోగ వాశిష్టంలో) శ్రీరామచంద్రునికి ఉపదేశించి వున్నాడు.

అజ్ఞాన భూమికలు యేడు : (1) బీజజాగ్రత్త (2) జాగ్రత్త (3) మహాజాగ్రత్త (4)జాగ్రత్స్వప్నము (5) స్వప్నము (6) స్వప్నజాగ్రత్త (7) సుషుప్తి, అని వాటి పేర్లు ఇవి పరస్పరం కలుసుకొని అనేక ప్రకారాలైతాయి.

1) బీజజాగ్రత్త సృష్టికి ఆదిలో మాయ యొక్క ప్రభావంతో నామరహితము నిర్మలము చిదాభాసవంతమునైన రూపము యేర్పడింది. అదే తర్వాత ప్రాణధారణాది క్రియలకు ఆధారమై చిత్తమని జీవుడని చెప్పబడింది. అది జాగ్రత్తకు బీజం కాబట్టి బీజ జాగ్రత్తని పిలువబడింది. అది సంవిత్తుయొక్క నూతనావస్థ.

2) జాగ్రత్త : బీజజాగ్రతకు తర్వాత పరిణామమిది. "ఈ స్థూల శరీరమే నేను. ఈ స్థూల శరీర సంబంధమైన భోగ్యపదార్థాలు నావి." అని యీ విధంగా కలిగే అచల ప్రత్యయమే జాగ్రత్తని చెప్పబడింది.

3) మహాజాగ్రత్త : పూర్వోక్తమైన అచల ప్రత్యయము అనగా దృఢ విశ్వాసము మరింతా దృఢమై వుండుట మహాజాగ్రత్త.

4) జాగ్రత్స్వప్నము : అభ్యాసంతో పనిలేక రూఢియైపోయి సంకల్ప మాత్రములే స్వరూపంగా కలిగి అనగా జాగ్రత్తలోని మనోరాజ్యమే జాగ్రత్స్వప్నము. ఇద్దరు చంద్రుల ప్రతీతి శుక్తి రజత భ్రాంతి మరుమరీచికల భ్రమ యివన్నీ జాగ్రత్స్వప్నం యొక్క భేదాలు. జాగ్రదవస్థలలోనే స్వప్నం వంటి వ్యవహారం జరగడం జాగ్రత్స్వప్నమని చెప్పబడుతుంది.

5) స్వప్నము : నిద్రామధ్యంలో కాని నిద్రయొక్క అంత్యంలోకాని మిథ్యాపదార్థాలు స్వల్పకాలం అగుపడి తర్వాత అదృశ్యమైతాయి. అవి సత్యం కాదు; మిథ్యాభ్యాసలే అని తెలుస్తుంది ఇది స్వప్నము. ఈ స్వప్నము మహాజాగ్రతలో స్థూలశరీరం యొక్క కంఠం నుండి హృదయము వరకు నుండిన నాడీభాగంలో కల్గుతుంది.

6. స్వప్నజాగ్రత్త : స్వప్నమే జాగ్రత్తలోవలె దృఢమైవుంటే అదే స్వప్నజాగ్రత్త.

7. సుషుప్తి : పైన చెప్పిన ఆరు భూమికలకు కారణమై వాసనా సహితమైన స్థితి

అనగా అజ్ఞానావస్థే సుషుప్తి అని చెప్పబడ్తుంది.

ఇవియే అజ్ఞానముయొక్క సప్తభూమికలు. సముద్రపు సుడిగుండాలలో నావ భ్రమించునట్లు జీవుడు యీ అజ్ఞాన భూమికలలోపడి మోహములనే సుడిగుండాలలో భ్రమిస్తూంటాడు. జీవుడు జనన మరణ రూప సంసారంలో వెతలు బొందుటకు యీ అజ్ఞాన భూమికలే కారణము. కావున అవశ్యం వీటిని పరిత్యంజించాలె. ఈ విషయము యోగవాశిష్ఠ రామాయణమున ఉత్పత్తి ప్రకరణమునందు 117వ సర్గంలో 15 నుండి 21వ శ్లోకం వరకు చెప్పబడినది.

ఇట్లు వేదాంతగోష్ఠిలో జ్ఞానభూమికలు
అజ్ఞానభూమికలు అనే పదునైదవ ఘట్టం ముగిసినది.

**ఆధ్యాత్మిక గ్రంథాలలోని శ్లోకములు**

| | | |
|---|---|---|
| భాగవతంలో శ్లోకములు | – | 18,000 |
| వాల్మీకి రామాయణంలో శ్లోకములు | – | 24,000 |
| వాసిష్ఠ మహారామాయణంలో శ్లోకములు | – | 32,000 |
| భారతంలో శ్లోకములు | – | 1,00,000 |
| భగవద్గీతలో శ్లోకములు | – | 701 |

**భగవద్గీత శ్లోక సూచీ**

| | | |
|---|---|---|
| ధృతరాష్ట్రుడు చెప్పిన శ్లోకములు | – | 1 |
| సంజయుడు చెప్పిన శ్లోకములు | – | 41 |
| అర్జునుడు చెప్పిన శ్లోకములు | – | 85 |
| శ్రీ కృష్ణుడు చెప్పిన శ్లోకములు | – | 574 |
| **మొత్తం శ్లోకములు** | – | **701** |

**పాపానికి ప్రాయశ్చిత్తములు ఐదు**

1. మౌనం. 2. ఉపవాసం. 3. జపం. 4. అన్నదానం. 5. పశ్చాత్తాపం.

**పంచశీలములు**

1. ఆహారనియమం. 2. నివాసనియమం. 3. సంసర్గ.
4. అనుష్ఠాన. 5.కృత్యనియమం



# వేదాంత గోష్ఠి

## పదారవ ఘట్టం
## (జీవన్ముక్తి విదేహా ముక్తులను గురించి)

**శిష్యుడు :** జీవన్ముక్తి అనగా నేమి?

**గురువు :** దేహాదిక ప్రపంచంతోస్తున్నా కూడా బ్రహ్మ స్వరూపంలో స్థితికల్గి వుండటాన్ని జీవన్ముక్తి అంటారు.

**శిష్యుడు :** జీవన్ముక్త దశలో ప్రపంచ ప్రతీతి యెందుకు కలగాలి?

**గురువు :** విను. అవిద్యకు ఆవరణమని, విక్షేపమని రెండు శక్తులు.

వాటిలో ఆవరణశక్తి జ్ఞానంద్వారా నశించిపోయింది. అందువలన అజ్ఞానికి పునర్జన్మంలేదు. కానీ రెండవదైన విక్షేపశక్తి ప్రారబ్ధబలంతో దగ్ధబీజ న్యాయమువలె నిలిచి వుంది. కావున జీవన్ముక్తియందు కూడా ప్రపంచ ప్రతీతి ఉండనే వుంటుంది.

స్థూల సూక్ష్మ ప్రపంచ సహితమైన చిదాభాసుడే విక్షేపానికి స్వరూపము. ధాన్యపుగింజలో రెండు శక్తులుంటవి. ఒకటి మొలకయెత్తేశక్తి. రెండవది పోషణచేసే శక్తి. గింజను వేయిస్తే అంకురశక్తి నశిస్తుంది. కాని పోషణశక్తి మిగిలే వుంటుంది. ఆ ప్రకారంగా ఆవరణశక్తి నశించినా కూడా లేశావిద్యను (విక్షేపాన్ని) ఆశ్రయించి జీవన్ముక్త దశలో సహితం ప్రపంచ ప్రతీతి వుంటుంది.

**శిష్యుడు :** జీవన్ముక్త దశలోని ప్రపంచ ప్రతీతి యేమాదిరిగా వుంటుందో ఉదాహరణ సహితంగా చెప్పండి.

**గురువు :** 1. త్రాడును పాము అని అనుకొన్నాడు. దద్దరిల్లిపోయాడు. తెప్పరిల్లి చూచి "ఇది త్రాడే కాని పాము కా"దని తెలుసుకొన్నాడు. సర్పములేదు. అయినను

మొదట కల్గిన భ్రాంతియొక్క పరిణామంతో యేర్పడిన భయ కంపాదులు కాస్సేపు పరిణామంతో యేర్పడిన భయ కంపాదులు కాస్సేపు నిలిచే ఉంటవి.

2. నిజము కాదని తెలిసిన వానికి కూడా అద్దంలో ప్రతిబింబం భావిస్తూనే వుంటుంది.

3. నీరు కాదని నిశ్చయించిన వానికి కూడా యెండమావులు నీటివలెనే అగుపడ్తుంటాయి. అలాగే బాధింపబడి వున్నా కూడా ప్రపంచము జ్ఞానికి జీవన్ముక్త దశలో సైతం ప్రతీత మౌతుంటుంది.

**శిష్యుడు :** బాధింపబడిన ప్రపంచ ప్రతీతిని వివరిస్తూ మరొక్క దృష్టాంతాన్ని సెలవియ్యండి.

**గురువు :** ఆలకించుము మహాభారత యుద్ధంలో శ్రీకృష్ణుడు అర్జునునికి రథసారథి అయ్యాడు. "ఈ యుద్ధం ముగిసే వరకు యీ రథము యీ గుర్రాలు యీ విధంగానే చెక్కు చెదరక వుండా"లంటూ ఆయన ఆదిలోనే సంకల్పించాడు. ఆ కృష్ణపరమాత్ముని సత్య సంకల్ప ప్రభావంతో అశ్వత్థామాది వీరాగ్రేసరుల అస్త్ర శస్త్రాలకు దగ్ధంకాకుండా ఆ రథం నిలబడి వుండింది. యుద్ధమంతా ముగిశాక శ్రీకృష్ణార్జునులు శిబిరం చేరుకున్నారు. అస్త్ర శస్త్ర సహితంగా అర్జునుని ముందు దించి శ్రీకృష్ణుడు తర్వాత దిగాడు. వెంటనే రథము గుర్రాలతో సహా భగ్గుమని మండిపోయింది. ఇది దృష్టాంతం, ఇక దార్ష్టాంతం విను.

స్థూల దేహము రథము పాప పుణ్యాలు రెండు, రెండు చక్రాలు, గుణత్రయము కేతనము. పంచప్రాణాలు బంధనాలు దశేంద్రియాలు గుర్రాలు. శబ్దాది విషయాలు మార్గాలు. మనస్సు కళ్ళెము. బుద్ధి (శ్రీకృష్ణుడు) సారథి. ప్రారబ్ధకర్మము అతని సత్య సంకల్పము. అహంకారము ఆసన పీఠము. ఆత్మ (అర్జునుడు) రథికుడు. వైరాగ్యాది సాధనాలు అస్త్రశస్త్రాలు.

ఈ విధమైన రథాన్ని అధిరోహించి సత్సంగమనే రణభూమిలోనికి వచ్చాడు. గురు రూపమైన అశ్వత్థామాదులు మహావాక్యోపదేశాలనే బ్రహ్మాస్త్రాలను వదిలారు. వాటి నుండి జ్ఞానమనే అగ్ని కలిగింది. ఆ క్షణంలోనే దేహాదిక ప్రపంచము బాధింపబడింది. కానీ బుద్ధి అనెడి సారథి యొక్క ప్రారబ్ధ కర్మమనెడి సత్యసంకల్ప ప్రభావంతో దేహాదికాలు నాశము బొందక చివరి వరకు ప్రతీతి కల్గియే యుండినవి దీనినే బాధితానువృత్తి అంటారు.

**శిష్యుడు** : గురుపర్యా! విదేహముక్తియొక్క స్వరూపమెట్టిది?

**గురువు** : ప్రపంచముయొక్క ప్రతీతి రహితముగా బ్రహ్మ స్వరూపములో వుండుట ప్రారబ్ధ కర్మయొక్క అనుభవం తీర్తూనే స్థూల సూక్ష్మ శరీర రూపంగా పరిణామము బొందిన అజ్ఞానము చేతనములో విలయము బొందుట – ఈ స్థితినే విదేహముక్తి అంటారు.

విచారంవల్ల జ్ఞానంవల్ల వస్తువుయొక్క స్వరూపాన్ని మిథ్యగా నిశ్చయించుకొన్న పిమ్మట కూడా ఆ వస్తువుయొక్క ఆకారము యెప్పటివలెనే ప్రతీతి యగుచుండుటను బాధితాను వృత్తి అంటారు.

కుమ్మరివాడు చక్రాన్ని కర్రతో త్రిప్పుట మానుకొన్న తర్వాతను కూడా చక్రం వెనుకటి వేగంతో తిరుగుతూనే వుంటుంది. బాధ (మిథ్యా నిశ్చయము కల్గిన) తర్వాత కూడా ప్రారబ్ధకర్మవల్ల దేహాదిప్రపంచము ప్రతీతమౌతూనే వుంటుంది. దాన్నే బాధితాను వృత్తి అంటారు.

**శిష్యుడు** : ప్రారబ్ధం ముగిసిపోయిన తర్వాత కార్యసహిత అజ్ఞాన లేశము యొక్క విలయము ఏ సాధన ద్వారా సంభవిస్తుంది?

**గురువు** : జ్ఞానికి విధిలేదు. పారబ్ధము ముగిసేసరికి సుషుప్తి మూర్ఛాకాలాదులందు వలె బ్రహ్మాకారవృత్తి వుండే వీలులేదు. కావున బ్రహ్మవిద్యా సంస్కార ఆరూఢ చేతనం ద్వారా కార్యసహిత అజ్ఞానలేశము విలయం బొందుతుంది.

అగ్ని కొరివి కట్టెద్వారా తృణాదికాలను కాల్చి చివరికి తానున్న కొరవినిసహా కాల్చు కొన్నట్లు సంస్కార ఆ రూఢ చేతనము ప్రపంచాన్ని విలయం చేసి తన సంస్కారాన్ని కూడా నశింపజేస్తుంది. ఇక మిగిలినది అసంగశుద్ధ సచ్చిదానంద స్వప్రకాశ బ్రహ్మము మాత్రము.

ఇట్లు వేదాంతగోష్ఠిలో జీవన్ముక్తి విదేహ
ముక్తులను గురించిన పదారవ
ఘట్టం ముగిసింది



# వేదాంత గోష్ఠి

## పదేడవ ఘట్టం
## (వేదాంత ప్రమేయ వర్ణన)

(ఈ ఘట్టంలో ప్రమేయ వర్ణణము చెప్పబడింది. ప్రమాణమనగా వేదాంత శాస్త్రము. దానివలన కలిగిన యథార్థ జ్ఞానము ప్రమ యనబడ్తుంది. ప్రమ ద్వారా తెలియదగిన పదార్థమును ప్రమేయమంటారు. ఈ ఘట్టము ప్రమేయగత సంశయాన్ని నివారిస్తుంది.

**శిష్యుడు :** మోక్షమనగా నేమి?

**గురువు :** 1. కార్యసహితముగ అజ్ఞాన రూపమగు అనర్థము అనగా బంధము నివర్తించుటయు, 2. పరమానంద రూప బ్రహ్మప్రాప్తి చేకూరుటయు మోక్షమని వేదాంత ప్రతిపాదిత సిద్ధాంతము.

ఆత్మయు బ్రహ్మమందు ఒక్కటియే అను జ్ఞానము మోక్షానికి సాక్షాత్సాధనము. నిష్కామకర్మ ఉపాసనలు మోక్షానికి అవాంతర సాధనలు.

**శిష్యుడు :** ఈ జ్ఞానానికి విషయమేమిటి?

**గురువు :** ఆత్మ బ్రహ్మల యేకత్వమే యీ జ్ఞానానికి విషయము.

**శిష్యుడు :** ఆత్మయొక్క స్వరూపమేమి?

**గురవు :** (1) దేహేంద్రియ ప్రాణ మనో బుద్ధులకును అజ్ఞానమునకును, శూన్యమునకును భిన్నమైనది. (2) అకర్త (3) అభోక్త, (4) అసంగము, (5) వ్యాపకము, (6) చేతనము ఇట్టిదే ఆత్మస్వరూపము.

**శిష్యుడు :** బ్రహ్మముయొక్క స్వరూపమెట్టిది?

**గురువు :** (1) నిష్ప్రపంచము, (2) అసంగము, (3) పరిపూర్ణము, (4) చేతనము ఇట్టిదే బ్రహ్మస్వరూపము.

**శిష్యుడు :** బ్రహ్మము ఆత్మ – ఈ రెంటి యొక్క ఏకత్వమెట్టిది?

**గురువు :** (1) సచ్చిదానందము, (2) ఐశ్వర్య స్వరూపము, (3) సదావిద్యమానమై యుండుట. ఈ లక్షణములే బ్రహ్మమునకు ఆత్మకును ఏకత్వమును ప్రతిపాదించు చున్నవి.

**శిష్యుడు :** జ్ఞానముయొక్క స్వరూపమేమి?

**గురువు :** జీవబ్రహ్మలయొక్క అభేద నిశ్చయమే జ్ఞానము యొక్క స్వరూపము.

**శిష్యుడు :** జ్ఞానానికి సాక్షాత్తు అంతరంగ (సమీప) సాధనమేది?

**గురువు :** బ్రహ్మనిష్ఠుడైన సద్గురుయొక్క ముఖంతో మహావాక్యాల అర్థాన్ని శ్రవణం చేయుట జ్ఞానానికి సాక్షాత్తు అంతరంగ సాధనము.

**శిష్యుడు :** జ్ఞానానికి పరంపరగా అంతరంగ సాధనాలు ఏవి?

**గురువు :** (1) వివేకము, (2) విరాగము, (3) శమాదిషట్సంపత్తి, (4) మోక్షేచ్ఛ, (5) తత్త్వం పదార్థ శోధన, (6) శ్రవణ, (7) మనన, (8) నిదిధ్యాసనములు ఈ యెనిమిదియు జ్ఞానానికి పరంపరగా అంతరంగ సాధనాలు.

**శిష్యుడు :** జ్ఞానానికి బహిరంగ సాధనలు యేవి?

**గురువు :** నిష్కామకర్మ నిష్కామ ఉపాసనలు (జప, తప, యజ్ఞ, దాన, తీర్థ, క్షేత్ర, యాత్రలు జ్ఞానానికి బహిరంగ సాధనలు.

ఇట్లు వేదాంత గోష్ఠిలో వేదాంత ప్రమేయ
వర్ణనమనే పదేడవ ఘట్టం
ముగిసింది.



# వేదాంత గోష్ఠి

## పరిశిష్టం - ఒకటి

## (సకారణ సభేద వృత్తి స్వరూప నిరూపణము)

(ఈ ఘట్టం వృత్తి రత్నావళి విచారసాగరము తత్త్వానుసంధానమును అనుసరించి వ్రాయబడినది.)

1. వృత్తియొక్క సామాన్య లక్షణము.

**"అహం బ్రహ్మాస్మి"** అనువృత్తి ఉదయించడంతో కార్యసహిత అజ్ఞానము నివర్తించి పరమానంద ప్రాప్తి సిద్ధిస్తుదంటూ వేదాంతముల సిద్ధాంతము.

(ఎ) వృత్తి అనగానేమి?

(బి) వృత్తికి కారణమేది?

(సి) వృత్తియొక్క ప్రయోజనమేమి? ఈ మూడు విషయాలను గురించి జిజ్ఞాసిస్తాము.

(ఎ) వృత్తి అనగానేమి? వృత్తియొక్క లక్షణమేమి? అని ప్రశ్న, ప్రథమ లక్షణము అంతఃకరణముయొక్క పరిణామాన్ని లేదా అజ్ఞానముయొక్క పరిణామాన్ని వృత్తి అంటారు.

**శిష్యుడు :** ఓ గురుదేవా! క్రోధము సుఖము మొదలైనవి అంతఃకరణము యొక్క పరిణామాలే. అట్లే, ఆకాశం మొదలైనవి అజ్ఞానము యొక్క పరిణామాలు, అటులైన వాటిని సహోవృత్తి అని అనవచ్చునా? వాటిని వృత్తులని అనరాదు. మరిమీరు చెప్పిన లక్షణానికి యీచోట అతివ్యాప్తి వస్తుంది కదా!

ఏ లక్షణము లక్ష్యమునందు వర్తిస్తూ, దానికి భిన్నమైన అలక్ష్యమునందు కూడా

ఆ లక్షణము వర్తిస్తే అప్పుడది అతి వ్యాప్తి అనే దోషం కలదిగా చెప్పుతారు. ఉదాహరణ మేమంటే **"ఆవు కొమ్ములు కలది"** అని చెప్పినప్పుడు, **"కొమ్ములు కలది"** అనే లక్షణము ఆవునందే కాక యెద్దునందు, గేదెయందు, మేకయందు కూడా ప్రవర్తిస్తుంది. ఈ లక్షణం అతివ్యాప్తి దోషం కల్గినది.

**గురువు :** ప్రియమైన శిష్యా! ఆ దోషాన్ని నివర్తించుటకై వృత్తియొక్క లక్షణం మరోవిధంగా చెబుతాను. ద్వితీయ లక్షణము : విషయమును ప్రకాశింప జేయ గల్గినదై అంతఃకరణము యొక్క లేదా అజ్ఞానము యొక్క పరిణామ విశేషమైన దానిని వృత్తి అంటారు.

(క్రోధము సుఖము మొదలైనవి అంతఃకరణము యొక్క పరిణామాలే కాని వాటితో యేపదార్థము కూడా ప్రకాశింపజేయ బడుటలేదు. ఆకాశం మొదలైనవి అజ్ఞానం యొక్క పరిణామాలే కాని వాటివలన కూడ యేపదార్థము ప్రకాశింపచేయబడదు. కాబట్టి వాటిని 'వృత్తి' అనరాదు. మరేమన జ్ఞానరూప పరిణామంతో ప్రకాశం కల్గించునదే "వృత్తి" అని అనవలెను.)

**శిష్యుడు :** గురుదేవా! సుఖము, దుఃఖము, కామము, క్రోధము, తృప్తి, క్షమ, ధృతి, అధృతి, లజ్జా, భయము మొదలైన యీ అంతఃకరణ పరిణామాలను "వృత్తి" అని వ్యవహరిస్తారు కదా!

**గురువు :** శిష్యా! తత్వానుసంధానము అద్వైతకౌస్తుభము మొదలైన గ్రంథాలలో "ప్రకాశక పరిణామమునే వృత్తియని చెప్పినారు. మరికొన్ని గ్రంథాలలో అజ్ఞాన నాశక పరిణామమును వృత్తి" అన్నారు. పరోక్ష జ్ఞానంతో కూడా అజ్ఞానము యొక్క అసత్వాపాదక అంశము నశిస్తుంది లేదా!

విషయచేతన నిష్ఠమైన ఆవరణము యొక్క నాశము అపరోక్ష జ్ఞానంతో వినా సంభవించదు. ప్రమాతృ చేతన నిష్ఠమైన ఆవరణముయొక్క నాశము పరోక్ష జ్ఞానంతో నశిస్తుంది. కాబట్టి. **"అజ్ఞాన నాశక పరిణామము వృత్తి"** అని చెప్పిన లక్షణముద్వారా పరోక్ష జ్ఞానమునందు అవ్యాప్తి కలుగుటలేదు. అజ్ఞాన నాశక ఆవరణమును నివర్తించే, పరిణామము అంతఃకరణము యొక్క లేదా అజ్ఞానముయొక్క పరిణామము.

విషయ చేతన నిష్ఠమైన ఆవరణాన్ని అభానాపాదక ఆవరణమనియు, ప్రమాతృ చేతన నిష్ఠమైన ఆవరణాన్ని అసత్త్వాపాదక ఆవరణమనియు అంటారు. 'అవ్యాప్తి' అనునదొక దోషము. దాని అర్ధమేమంటే, చెప్పబడిన లక్షణము లక్ష్యమునందు సంపూర్ణంగా ప్రవర్తించక లక్ష్యముయొక్క యేకదేశంలో ప్రవర్తించినప్పుడు అట్టి లక్షణము అవ్యాప్తిదోషం కలదిగా చెప్పబడుతుంది. ఉదాహరణ మేమన గోవు కపిల వర్ణము కలది. 'ఈ చోట గోవుకు కపిలత్వము చెప్పబడినది. కాని కపిలత్వమనే యీ లక్షణము అన్ని గోవులలో వర్తించదు. తెల్లవి, నల్లవి, ఎర్రని రకరకాలుగా గోవులుంటాయి. కాబట్టి యీ లక్షణానికి అవ్యాప్తి దోషంవుంది.

**"అజ్ఞాన నాశక పరిణామమువృత్తి"** అనే లక్షణంతో పరోక్ష జ్ఞానమునందు అవ్యాప్తి లేదనేమాట నిజమే కాని అయితే ఒక విషయం.

1. సుఖదుఃఖ జ్ఞానరూప వృత్తియందును.
2. మాయయొక్క వృత్తిరూపమైన యీశ్వరుని జ్ఞానము నందును.
3. శుక్తి రజతాది రూపమున గోచరించు భ్రమయనెడి అవిద్యావృత్తి యందును.
4. స్వప్న గోచరమైన జ్ఞానము నందును,
5. సుషుప్తిగతమైన సుఖము నందును అజ్ఞానగోచరమైన అవిద్యావృత్తి యందును.

పైన చెప్పిన **"అజ్ఞాన నాశక పరిణామము వృత్తి"** అనెడి లక్షణమునకు అవ్యాప్తి దోషం సంభవిస్తుంది. కారణమేమంటే.

1. మొదట అజ్ఞాతములై సుఖాదులు కలిగి ఆ తర్వాత వాటి జ్ఞానం కలిగే పక్షంలో, ఆ సుఖాదుల జ్ఞానంతో చేతనాశ్రితమైన అజ్ఞానము (యొక్క ఆవరణరూప అంశం) నశించుట ఉండేది; కాని సుఖాదులు అజ్ఞాతములై కల్గుటలేదు. సుఖాదులు వాటి జ్ఞానము ఒకే కాలంలోనే కల్గుతున్నాయి. అందువలన అజ్ఞాతములైన సుఖాదులే లేవు కాబట్టి, సుఖాది గోచర వృత్తితో అజ్ఞానం నశించుట అనేమాట పొసగదు.

2. మరి రెండోమాట. ఈశ్వరునియందు అజ్ఞానం లేనేలేదు. అతనికి అసాధారణ రూపంతో (లేదా సాధారణ రూపంగానేమి) అన్ని పదార్థాలు సర్వదా ప్రత్యక్షమయ్యే

యున్నాయి. కావుననే ఆయనకు అజ్ఞానంలేదు. అతని మాయయనే వృత్తి రూప జ్ఞానంతో అజ్ఞానం నశిస్తుందనే మాట పొసగదు.

3-4 శుక్తి రజతాదులు వాటి జ్ఞానము, స్వప్న గత మిథ్యా పదార్థాలు వాటి జ్ఞానము ఒకేసారిగా గల్గుతుండటం బట్టి భ్రమరూప అవిద్యా వృత్తితో సైతం అజ్ఞానం నశించుట అనేమాట లేదు.

5. అట్లే మరోమాట. సుషుప్తియందు వృత్తియున్నది. కాని అది తనకు విషయమై తనకు ఉపాదానమై స్వరూప సుఖాన్ని ఆవరించిన అజ్ఞానాన్ని నశింపజేయలేదు. అట్లే జ్ఞాన గోచరమైన ప్రత్యభిజ్ఞా జ్ఞానంవుంది. అయినా ఆవరణం అచ్చుటలేదు కాబట్టి దాని నాశనమనే మాటలేదు.

ఏవిధంగా - "అహంబ్రహ్మాస్మి" అనే వృత్తిద్వారా ఒక పర్యాయం అపరోక్ష జ్ఞానం ఉదయించిందా స్వరూపముయొక్క ఆవరణము నశించిపోయింది. మరి తర్వాత శ్రవణ మననాలు చేస్తూండే విద్వాంసునికి అహంబ్రహ్మాస్మి అనే వృత్తి పలుపర్యాయాలు సంభవిస్తూనే వుంటుంది. అయినా ఆ వృత్తితో ఆవరణభంగం కల్గుతుందనే మాట లేదు; ఎందుకనగా, ఆ విద్వాంసుని స్వరూపానికి ఆవరణము యీవరకే తొలిగి నిరావృతమైవుంది కాబట్టి ఆవరణంలోని అజ్ఞానం కాని వుంటేకదా తొలిగే దానికి అవకాశం వుంటుంది.

ఆ విధంగానే, వృత్తి ధారావాహికంగా వున్నప్పుడు మొదటి వృత్తి ద్వారానే ఆవరణ భంగం కల్గింది. కాబట్టి ఆ తర్వాత గల్గే వృత్తులకు ఆవరణ భంగమనే ఫలమునందు ఆ వ్యాప్తి సిద్ధిస్తుంది.

ఈ ప్రకారంగా

1. సుఖదుఃఖ జ్ఞానరూపమైన వృత్తియందును.
2. మాయయొక్క వృత్తి రూపమైన యీశ్వరుని జ్ఞానమునందును.
3. శుక్తి రజతాది రూపమున గోచరించు భ్రమ యనెడి అవిద్యావృత్తి యందును.
4. స్వప్న గోచరమైన జ్ఞానము నందును.

5. సుషుప్తిగతమైన సుఖమునందును అజ్ఞాన గోచరమైన అవిద్యావృత్తి యందును.

6. ప్రత్యభిజ్ఞా జ్ఞానరూపమైన వృత్తి యందును.

7. ధారా వాహికమైన "అహంబ్రహ్మాస్మి" జ్ఞానమునందును.

యీ అన్నిచోట్లను, ఆవరణము (అజ్ఞానము) లేదు కాబట్టి "అజ్ఞాన నాశక (ఆవరణ నివృత్తిరూప) పరిణామము వృత్తి" యనెడి లక్షణమునకు అవ్యాప్తి కల్గుచున్నది.

ఈ విధంగా అతివ్యాప్తి అవ్యాప్తి అనే దోషాలు సంభవించని విధంగా "**ప్రకాశక పరిణామము వృత్తి**" యని చెప్పవచ్చును. దాని తాత్పర్య మేమంటే.

"అస్తి అనే వ్యవహారానికి హేతువై అవిద్యయొక్క అంతఃకరణముయొక్క పరిణామము వృత్తి యనబడును."

ప్రకాశక పరిణామమే వృత్తి అంటారు. అయినా అజ్ఞాత పదార్థ గోచర వృత్తియందే అజ్ఞాన నాశకతా రూప ప్రకాశకత్వం సంభవిస్తుంది. అంతేకాని, అనావృత పదార్థ గోచర వృత్తియందు ప్రకాశకత్వంలేదు. కారణ మేమంటే అనావృత చేతనయొక్క సంబంధంతోనే విషయము ప్రకాశిస్తుంది. జడమైన వృత్తియందు ప్రకాశకత్వమును కల్పించుట యోగ్యంకాదు. అజ్ఞానం యొక్క ఆవరణ భంగంతప్ప వృత్తియందు అన్యవిధమైన ప్రకాశత్వ మేదియు సంభవింపదు. అందువలన ప్రథమలక్షణం వలెనే ద్వితీయలక్షణానికి కూడా సుఖాది గోచర వృత్తియందు అవ్యాప్తి సిద్ధిస్తుంది. కాబట్టి.

"అస్తి (వున్నది) అనే వ్యవహారానికి హేతువై అవిద్య లేదా అంతఃకరణముయొక్క పరిణామాన్ని వృత్తి అంటారు" - ఈ లక్షణమే చెప్పదగివుంది.

### -: వృత్తి (జ్ఞానము) భేద నిరూపణము :-

**శిష్యుడు :** గురుదేవా! ఆ వృత్తిజ్ఞానము యెన్ని విధాలు?

**గురువు :** వృత్తిజ్ఞానము (1) ప్రమారూపము (2) అప్రమారూపమని రెండు విధాలు.

**శిష్యుడు :** ప్రమాజ్ఞానము యొక్క లక్షణమేమి? అప్రమాజ్ఞానమనగానేమి?

**గురువు :** ఆయా గ్రంథకారుల మతమునుబట్టి ప్రమాజ్ఞానము క్రింది విధంగా

నాల్గు రకాల లక్షణాలతో చెప్పబడింది.

1. ప్రమాణ జన్య యథార్థజ్ఞానాన్ని ప్రమ అంటారు.

2. అబాధిత అర్థాన్ని విషయం చేసే జ్ఞానాన్ని ప్రమా అంటారు.

3. అబాధిత అర్థాన్ని విషయం చేస్తూ స్మృతికి భిన్నమైన జ్ఞానాన్ని "ప్రమ" అంటారు.

4. యథార్థమైన అనుభవాన్ని ప్రమ అంటారు. ఆ ప్రమాజ్ఞానానికి భిన్నమైన జ్ఞానాన్ని అప్రమ అంటారు.

**శిష్యుడు :** గురుదేవా! పై విధంగా ప్రమాజ్ఞానానికి నాల్గు లక్షణాలు చెప్పితిరి కదా! వాటిని విస్తారంగా వివరించి చెప్పండి.

**గురువు :** జిజ్ఞాసువైన శిష్యా! మొత్తము కలసి వృత్తి జ్ఞానము పదివిధాలు. అందులో.

ప్రథమ లక్షణాన్ని అనుసరించి ప్రత్యక్షాది భేదాలతో ప్రమాజ్ఞానము ఆరు విధాలు. (1) ప్రత్యక్షము, (2) అనుమతి (3) ఉపమితి, (4) శాబ్ది, (5) అర్థాపత్తి (6) అభావము.

ఈ అరువిధాలైన ప్రమాజ్ఞానానికి భిన్నమైన (1) ఈశ్వరజ్ఞానము, (2) సుఖాది గోచర జ్ఞానము, (3) స్మృతి జ్ఞానము, (4) భ్రాంతిజ్ఞానము - యీ నాల్గును అప్రమారూపములు ఈ నాల్గింటిలో మొదటి మూడును యథార్థ అప్రమారూపమని నాల్గవదియైన భ్రాంతి జ్ఞానము ఆ యథార్థ అప్రమారూపమని చెప్పబడ్తుంది.

ఒకానొక గ్రంథ కారునిమతాన్ని అనుసరించి యథార్థ జ్ఞానము ప్రమారూపమని ఆ యథార్థ జ్ఞానము అప్రమారూపమని చెప్పబడును. అతని మతాన్ని అనుసరించి పైన చెప్పిన ద్వితీయ లక్షణము "అ బాధిత అర్థాన్ని విషయం చేసే జ్ఞానాన్ని ప్రమ" అంటారు. ఈ ద్వితీయ లక్షణాన్ని అనుసరించి,

(1) ఈశ్వర జ్ఞానము (2) సుఖాదిగోచర జ్ఞానము, (3) స్మృతి జ్ఞానము - యీ మూడు కూడా ప్రమా రూపమైనవే. భ్రాంతి జ్ఞానము అప్రమా రూపము. ఈ ద్వితీయ లక్షణాన్ని అనుసరించి ప్రత్యక్షాదికాలు ఆరును ఈశ్వర జ్ఞానము మొదలగు మూడును కలసి తొమ్మిది విధాలు ప్రమాజ్ఞానము. ఒక్క భ్రాంతి జ్ఞానము అప్రమా రూపము.

శ్రీ వ్యాసమహర్షియు, శ్రీశంకరాచార్యుల వారును మరీ యితర ప్రాచీనులైన ఆచార్యులును స్మృతికి భిన్నమైన యథార్థా జ్ఞానాన్ని ప్రమ అంటూ వ్యవహరించారు. అందువలన వారి మతాన్ని అనుసరించి (3) అబాధిత అర్థాన్ని విషయం చేస్తూ స్మృతికి భిన్నమైన జ్ఞానాన్ని "ప్రమ" అంటారు. (4) యథార్థమైన అనుభవాన్ని ప్రమ అంటారు ఈ విధంగా మూడవ నాల్గవ లక్షణాలు చెప్పబడినాయి.

ఈ మూడు నాల్గు లక్షణాలను అనుసరించి (1-6) ప్రత్యక్షాదులైన ఆరు విధాల జ్ఞానాలు (7) ఈశ్వర జ్ఞానము (8) సుఖాది గోచర జ్ఞానము - ఈ ఎనిమిది విధాలు ప్రమాజ్ఞానం వుంది. ఇందుకు భిన్నమైన (1) స్మృతి జ్ఞానము. (2) భ్రాంతి జ్ఞానము - యీ రెండును అప్రమా జ్ఞానాలు.

**శిష్యుడు :** దయానిధీ! మూడవలక్షణాన్ని పదకృతి వివరించండి.

**గురువు :** ప్రియమైన శిష్యా! శుక్తి రజతాది జ్ఞానం స్మృతికంటె భిన్నమైయింది. కానీ ఆ జ్ఞానం అబాధిత అర్థాన్ని విషయం చేయలేదు. అది బాధిత అర్థాన్నే విషయం చేస్తుంది. అందువలన అది భ్రాంతి జ్ఞానము, అది ప్రమారూపం కాదు. అబాధిత అర్థాన్ని విషయం చేసేదైనను స్మృతి జ్ఞానము ప్రమ అని చెప్పబడదు. కావుననే అనేక గ్రంథాలలో.

"స్మృతికంటె భిన్నమై ఆ బాధిత అర్థగోచరమైన జ్ఞానము ప్రమ" అని చెప్పబడింది.

**శిష్యుడు :** గురుదేవా! నాల్గవ లక్షణాన్ని పదకృతి సహితంగా వివరించండి.

**గురువు :** శిష్యా! యథార్థజ్ఞానము స్మృతిజ్ఞానంగా కూడ వుండ గల్గుతుంది. కాని అది అనుభవం రూపకంగా (ప్రత్యక్ష రూపముగా) వుండదు.

అనుభవ (ప్రత్యక్ష) రూపమైన జ్ఞానము భ్రాంతి జ్ఞానంగా కూడ వుండవచ్చును. కాని అది యథార్థజ్ఞానం కాబోదు. కాబట్టే.

**"యథార్థ అనుభవమే ప్రమాజ్ఞానము"** అని నాల్గవ లక్షణం చెప్పబడింది. దీనికి భిన్నమైనది. అప్రమా జ్ఞానము.

ఈ ప్రమాలక్షణం స్మృతికి వేరుపరచబడింది.

ఈశ్వరజ్ఞానము సుఖాదిగోచర జ్ఞానము (ఈ రెండు జ్ఞానములను) యథార్థ అనుభవ రూపాలు. కాబట్టి ఈ రెండు జ్ఞానాలు ప్రత్యక్షాదులు ఆరింటి అనుభవమువలె ప్రమారూపాలు. దానికంటె భిన్నమైన స్మృతిజ్ఞానము భ్రాంతి జ్ఞానము అప్రమా రూపాలు.

**శిష్యుడు :** ప్రమాజ్ఞానం యెన్నివిధాలు? అది యేదేది?

**గురువు :** ప్రమాజ్ఞానం ఎనిమిది విధాలు. (1) ప్రత్యక్షము (2) అనుమితి, (3) ఉపమితి, (4) శాబ్దీ, (5) అర్థాపత్తి (6) అభావము (ఈ ఆరును ప్రమాణ జన్యములగు యథార్థ జ్ఞానములు) (7) ఈశ్వరుని జ్ఞానము (8) సుఖాదిగోచర జ్ఞానము; ఈ విధంగా ప్రమాజ్ఞానము యెనిమిది విధాలు.

ఈ ప్రమాజ్ఞానము (1) జీవాశ్రిత (జీవాశ్రయ) ప్రమయని (2) ఈశ్వరాశ్రిత (ఈశ్వరాశ్రయ) ప్రమయని రెండు విధాలు.

**శిష్యుడు :** జీవాశ్రితప్రమ యొక్క లక్షణం చెప్పండి?

**గురువు : "అనధిగత అబాధిత విషయాకార అంతఃకరణ వృత్తి ప్రతిబింబితాచిత్ జీవాశ్రయాప్రమా"** అవధిగతమంటే అజ్ఞాతమని అర్థం. ఈ వరకు యెరుగనిది. మరియు అభాధితము అంటే బాధారహితమైంది. అట్టి విషయమున్నదనుకో! అట్టి విషయాకారమై అంతఃకరణవృత్తి ఉన్నది. ఆ వృత్తియందు ప్రతిబింబితమైన యే చైతన్యము కలదో దానిని జీవాశ్రిత ప్రమ అంటారు.

**శిష్యుడు :** ఆ జీవాశ్రితప్రమ యెట్లెట్లు? యెన్ని విధాలు?

**గురువు :** ప్రత్యక్షాదులు ఆరు విధాలును, మరియు ప్రత్యక్షజ్ఞానంలోని విభేదాలగు **"శ్రోత్రజ త్వాచ్ చాక్షుషరాసన"** ఘ్రాణజములు అయిదు విభేదాలు, సుఖాదుల జ్ఞానము కలిసి మొత్తం పదుకొండు విభేదాలు జీవాశ్రిత ప్రమాజ్ఞాన మనబడును.

**శిష్యుడు :** ఈశ్వరాశ్రిత ప్రమాజ్ఞానము యేది?

**గురువు : "ఈ క్షణాపరపర్యాయ స్రష్టవ్య విషయాకారమాయావృత్తి ప్రతిబింబితాచిత్ ఈశ్వరాశ్రయాప్రమా"** సృష్టియొక్క ప్రారంభ సమయంలో, భవిష్యత్తులో ఉత్పన్నమయ్యే జగత్తును విషయం చేసే యేమాయయొక్క వృత్తికలదో ఆ వృత్తి శ్రుతిలో "ఈ క్షణ"మని

చెప్పబడింది. ఆ మాయావృత్తియందు ప్రతిబింబించిన యే చైతన్యమైతే కలదో దాని యీశ్వరాశ్రయప్రమ అని అంటారు.

భూత భవిష్యద్వర్తమాన రూపమైన మూడు కాలాలలోని సకల పదార్థాలను విషయం చేసే మాయావృత్తి రూపమైన యే జ్ఞానమైతే కలదో ఆ జ్ఞానాన్ని ఈశ్వరాశ్రిత ప్రమ అని అంటారు.

**శిష్యుడు :** మీరు పండ్రెండు రకాలైన ప్రమాజ్ఞానాన్ని పైన చెప్పివున్నారు కదా! ఆ రకాలలో ప్రత్యక్ష రూపమైన జ్ఞానాలు యేవి? పరోక్షరూపమైన జ్ఞానాలు యేవి?

**గురువు :** ప్రత్యక్షప్రమలో శ్రోత్రము మొదలైన భేదాలు అయిదు మాయావృత్తి రూపమైన యీశ్వరుని జ్ఞానము సుఖాది జ్ఞానమును యీ యేడును ప్రమాజ్ఞానంలో ప్రత్యక్ష రూపమయినవి.

(8) శాబ్దీప్రమ ప్రత్యక్షము పరోక్షము అనే భేదాలతో రెండు రకాలు.

(9) అభావ ప్రమకూడా ప్రత్యక్షము పరోక్షము అనే భేదాలతో రెండు రకాలు. అయినా అభావప్రమ వివాదాస్పదమయిన విషయం కాబట్టి పరోక్షమనే చెప్పబడ్తుంది. (10) అనుమితిప్రమ (11) ఉపమితిప్రమ) 12) అర్థాపత్తి ప్రమ (ఈమూడు) పరోక్ష రూపమైన ప్రమాజ్ఞానాలు.

**శిష్యుడు :** దయామూర్తీ! ఈ ప్రమాజ్ఞానం యొక్క కారణాలేవేవో చెప్పండి.

**గురువు :** నాయనా! విను. (1) జీవులయొక్క కర్మానుసారంగా జరిగే సృష్టి యొక్క ఆదికాలంలో సర్వపదార్థాలను విషయం చేసే యేజ్ఞానం యీశ్వరునకు కలదో ఆజ్ఞానం త్రికాలాలలోని సకల పదార్థాలను సామాన్య భావంతోనూ విశేష భావంతోను విషయం చేస్తుంది. అది ప్రళయ పర్యంతం స్థాయిగా వుంటుంది. మాయా వృత్తిరూపమైన అజ్ఞానము ఏకమూ నిత్యము అయి వుంది. అది యీశ్వరాశ్రితమై ప్రమాజ్ఞానము.

దానికి ఉపాదాన కారణం మాయ; నిమిత్త కారణం సర్వజీవుల అదృష్టమైవుంది.

(2) ఆయా ధర్మాదికముల నిమిత్తంతో అనుకూల ప్రతికూల పదార్థాల సంబంధంతో అంతఃకరణంలోని సత్త్వగుణ రజోగుణాల పరిణామ రూపమై సుఖదుఃఖాలు కల్గుతాయి.

సుఖదుఃఖాలకు యేది నిమిత్తమో ఆ నిమిత్తంతోనే సుఖదుఃఖాలను విషయం చేసే అంతఃకరణ వృత్తి ఉత్పన్నమౌతుంది. ఆ వృత్తియందు ఆ రూఢమైన సాక్షి చైతన్యము సుఖదుఃఖాలను ప్రకాశింపజేస్తుంది. అది జీవాశ్రిత ప్రమాజ్ఞానము.

ఆ (సుఖ దుఃఖ) జ్ఞానానికి ఉపాదాన కారణము అంతఃకరణము. నిమిత్త కారణము ఆయా ధర్మాదికాలు. 3-8 ప్రమాణజన్య యథార్థ జ్ఞానము ఆరు ప్రకారాలు, దాని యొక్క ఉపాదాన కారణము అంతఃకరణము. నిమిత్త కారణము ప్రత్యక్షాది ప్రమాణాలును యింద్రియ సంయోగాదులును.

ఈ ఎనిమిదియు, యెనిమిది విధాలైన ప్రమా జ్ఞానానికి ఉపాదాన నిమిత్త కారణాలుగా చెప్పబడ్డాయి.

అవిద్యయొక్క పరిణామరూపమైంది భ్రమాజ్ఞానము. ఆ భ్రమా జ్ఞానానికి ఉపాదాన కారణము అవిద్య, నిమిత్త కారణములు (1) సజాతీయ వస్తుజ్ఞానంతో కల్గిన సంస్కారము, (2) ప్రమాతృ దోషము, (3) ప్రమాణదోషము, (4) ప్రమేయ దోషము, (5) అధిష్ఠాన సామాన్యాంశము యొక్క జ్ఞానమును తిమిరాదికాలును.

**శిష్యుడు :** షట్ ప్రమాణాలంటే యేమిటో వాటి పేర్లలో చెప్పండి?

**గురువు :** (1) ప్రత్యక్షము, (2) అనుమానము, (3) ఉపమానము, (4) శబ్దము, (5) అర్థాపత్తి (6) అనుపలబ్ధి ఈ ఆరును ప్రమాణాలు.

**శిష్యుడు :** వాటి లక్షణాలను టూకీగా చెప్పండి?

**గురువు :** "ప్రమాకరణం ప్రమాణం" ఇంతకు ముందు జీవాశ్రిత ప్రమ అంటూ దేన్ని చెప్పారో ఆ ప్రమయొక్క యేకరణమైతే కలదో దానిని ప్రమాణమంటారు.

1. ప్రత్యక్ష ప్రమకు యేదికరణమో దానిని ప్రత్యక్ష ప్రమాణమంటారు.

2. అనుమితి ప్రమకు యేది కరణమో దానిని అనుమాన ప్రమాణమంటారు.

3. శాబ్దీ ప్రమకు యేదికరణమో దానిని శబ్దప్రమాణమంటారు.

4. ఉపమితి ప్రమకు యేది కరణమో దానిని ఉపమాన ప్రమాణమంటారు.

5. అర్థాపత్తి ప్రమకు యేది కరణమో దానిని అర్థాపత్తి ప్రమాణమంటారు.

6. అభావ ప్రమకు ఏది కారణమో దానిని అనుపలబ్ధి ప్రమాణమంటారు.

ఎన్.బి. – ప్రత్యక్ష ప్రమ మరియు ప్రత్యక్ష ప్రమాణము అట్లే అర్థాపత్తి ప్రమ మరియు అర్థాపత్తి ప్రమాణము, వీటియందు ప్రమ ప్రమాణాలకు ఒకే పేరు.

**శిష్యుడు :** గురుదేవా! ఏ ఏ మతంవారు ఏ ఏ ప్రమాణాలను అంగీకరిస్తారో వివరించండి.

**గురువు :** నాయనా! వినుము, ఆ ప్రమాణములలో

1. చార్వాక మతస్థులు ఒక్క ప్రత్యక్ష ప్రమణాన్నే అంగీకరిస్తారు.

2. వైశేషిక శాస్త్రకర్తయైన కణాదమహర్షి మతంలోను బుద్ధునికి చెందిన సౌగత మతంలోను ప్రత్యక్షము. అనుమానము ఈ రెండు ప్రమాణాలు అంగీకరింపబడ్డాయి.

3. సాంఖ్యశాస్త్రకర్తయైన కపిలమహర్షి మతంలో ప్రత్యక్షము, అనుమానము, శబ్దము అని యీ మూడు ప్రమాణాలు అంగీకరింపబడినవి.

4. న్యాయదర్శన కర్తయైన గౌతమఋషి మతంలో ప్రత్యక్షము, అనుమానము, శబ్దము ఉపమానము అని యీ నాల్గు ప్రమాణాలు అంగీకరింపబడ్డాయి.

5. పూర్వ మీ మాంసా శాస్త్రంలోని ఏక దేశిమతంభాట్ట శిష్యుడైన ప్రభాకరుని అభిప్రాయంలో ప్రత్యక్షము అనుమానము శబ్దము ఉపమానము అర్థాపత్తి అని యీ అయిదు ప్రమాణాలు అంగీకరింపబడినవి.

6. జైమిని ముని శిష్యుడైన కుమారిల భట్టుని మతంలోనూ వేదాంత గ్రంథాలలోనూ ప్రత్యక్షాది ప్రమాణాలు ఆరు అంగీకరింపబడ్డాయి.

**శిష్యుడు :** సూత్రకారులనూ భాష్యకారులును యెన్ని ప్రమాణాలను అంగీకరించారు.

**గురవు :** సూత్రకారులైన వ్యాసుల వారును. భాష్యకారులైన శ్రీ శంకరాచార్యుల వారును ప్రమాణముల సంఖ్యను చెప్పియుండలేదు. అయినను వేదాంత సిద్ధాంతానికి అవిరోధి మతమైన భట్టుని అభిప్రాయమే అద్వైత సిద్ధాంతానికినీ సమ్మతమై యున్నది.

కాబట్టి వేదాంత పరిభాషాది గ్రంథాలలో షట్ ప్రమాణాలు అంగీకరింపబడ్డాయి.

**శిష్యుడు :** ప్రమాణమనగా యేమి?

**గురువు :** (1) ప్రమాజ్ఞానానికి యేది కరణమో దానిని ప్రమాణమంటారు. ఈ లక్షణం ఇదివరకు చెప్పబడింది. మరి రెండో లక్షణం.

2. అజ్ఞాన వస్తువును జ్ఞాపకం చేసేదాన్ని ప్రమాణమంటారు. ప్రత్యక్ష ప్రమకు కరణాలు నేత్రాది యింద్రియాలు. కాబట్టి ఆ నేత్రాది యింద్రియాలకు ప్రత్యక్ష ప్రమాణమంటారు

**శిష్యుడు :** కరణానికి లక్షణమేమి?

**గురువు :** వ్యాపార యుక్తమైన అసాధారణ కారణాన్ని కరణమంటారు. లేదా వ్యాపారమునకు భిన్నమైన అసాధారణ కారణాన్ని కరణమంటారు. **"అసాధారణం కారణం కరణమ్."**

**శిష్యుడు :** కారణానికి లక్షణమేమి?

**గురువు :** కార్యానికి నియంతంగా అవ్యవహిత పూర్వకాలంలో వుండే దానిని కారణమంటారు.

**శిష్యుడు :** ఆ కారణాలు యెన్ని రకాలు?

**గురువు :** (1) సాధారణ కారణము, (2) అసాధారణ కారణము అని రెండు రకాలు.

**శిష్యుడు :** సాధారణ కారణమంటే యేమి?

**గురవు :** అన్ని కార్యాలకు యేది కారణమై వుంటుందో దానిని సాధారణ కారణమంటారు. న్యాయ మతం ప్రకారం అవి తొమ్మిది. ఈశ్వరుడు, అతని జ్ఞానము, యిచ్ఛ, కృతి, దిక్కులు, కాలము, అదృష్టము, ప్రాగభావము, ప్రతిబింభకా భావము. అనునవి తొమ్మిది.

**శిష్యుడు :** వేదాంత శాస్త్రప్రకారము సాధారణ కారణాలు యెన్ని! అవియేవి!

**గురువు :** ఈశ్వరుడు అతని జ్ఞానము యిచ్ఛకృతి అదృష్టము ప్రతిబంధకా భావము - యీ ఆరింటిని వేదాంతశాస్త్రంలో సాధారణ కారణాలుగా చెప్పుతారు.

**శిష్యుడు :** అసాధారణ కారణమని దేన్ని చెప్పుతారు?

**గురువు :** ఏదో ఒక కార్యానికి కారణమై వుండే దానిని అసాధారణ కారణమంటారు. ఎట్లనిన ఘటానికి కపాలమువలె కారణమైన వాటిని అసాధారణమంటారు.

**శిష్యుడు :** పైన చెప్పిన ఆరు ప్రమాణాలలో కరణాలు యేవి? కరణాలు కారణాలుగా రెండు విధాలుగానూ వుండేవి యేవి?

**గురువు :** ప్రత్యక్షము అనుమానము శబ్దము అనే యీ మూడు ప్రమాణాలూ వ్యాపార యుక్తమై వున్నాయి.

మరియు అసాధారణ కారణాలై వున్నాయి. కాబట్టి యీ మూడు కరణాలుగాను కారణాలుగాను అనగా రెండు విధాలుగానూ వున్నాయి.

ఉపమానము అర్థాపత్తి అనుపలబ్ధి (అభావము) అను మూడు ప్రమాణాలు వ్యాపార యుక్తమైనవి కావు. మరియు అసాధారణ కారణాలై వున్నాయి. కాబట్టి యీ మూడు కేవలం కరణాలు మాత్రం.

**శిష్యుడు :** ఈ అసాధారణ కారణాలు ఎన్ని రకాలు?

**గురువు :** ఈ అసాధారణ కారణాలు కొన్ని నిమిత్త కారణాలుగా కొన్ని ఉపాదాన కారణాలుగా రెండు రకాలుగా వున్నాయి.

**శిష్యుడు :** ఉపాదాన కారణమని దేన్ని అంటారు?

**గురువు :** దేని స్వరూపంలో కార్యము స్థితమై వుంటుందో (యేది లేక కార్య ఉత్పన్నం కాలేదో) దానిని ఉపాదాన కారణం అంటారు.

**శిష్యుడు :** నిమిత్త కారణమని దేన్ని అంటారు?

**గురువు :** ఏ కారణం, కార్యంకంటె భిన్నంగా వుండి కార్యాన్ని ఉత్పన్నంచేసి కార్యం ఉత్పన్నమైన తర్వాత యే కారణం నశిస్తే కార్యం నశించదో దానిని నిమిత్త కారణం

అంటారు. ఎట్లంటే ఘటానికి ఉపాదాన కారణం రెండు కపాలాలు (పెంకులు) కులాల దండాదికాలు నిమిత్త కారణం.

**శిష్యుడు :** ఆ అసాధారణ కారణాలు యెన్ని రకాలు?

**గురువు :** రెండు రకాలు; (1) వ్యాపారయుక్త కారణం (2) వ్యాపార రహిత కారణము అంటూ రెండు రకాలు.

**శిష్యుడు :** వ్యాపారమనగా నేమి? వ్యాపారయుక్త కారణమనగా నేమి?

**గురువు :** కారణంతో పుట్టి కార్యాన్ని కల్గించేదాన్ని వ్యాపారమంటారు. ఎట్లనిన కపాలము ఘటానికి కారణము. రెండు కపాలాల సంయోగం కూడా ఘటానికి కారణమే, అయితే, కపాలం యొక్క కారణత్వంలో సంయోగ వ్యాపారం వుంది. రెండు కపాలాల సంయోగం రెండు కపాలాల నుండి ఉత్పన్నమైంది.

ఆ సంయోగం కపాలాలను కార్యరూపమైన ఘటాన్ని ఉత్పన్నం చేస్తుంది. కాబట్టి ఆ రెండు కపాలాలు సంయోగరూప వ్యాపారం కల్గిన కారణాలు కావున వాటియందు కరణత్వము కారణత్వము రెండు లక్షణాలు ఘటించాయి.

ఏ కారణం మరొక్క సహాయంతో కార్యాన్ని కల్గించుటకాక తాను స్వయంగా కార్యాన్ని ఉత్పన్నం చేయగల్గుతుందో ఆ కారణం వ్యాపార రహిత కారణమని చెప్పబడుతుంది అట్టిదే కేవలం కారణమే కాని శరణత్వం దానికి లేదు.

రెండు కపాలాల సంయోగం (ఘటానికి) అసాధారణ కారణము. కానీ వ్యాపారయుక్త కారణం కాదు. అది కరణంకాదు. కావున అది ఘటానికి కేవలం కారణమే అగును (వ్యాపారరహిత కారణమని చెప్పబడ్తుంది.)

**శిష్యుడు :** గురుదేవా! ఈ "వ్యాపారము వ్యాపారయుక్త కారణము" అను విషయాలను ప్రత్యక్ష ప్రమతో సంబంధింపజేసి వివరించండి?

**గురువు :** నేత్రాది యింద్రియాలు ప్రత్యక్ష ప్రమకు కరణాలు, నేత్రాది యింద్రియాలకు వాటివాటి విషయాలతో సంబంధం లేకపోతే ప్రత్యక్ష ప్రమ సంభవించదు. ఆ యింద్రి యాలకు ఆయా విషయాలతో సంబంధం కల్గినప్పుడే ప్రత్యక్ష ప్రమ ఉత్పన్నమౌతుంది.

ఇంద్రియాల విషయాల సంబంధం అనేది యింద్రియాలనుండి ఉత్పన్నమై ప్రత్యక్ష ప్రమను ఉత్పన్నం చేస్తుంది. అదే వ్యాపారం. సంబంధ రూప వ్యాపారంకల ప్రత్యక్ష ప్రమకు అసాధారణ కారణాలు యింద్రియాలు, ఆ యింద్రియాలను ప్రత్యక్ష ప్రమాణాలంటారు. ఇంద్రియ జన్యయథార్థ జ్ఞానాన్ని ప్రత్యక్షప్రమ అంటారు.

**శిష్యుడు :** గురుమూర్తీ! ఈ ప్రత్యక్షప్రమను గురించి మరింత స్పష్టం చేయండి?

**గురువు :** నాయనా! "విషయచైతన్యాభిన్న ప్రమాణ చైతన్యం ప్రత్యక్ష ప్రమా" విషయ చైతన్యమునకు అభిన్నమైన యే ప్రమాణ చైతన్యం కలదో అదియే ప్రత్యక్ష ప్రమ అని చెప్పబడ్తుంది. ఇది ప్రత్యక్ష ప్రమకులక్షణము.

పైన చెప్పిన అర్థాన్ని స్పష్టం చేసేకోసం చైతన్యము యొక్క ఉపాధికృత బేధాలను నిరూపణ చేస్తాను విను.

వాస్తవానికి చైతన్యము ఒక్కటే అయినప్పటికిని ఉపాధికృత భేదంతో (1) ప్రమాతృ చైతన్యము (2) ప్రమాణ చైతన్యము 93) విషయ చైతన్యము (4) ఫల చైతన్యమంటూ నాల్గు ప్రకారాలుగా చెప్పబడ్తుంది.

1. అంతఃకరణ విశిష్టచైతన్యాన్ని ప్రమాతృ చైతన్యమంటారు. (2) అంతఃకరణము యొక్క వృత్తితో అవిచ్ఛిన్నమైన యే చైతన్యమైతే కలదో దాన్ని ప్రమాణ చైతన్యమంటారు. (3) ఘటాదిక విషయాలతో అవిచ్ఛిన్నమైన చైతన్యం విషయ చైతన్య మనబడ్తుంది. (4) ఘటాదిక విషయాలతో సమానమైన ఆకారాన్ని ధరించిన యే అంతఃకరణ వృత్తికలదో ఆ వృత్తితో అభివ్యక్తమైన చైతన్యం ఫల చైతన్యమని ప్రమా చైతన్యమని చెప్పబడ్తుంది.

ఈ విధంగా అంతఃకరణాదికాల ఉపాధిభేదంతో ఒకే చైతన్యం నాల్గు విధాలయింది.

ఈ ఉపాధులుయొక్క ప్రభావమేమంటే ఇవి భిన్నభిన్న ప్రదేశాలలో వుండేటంత వరకు స్వోపహిత చైతన్యానికి భేదాలు చూపిస్తాయి. ఆ ఉపాధులు యేక దేశస్థితాలై నప్పుడు స్వోపహిత చైతన్యానికి భేద దశలు చూపించలేవు. అభేద స్థితిలోనే వుంటుంది.

ఎట్లంటే మఠానికి వెలుపల ఘటం పెట్టితే మఠోపహిత ఆకాశము ఘటోపహిత ఆకాశము ప్రత్యేకమై భేదం గోచరిస్తుంది. కానీ ఆ ఘటాన్ని మఠంలోపలనే వుంచితే ఆ భేదం కనబడదు. రెండు అభేదమయ్యే ఉంటవి.

అట్లే (1) అతఃకరణము (2) వృత్తి (3) ఘటాది విషయాలు, యీ మూడు ఉపాధులు భిన్న భిన్న ప్రదేశాలనలో వుండేటంత వరకు చైతన్యము కూడ భిన్న భిన్నముగా (1) ప్రమాతృ చైతన్యమని (2) ప్రమాణ చైతన్యమని (3) విషయ (ప్రమేయ) చైతన్యమని మూడు విధాలుగా గోచరిస్తుంది. కానీ ఆ చైతన్యము నేత్రాది ఇంద్రియాల ద్వారా వృత్తిరూపంతో బైటకు వెళ్ళి ఘటాదిక విషయాలలో ప్రవర్తించినప్పుడు అంతఃకరణాదులైన ఉపాధులు ఏక దేశస్థితాలు కావడంతో ప్రమాత్రాది చైతన్యాలు మూడు కూడ అభేదమయ్యాయి. దానికే ప్రమా చైనత్యమన్నారు. ఈ విధంగా విషయావిచ్ఛిన్న చైతన్యానికి ప్రమాణ చైతన్యానికి కల అభేదమును ప్రత్యక్ష ప్రమ అంటారు.

**శిష్యుడు :** ఎవరి మతంలో మనస్సు యింద్రియం కాదో ఆచోట ప్రత్యక్షముయొక్క లక్షణమెట్టిది?

**గురువు :** ఆ మతంలో ఇంద్రియ జన్యతను ప్రత్యక్ష లక్షణముగా చెప్పక "విషయ చేతనంతో వృత్తి చేతనము యొక్క అభేదమే" ప్రత్యక్ష జ్ఞానముయొక్క లక్షణమని యెరుగవలెను, ఈ జ్ఞానాన్నే ప్రత్యక్ష ప్రమ అంటారు.

**శిష్యుడు :** ఈ ప్రత్యక్ష ప్రమ ఎన్ని విధాలు ?

**గురువు :** (1) అభిజ్ఞా ప్రత్యక్షమని (2) ప్రత్యభిజ్ఞా ప్రత్యక్షమని రెండు విధాలు.

**శిష్యుడు :** వాటిని వివరించండి.

**గురువు :** (1) కేవలము యింద్రియాల సంబంధంతో ఆపుట్టిన జ్ఞానాన్ని అభిజ్ఞా ప్రత్యక్ష (ప్రమ) మంటారు. (2) ప్రత్యక్షముయొక్క సామగ్రులతో కూడి పుట్టిన సంస్కార జన్యజ్ఞానాన్ని ప్రత్యభిజ్ఞా ప్రత్యక్ష (ప్రమ) మంటారు. ఎట్లనిన ఇప్పుడు నీ వద్దకు రామశంకరుడనే వ్యక్తి వచ్చినాడు అతన్ని చూడగానే వెనుకట ప్రయాగలో అతనిని చూచివుండినావు కాబట్టి ఆ పూర్వ సంస్కార జన్మజ్ఞానము ఈ ప్రత్యక్ష సామగ్రితో కలిసివచ్చింది. కాబట్టే. ఆ రామశంకరుడే వీడు అంటూ అనివేశావు. ఈ జ్ఞానంనే ప్రత్యక్ష (ప్రమ)మని అంటారు.

**శిష్యుడు** : ఈ ప్రమ అనునది ఒక్కొక్కటి యెన్ని విధాలు? ఏవేవి?

**గురువు** : ఇది ప్రతియొక్కటియు రెండు విధాలు (1) అంతర (ప్రత్యక్ష ప్రమ) (2)బాహ్య ప్రత్యక్ష ప్రమయని.

**శిష్యుడు** : అంతర ప్రత్యక్ష ప్రమ ఎన్ని విధాలు? ఏవేవి?

**గురవు** : ఆత్మగోచరమని, అనాత్మ గోచరమని అంతర ప్రత్యక్ష ప్రమ రెండు విధాలు.

**శిష్యుడు** : ఆత్మగోచర (అంతర ప్రత్యక్షప్రమ)ము యెన్ని విధాలు?

**గురువు** : శుద్ధాత్మ గోచరమని, విశిష్టాత్మ గోచరమని రెండు విధాలు.

**శిష్యుడు** : శుద్ధాత్మగోచర అంతర (ప్రత్యక్షప్రమ)ము ఎన్ని విధాలు?

**గురువు** : శుద్ధాత్మ గోచర అంతర ప్రత్యక్ష ప్రమ బ్రహ్మో గోచరమని, బ్రహ్మాగోచరమని రెండు విధాలు.

**శిష్యుడు** : బ్రహ్మాగోచర (శుద్ధాత్మ గోచర అంతర) ప్రత్యక్ష ప్రమను వివరించండి.

**గురువు** : త్వం పదార్థబోధక వేదాంత వాక్యంతో "శుద్ధ ప్రకాశోహం" అనెడి వృత్తి కల్గుతుంది. ఆ వృత్తి దేశమునందు అంతఃకరణోపహిత శుద్ధ చైతన్యమున్నది. ఆ వృత్తి అవిచ్ఛిన్న చైతన్యము విషయా విచ్ఛిన్న చైతన్యమునకు అభేదమగుట వలన ఆ వృత్తి జ్ఞానము అపరోక్షమైనది. ఆ వృత్తియొక్క విషయము చైతన్యమై యున్నది. ఆ చైతన్యము నందు బ్రహ్మరూపత్వమున్నది. కాని బ్రహ్మాకార వృత్తి ఉత్పన్నముకాదు. ఎందుకనిన ఆ వృత్తి అవాంతర వాక్యముతో ఉత్పన్నమైనదే కాని మహా వాక్యంతో ఉత్పన్నమైనదే కాని మహావాక్యంతో ఉత్పన్నముకాలేదు. మహావాక్యంతో ఉత్పన్నమైనచో వృత్తి బ్రహ్మా కారమయ్యేది. శబ్ద జన్యజ్ఞానము యొక్క స్వభావమేమంటే సన్నిహిత (అత్యంత సమీపగత) పదార్థమును యే రూపముతో శబ్ద భోధనం చేయబడ్తుందో ఆ రూపమునే శబ్ద జన్యజ్ఞానము విషయం చేస్తుంది. కాని యే రూపంతో శబ్ద బోధనం జరుగదో ఆ రూపాన్ని విషయం చేయలేదు.

దశమ పురుషుని "దశమోస్తి" (దశముడున్నాడు) అని యీ విధంగా శబ్ద బోధనం జరిగినప్పుడు "దశమోహం" (నేను దశముడును) అనే జ్ఞానము శ్రోతకు కల్గుటలేదు.

**శిష్యుడు** : స్వామీ! దశమపురుషుడుగా వుండేది తానేకదా! ఆ సమయంలో ఆత్మత్వ ముందికదా!

**గురువు** : ఆత్మత్వము (దశముడు తానైవుండుట) వుండినప్పటికిని (దశముడు నీవే అని చెప్పే) ఆత్మతాబోధక శబ్దం లేకపోవుటతో ఆ దశమునికి "దశమోహం" అనే జ్ఞానము కల్గుట లేదు. ఆ విధంగానే ఆత్మయందు బ్రహ్మరూపము సదా వుండనే వుంది. అయినను బ్రహ్మ రూపతాబోధకమైన శబ్దం లేకపోవడంతో ఆత్మయందు బ్రహ్మ రూపత్వ జ్ఞానము కల్గుట లేదు.

అందువలనపైన చెప్పిన వృత్తి, (అనగా త్వంపదార్థానికి అర్థమైన ఆత్మను విషయం చేసేవృత్తి బ్రహ్మగోచర (శుద్ధాత్మ గోచర అంతర) ప్రత్యక్ష ప్రమ అని చెప్పబడింది.

**శిష్యుడు** : వెనుక చెప్పిన మాటలలో శుద్ధాత్మ గోచర అంతర ప్రత్యక్ష ప్రమను మీరు రెండు విధాలుగా చెప్పారు. అందులో బ్రహ్మగోచర ప్రత్యక్ష ప్రమను వివరించారు. రెండవదైన బ్రహ్మగోచర అంతర ప్రత్యక్ష ప్రమ అనగా యెట్టిదో వివరించండి?

**గురువు** : మహా వాక్యజన్యమై **"అహంబ్రహ్మాస్మి"** అని చెప్పబడిన ప్రకారము బ్రహ్మమునకంటె అభిన్నమైన ఆత్మను విషయము చేసే యే ప్రమ అయితే కలదో దానినే బ్రహ్మ గోచర శుద్ధాత్మ గోచర అంతర ప్రత్యక్ష ప్రమ అంటారు.

**"అహంబ్రహ్మాస్మి"** అను యీ జ్ఞానాన్ని వాచస్పతి మిశ్రుడు మనోజన్యమన్నాడు. తక్కినవారి అభిప్రాయంలో యీ జ్ఞానము మహావాక్య జన్యము. అందులోను సంక్షేప శారీరకకారుడు మహావాక్యం ద్వారా కల్గునది బ్రహ్మము యొక్క ప్రత్యక్ష జ్ఞానమే కాని పరోక్షజ్ఞాన మెప్పుడును కాదని అంటాడు. అన్యగ్రంథకారుల మతంలో విచార సహిత మహావాక్యం ద్వారా అపరోక్ష జ్ఞానం కల్గుతుంది. విచార రహిత కేవల వాక్యంతో పరోక్ష జ్ఞానం కల్గుతుందని అభిప్రాయం.

సర్వానుమతంగా "అహంబ్రహ్మాస్మి" జ్ఞానము శుద్ధాత్మ గోచరమని బ్రహ్మ గోచరమని ప్రత్యక్షమని అంగీకరింపబడింది. ఈ అర్థంలో యెవ్వరికిని వివాదం లేదు.

**శిష్యుడు** : ఆత్మగోచర అంతర ప్రత్యక్ష ప్రమయొక్క భేదాలను మీరు వర్ణించారు. ఇక అనాత్మగోచర అంతర ప్రమయొక్క భేదాలను చెప్పండి.

**గురువు** : "మయిసుఖం మయి దుఃఖం" (నాయందు సుఖమున్నది నాయందు దుఃఖమున్నది.) అనునట్టి సుఖాది గోచరజ్ఞానం కూడ అంతర అనాత్మగోచర ప్రత్యక్ష ప్రమయై ఉంది.

నేను సుఖిని, నేను దుఃఖిని (అహంసుఖి - అహం దుఃఖి) ఇత్యాది ప్రమయందు అహంపదానికి అర్థమైన ఆత్మ విశేష్యము; సుఖ - దుఃఖాదికము విశేషణము.

"మయిసుఖం - మయిదుఃఖం" (నాయందు సుఖమున్నది; నాయందు దుఃఖమున్నది) ఇత్యాది ప్రమయందు సుఖదుఃఖాదికము విశేష్యమ - ఆత్మ విశేషణము.

అందువలన "మయిసుఖం - మయిదుఃఖం" ఇత్యాది జ్ఞానమును ఆత్మగోచర ప్రత్యక్ష ప్రమగా చెప్పలేదు. సుఖ దుఃఖాదికాలు విశేష్యం కావడంతో అనాత్మ గోచర అంతర ప్రత్యక్ష ప్రమగా చెప్పబడింది.

ఈ విధంగా అంతర ప్రత్యక్ష ప్రమయొక్క భేదాలు సరళంగా విస్తారంగా చెప్పినాను. ఈ విషయం యింతటితో చాలును. ఇక బాహ్య ప్రత్యక్ష ప్రమయొక్క భేదాలు కాని అనుమానాది అన్య ప్రమాణాలను గూర్చి కాని అప్రమావృత్తియు దాని భేదాలను (అనిర్వచనీయఖ్యాతి - సత్ ఖ్యాతి అసత్ ఖ్యాతి - ఆత్మఖ్యాతి - అన్యథాఖ్యాతి - అఖ్యాతులు) గూర్చి చెప్పుట ప్రస్తుతానికి వదలి వేస్తున్నాను.

**శిష్యుడు** : మహాప్రభూ! ఆలాగే కానివ్వండి. స్వామీ! తామింత వరకు వృత్తిని గురించి నిరూపించినారు. దాని ఫలమేమిటో శ్రవణం చేయాలని జిజ్ఞాసకలదు. సెలవియ్యండి.

**గురువు** : శిష్యా! పైన చెప్పిన వృత్తిరూపజ్ఞానాన్ని శ్రవణం చేస్తే కలిగే ప్రయోజనం వినుము.

(1) జీవుని మూడు అవస్థలతోడి సంబంధము వృత్తితోనే కల్గుచున్నది.

(2) పురుషార్థ మోక్షము యొక్క ప్రాప్తి కూడ వృత్తితోనే అగుచున్నది అందువలన.

(౨) వృత్తియే సంసారప్రాప్తికి హేతువు.

(బి) వృత్తియే మోక్షప్రాప్తికి కూడ హేతువైవుంది. ఎందుకనిన మూడు అవస్థల సంబంధంతోనే జీవునికి సంసారం కల్గుతుంది. అవస్థా శబ్దంతో యిక్కడ "కాలము"ను గుర్తించాలె.

**శిష్యుడు :** ఆ వృత్తియొక్క మూడు అవస్థలను దాని స్వరూపాన్ని తెల్పండి?

**గురువు :** జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి, యీ మూడు వృత్తి యొక్క అవస్థలు.

1. స్వప్నావస్థకు సుషుప్త్యవస్థకూభిన్నమై యేది ఇంద్రియ జన్యజ్ఞానానికి యింద్రియ జన్యజ్ఞాన సంస్కారాలకు ఆధారమైన కాలమో దానిని జాగ్రదవస్థ అంటారు.

(ఎ) సుఖాది జ్ఞానకాలంలోను ఉదాసీన కాలంలోను ఇంద్రియ జన్యజ్ఞానంలేదు. కాని దాని సంస్కారం ఉంది.

(బి) అట్లే స్వప్నావస్థలోను సుషుప్త్యవస్థలోను యింద్రియ జన్యజ్ఞాన సంస్కారాలున్నాయి. అందువలన, జాగ్రదవస్థను స్వప్నసుషుప్త్యవస్థలకు భిన్నమైన కాలంగా చెప్పినారు.

ఈ ప్రకారం జాగ్రదవస్థ దాని వ్యవహారం యింద్రియ జన్యజ్ఞానానికి అధీనమైవుంది. ఈ యింద్రియ జన్యజ్ఞానము అంతఃకరణము యొక్క వృత్తి రూపమైవుంది.

కొందరు ఈ అంతఃకరణవృత్తి యొక్క ప్రయోజనము **"ఆవరణనివృత్తి"**యని సంభావిస్తారు.

మరికొందరు ప్రకాశమునకు హేతువైన ప్రమాతతో విషయాల సంబంధమే వృత్తియొక్క ప్రయోజనమని అంటారు.

పైన చెప్పిన ప్రయోజనాలు కల్గిన యింద్రియ జన్య అంతఃకరణ యొక్క వృత్తి జాగ్రదవస్థలో వుంది.

2. ఇంద్రియ జన్యంకాక విషయగోచర అంతఃకరణము యొక్క అపరోక్ష వృత్తికల్గిన అవస్థను స్వప్నావస్థ అంటారు. స్వప్నావస్థలో జ్ఞేయము, జ్ఞానము అంతఃకరణముయొక్క పరిణామాలు.

3. సుఖ గోచరము, అవిద్యా గోచరము అయి అజ్ఞానముయొక్క సాక్షాత్ పరిణామ రూపమైన వృత్తియొక్క అవస్థను సుషుప్త్యవస్థ అంటారు. సుషుప్త్యవస్థయందు అవిద్యయొక్క వృత్తి సుఖగోచరము, అజ్ఞాన గోచరము అయి వుంటుంది.

**శిష్యుడు :** జాగ్రదవస్థయందు కూడా **"అహం న జానామి"** (నేను ఏమి తెలియుట లేదు) అను అవిద్యా గోచరవృత్తి వుంది కదా!

**గురువు :** అది అంతకరణ వృత్తికాని అవిద్యా వృత్తికాదు. ఆ విధంగానే జాగ్రదవస్థ లోని ప్రాతిభాసిక రజతాకారణము అవిద్యయెక్క పరిణామమేకాని ఆ వృత్తి అవిద్యా గోచారం కాదు; మరియు,

జాగ్రదవస్థయందు సుఖాకార వృత్తివుంది. అది అంతఃకరణ వృత్తేకాని పరిణామం కాదు.

ఈ విధంగా సుషుస్త్యవస్థయందు అవిద్యా వృత్తిని ఆరోహించిన సాక్షి. అవిద్యనూ స్వరూప సుఖాన్నీ ప్రకాశింపజేస్తుంది. సుషుప్తిలో అసుఖాకారమైన అవిద్యయొక్క పరిణామము అజ్ఞానము యొక్క అంశము. ఆ అజ్ఞానాంశమునందు ఆ సమయంలో ఆ సుషుప్తి పొందేవాని అంతఃకరణము లీనమై పోయింది. ఆ అజ్ఞానాంశము జాగ్రదవస్థలో అంతఃకరణ రూపాన్ని ధరిస్తుంది. సుషుప్త్యవస్థలో, అజ్ఞాన వృత్తితో అనుభవించిన సుఖాన్ని జాగ్రదవస్థలో స్మరణకు వస్తుంది. ఉపాదాన కారణానికి దాని కార్యానికి భేదంలేదు. కాబట్టి అనుభవానికి స్మరణకు వ్యధికరణం (అనగా భిన్నాధి కరణము) లేదు.

ఈ విధంగా మూడు అవస్థలున్నాయి.

**శిష్యుడు :** మరణాన్ని మూర్చావస్థను దేనియందు లెక్కించాలె?

**గురువు :** కొందరు సుషుప్త్యవస్థలోనికి గణిస్తారు. మరికొందరు సుషుప్తికి భిన్నంగా తలుస్తారు. ఈ అవస్థల యొక్క భేదం వృత్తికి అధీనమైవుంది.

**శిష్యుడు :** వృత్తికి అధీనమైవున్న దన్నమాటను వివరించండి?

**గురువు :** జాగ్రత్తయందు స్వప్నమునందు అంతఃకరణ వృత్తివుంది.

(1) జాగ్రదవస్థలో యింద్రియ జన్య అంతఃకరణ వృత్తియు (2) స్వప్నావస్థయందు ఇంద్రియ అజన్య అంతఃకరణ వృత్తియు, (3) సుషుప్త్యవస్థయందు అజ్ఞాన వృత్తియు ఉంది.

**శిష్యుడు :** వృత్తిజ్ఞానంయొక్క ప్రయోజనాన్ని సంక్షేపంగా నిరూపించండి?

**గురువు :** (1) ఈ మూడు అవస్థలయొక్క అభిమానమే బంధము. ఈ అభిమానమే భ్రమాజ్ఞానము. అది కూడా వృత్తి విశేషమే. ఈ విధంగా వృత్తి కృత బంధమే సంసార మనబడింది.

(2) ఎప్పుడు వేదాంత వాక్యశ్రవణం ద్వారా **"అహం బ్రహ్మాస్మి"** యనెడి అంతః కరణ వృత్తి కల్గుతుందో దానితో (కార్యరూప) ప్రపంచ సహిత (కారణ) అజ్ఞాన నివృత్తి కల్గుతుంది. దానినే మోక్షమంటారు.

ఈ విధంగా సంసార దశలో వృత్తియొక్క ప్రయోజనము వ్యవహారము సిద్ధించుటే అయినను వృత్తియొక్క పరమ ప్రయోజనము మోక్షమే.

**జీవబ్రహ్మలయొక్క అభేదసాధక, భేద బాధక యుక్తులు**

**శిష్యుడు :** జీవబ్రహ్మల యొక్క అభేద సాధక యుక్తులను తెల్పండి?

**గురువు :** అబ్బాయి! ప్రత్యక్ష ప్రమాణం కానీ శబ్ద ప్రమాణం కానీ మనస్సుకు సమాధానం కల్గించలేకపోతే యితర విధమైన యుక్తులను ఉపయోగించుకోవలసి ఉంటుంది. జీవబ్రహ్మల యొక్క అభేదము ప్రత్యక్ష ప్రమాణంతోను శబ్ద ప్రమాణంతోను తెలియబడటంలేదు. ఆ రెండు ప్రమాణాలకు భిన్నమైన (ఎ) అనుమాన ప్రమాణము, (బి) ఉపమాన ప్రమాణము, (సి) అర్థాపత్తిప్రమాణము యీ మూడు రకాలైన యుక్తులతో తెలియబడ్తుంది.

(ఎ) మొదట అనుమాన ప్రమాణరూపమైన యుక్తిని చెప్పుచున్నాను.

జీవఃబ్రహ్మాభిన్నః = జీవుడు బ్రహ్మమునకు అభిన్నుడు.

సచ్చిదానంద లక్షణత్వాత్ = సచ్చిదానందరూపుడు కావడంతో

బ్రహ్మసత్ = ఈశ్వర చేతనమువలె.

ఏదేది సచ్చిదానంద రూపమో అది బ్రహ్మమునకు అభిన్నమే, ఎట్లంటే -

1. బ్రహ్మము సచ్చిదానంద రూపం కావడంతో బ్రహ్మమునకు అభిన్నమైంది. అట్లే జీవుడు సచ్చిదానంద రూపుడు కావడంతో బ్రహ్మమున కంటె అభిన్నుడై యున్నాడు.

2. సచ్చిదానంద స్వరూపము కాని వస్తువు బ్రహ్మమునకు అభిన్నము కాబోదు. ఘటమువలె, అది సచ్చిదానంద రూపముకాదు. కావున ఆ ఘటము బ్రహ్మమునకు అభిన్నము కాదు.

ఈ జీవుడు ఘటమువంటి వాడుకాదు కాబట్టి బ్రహ్మమునకు భిన్నుడు కాదు అభిన్నుడే ఈ అనుమాన ప్రమాణంలో 1. జీవుడు పక్షము 2. జీవునకు బ్రహ్మముతో అభేదము సాధ్యము (పక్షము సాధ్యము యీ రెండును యే వాక్యములో ఉంటవో అది ప్రతిజ్ఞా వాక్యము) 3. సచ్చిదానంద రూపత్వము హేతువు 4. ఈశ్వరచేతనము (బ్రహ్మము) అన్వయము ఘటము వ్యతిరేకము. ఇది ఉదాహరణము (దృష్టాంతము) ఈ విధంగా అనుమాన ప్రమాణ రూపయుక్తి చెప్పబడింది.

(బి) ఇక ఉపమాన ప్రమాణ రూపయుక్తి చెప్పబడ్తుంది.

1. ఘటోపాధిని మఠోపాధిని దూరంచేస్తే ఘటాకాశ, మహాకాశాలంటే యెలాగా అభేదమో, అట్లే బుద్ధి అనే ఉపాధిని, మాయ అనే ఉపాధిని దూరం చేస్తే జీవునికి బ్రహ్మమునకు అభేదం కల్గింది.

2. ఘటాకాశము, జలాకాశము, మేఘాకాశము, మహాకాశము అని ఆకాశము నాల్గు విధాలు. వాటిలో జలాకాశ మేఘాకాశాలకు అభేదం కుదరదు. ఘటాకాశ, మహాకాశాలకు ఉండే భేదం నామ మాత్రమేకాని వాస్తవం కాదు. కాబట్టి ఆ భేదం సిద్ధిస్తుంది. ఆ విధంగానే

కూటస్థుడు, జీవుడు, ఈశ్వరుడు, బ్రహ్మము ఈ నాల్గును చేతన వస్తువులు, వాటిలో జీవునికి, ఈశ్వరునికి అభేదం కుదరదు. అయినను వాటికి అధిష్ఠానమును లక్ష్యార్థమును

అయిన కూటస్థునికి, బ్రహ్మమునకును అభేదం కుదురుతుంది. వాటికి కల భేదము నామ మాత్రమే కాని వాస్తవం కాదు.

(సి) ఇక అర్థాపత్తి ప్రమాణ రూపమైన యుక్తి చెప్పబడ్తుంది.

**"నేహ నా నాస్తికించన"** యీ మొదలగు శ్రుతులలో భేదము నిషేధింపబడింది. ఆ నిషేధము అభేదము వాస్తవమైనప్పుడే సిద్ధిస్తుంది. అభేదము నిజం కాకపోతే ఆ భేద నిషేధ వాక్యానికి అర్థం లేకుండాపోతుంది. నానాత్వము యొక్క అనుపపత్తిని సూచించి భేదాన్ని నిషేధించిన అర్థాపత్తి ప్రమాణంతో జీవబ్రహ్మముల యొక్క అభేద జ్ఞానం కల్గింది. ఇదియే అర్థాపత్తి ప్రమాణము.

**శిష్యుడు :** భగవంతా! జీవబ్రహ్మముల యొక్క భేద బాధక యుక్తులను సవిస్తరంగా తెల్పండి?

**గురువు :** నాయనా! ఈ భేద - బాధక యుక్తులను కూడా (ఎ) అనుమాన ప్రమాణము, (బి) ఉపమాన ప్రమాణము, (సి) అర్థాపత్తి ప్రమాణము (డి) అనుపలబ్ధి ప్రమాణముల ద్వారా నిరూపిస్తాను. విను.

(ఎ) మొదట అనుమాన ప్రమాణ రూప యుక్తిని నిరూపిస్తాను. జీవబ్రహ్మల యొక్క భేదం మిథ్యామాత్రము. (ప్రతిజ్ఞా వాక్యము, పక్షము + సాధ్యము.)

ఎందుకనిన - ఉపాధి కృతం కావడంతో (హేతువు లింగము) ఘటాకాశ, మహాకాశముల భేదమువలె (మొదటి ఉదాహరణ వాక్యము).

ఏది మిథ్యకాదో అది ఉపాధి కృతం అయి వుండదు. యెట్లనిన ఘట పటముల వ్యవహార దశ మిథ్యకాదు. ఆ భేదము ఉపాధి కృతంకాదు. కాబట్టి మిథ్యకాదు, నిజమే (రెండవ ఉదాహరణ వాక్యము.)

ఈ జీవ బ్రహ్మముల భేదము అట్టిదికాదు, (ఉపనయన వాక్యము.) కాబట్టి మిథ్య కాదని చెప్పే వీలులేదు; మిథ్యయే, (నిగమన వాక్యము)

(బి) ఒక ఉపమాన ప్రమాణ రూపయుక్తి చెప్పబడ్తుంది. (1) ఏ విధంగా బింబ ప్రతిబింబాల యొక్క భేదము మిథ్యయో ఆ విధంగా జీవ బ్రహ్మలయొక్క భేదము

మిథ్యయై యుంది.

2. ఏ విధంగా స్వప్నములోని జీవులయొక్క స్వప్న గతాలైన ఘటాదికాల యొక్క భేదము మిథ్యయో ఆ విధంగా జీవ జడములయొక్క భేదము మిథ్యయై యుంది.

3. ఏ విధంగా అనేక ఘటాకాలయొక్క పరస్పర భేదం మిథ్యయో ఆ విధంగా జీవులయొక్క పరస్పర భేదం మిథ్యయై యుంది.

4. రజ్జువునకు రజ్జువునందు కల్పింపబడిన సర్పమునకును కల భేదమెట్లు మిథ్యయో, సాక్షి చేతనమునకు స్వప్న ప్రపంచమునకును కల భేదమెట్లు మిథ్యయో ఆ విధంగానే జడ జగత్తునకు, ఈశ్వరునకును కల భేదము మిథ్యయై యున్నది.

5. రజ్జువునందు కల్పింపబడిన సర్ప – దండ – జలధారాదికముల భేదమెట్లు మిథ్యయో స్వప్న పదార్థాల పరస్పర భేదమెట్లు మిథ్యయో అట్లే జడపదార్థాల యొక్క పరస్పర భేదం సైతం మిథ్యయై యుంది.

(సి) ఇక అర్థాపత్తి ప్రమాణ రూపమైన యుక్తి చెప్పబడ్తుంది. మహా వాక్యంలో జీవబ్రహ్మలకు అభేదం చెప్పబడింది. ఈ కనబడే భేదానికి మిథ్యాత్వం యేర్పడినప్పుడే ఆ అభేదం సిద్ధిస్తుంది. ఈ విధంగా ఊహించి జీవబ్రహ్మల భేదం మిథ్యయని నిశ్చయించాలె.

(డి) అనుపలబ్ధి ప్రమాణ రూపమైన యుక్తి చెప్పబడ్తుంది. జాగ్రదవస్థలో వృత్తి ఉపాధిని ఆశ్రయించి జీవునికిని, బ్రహ్మమునకు భేదం గోచరిస్తుంది. సుషుప్త్యవస్థలో ఉపాధి లేకపోవడంతో భేదం భాసించటంలేదు. దీన్ని బట్టి జీవునికి బ్రహ్మానికి వాస్తవంగా (పారమార్థికంగా) భేదం లేదనియే నిశ్చయించుకోవాలె.

**శిష్యుడు :** అనుమాన ప్రమాణాన్ని గురించి తాము పైన చెప్పివున్నారు. ఆ ప్రమాణంతో అనుమితి ప్రమ యేర్పడుతుంది. ఆ అనుమితి ప్రమ యెన్ని విధాలు? వాటి స్వరూపమెట్టిది?

**గురువు :** ఆ అనుమితి ప్రమ (1) స్వార్థానుమితి ప్రమ. (2) పరార్థానుమితి ప్రమ అని రెండు విధాలు?

ఈ పురుషునికి మరొక్కని బోధతో పనిలేక వ్యాప్తిజ్ఞాన లింగజ్ఞానాల ద్వారా యే అనుమతి కల్గుతుందో అది స్వార్థానుమితి ప్రమయని చెప్పబడుతుంది.

ఏ పురుషుడు వ్యాప్తి లింగజ్ఞానాదుల ద్వారా పర్వతంలో అగ్నిని స్వయంగా నిశ్చయించి మరొక్కనికి ఆ అగ్నిని తెలియపరిస్తే అది పరార్థానుమితి ప్రమయని చెప్పబడుతుంది.

**శిష్యుడు :** వ్యాప్తి శబ్దాన్ని దృష్టాంతం చెప్పి వివరించండి?

**గురువు :** ఎక్కడెక్కడ పొగ వున్నదో అక్కడక్కడ అగ్ని వున్నది. ఆ పొగ, అగ్ని, రెండు కలిసి ఉండేవి అనే జ్ఞానం ప్రతి వానికి తమతమ వంట యింద్లలో అనుభవమై వుంది.

1. అగ్నికి పొగ యందు వ్యాప్తి. అగ్ని పొగయందు వ్యాపకము పొగ వ్యాప్యము. అట్లే 2. నేతికి పాలయందు వ్యాప్తి.

నేయి పాలలో వ్యాపకము, పాలు వ్యాప్యము.

**శిష్యుడు :** జీవుడు సచ్చిదానంద స్వరూపునుడు కావడంలో బ్రహ్మముతో అతనికి సదా అభేదమని చెప్పితిరి. జీవునికి సచ్చిదానందత్వము యే ప్రమాణంతో సిద్ధము కాగలదు?

**గురువు :** శ్రుతి, స్మృతి, యుక్తి, అనుభవము - అను ఈ నాల్గింటి ద్వారా జీవుడు సచ్చిదానంద స్వరూపుడను మాటను వివరిస్తాను విను.

(1) జీవుడు సద్రూపుడు. ఈ విషయంలో (1) శృతి ప్రమాణము **"అవినాశీవా అరే అయమాత్మా, సన్మాత్రోనిత్యః శుద్ధః బుద్ధః"** ఓ మైత్రేయీ! ఈ ఆత్మ నాశరహితము, సత్తా మాత్రము నిత్యము, శుద్ధము, బుద్ధము (జ్ఞాన స్వరూపము) అయివుంది.

(2) స్మృతి ప్రమాణము : **"నిత్యస్సర్వగతః స్థాణు రచలోయం సనాతనః"** ఈ ఆత్మ నిత్యము; సర్వత్ర వ్యాపకము; కూటస్థము; అచలము; సనాతనము అయివుంది.

(3) యుక్తి ప్రమాణము : జీవుడు సత్యము కాకపోయినచో కృతప్రణాశ, అకృతా భాగ్యమదోషాలు సంభవిస్తాయి.

జీవుడు చేసిన పుణ్యపాపకర్మలు ఫలభోగము లేకనే నశించిన దానిని కృతప్రణాశ దోషమంటారు. పూర్వము చేయని కర్మల యొక్క ఫలాన్ని అనుభవించుట అకృతా భాగ్యమదోషమంటారు.

(4) అనుభవ ప్రమాణము : "అహమస్మి" (నేనున్నాను) అను ఈ విధమగు అనుభవము అందరికిని వుంది. దీనిని బట్టి జీవుడు సత్యరూపుడనుట సిద్ధిస్తుంది.

1. ఈ విధంగా జీవుని సద్రూపుడు.

2. జీవుడు చిద్రూపుడు (చేతనరూపుడు) ఈ విషయంలో.

**(1) శ్రుతి ప్రమాణము : "అత్రాయం పురుషః స్వయంజ్యోతిర్భవతి"** ఈ స్వప్నావస్థలో ఈ ఆత్మ స్వయంజ్యోతి. స్వప్నావస్థలో సూర్యుడు. చంద్రుడు మొదలైన జ్యోతులు లేక పోయినప్పటికిని ఆత్మ అనే జ్యోతి ద్వారానే వ్యవహారమంతా జరుగుతుంది. **"ఆత్మైవాస్య జ్యోతిర్భవతి"** ఈ సంఘాతమునకు జ్యోతి ఆత్మయే" **యోయం విజ్ఞానమయః"** ఈ ఆత్మ విజ్ఞానరూపము.

**శ్లో॥ త్రిషుధామసు యద్భోజ్యం భోక్తాభోగం చ యద్భవేత్**
**తేభ్యో విలక్షణస్సాక్షీ చిన్మాత్రోహం సదా శివః॥**

జాగ్రత్ స్వప్న సుషుప్తులను మూడు అవస్థలలో వరుసగా విశ్వతైజన ప్రాజ్ఞులు ఈ ముగ్గురు భోక్తలు. వారికి స్థూల సూక్ష్మాదికములైన భోగ్య పదార్థములు మరియు అంతః కరణము యొక్క, అజ్ఞానము యొక్క వృత్తిరూపమైన భోగము; ఈ అన్నిటికిని విలక్షణమై చైతన్యరూపమైన యే సాక్షి కలదో ఆ సదాశివ రూపుడను నేనే.

(2) స్మృతి ప్రమాణము :

**శ్లో॥ యథా ప్రకాశయత్యేకః కృత్స్నంలోక మిమంరవిః**
**క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత॥**

ఓ అర్జునా! ఏ విధంగా ఒక సూర్యుడు సమస్త లోకాన్ని ప్రకాశింపజేస్తున్నాడో ఆ విధంగా ఈ ఆత్మ సంపూర్ణమైన సంఘాతాన్ని ప్రకాశింపజేస్తుంది. (గీత 13 అధ్యా-33 శ్లో॥)

**(3) యుక్తి ప్రమాణము :** ఈ ఆత్మ చేతన రూపము కానిచో ప్రకాశము లేమిచే జగత్తునకు అంధత్వము ప్రాప్తిస్తుంది.

**(4) అనుభవ ప్రమాణము :** "అహం అనుభవామి" నేను అనుభవించుచున్నాను. అని ఈ ప్రకారమైన అనుభవంతో ఆత్మకు చైతన్య రూపత్వము సిద్ధిస్తుంది. కాబట్టి జీవుడు చిద్రూపుడు.

**3. జీవుడు ఆనంద స్వరూపుడు :** ఎట్లనగా శ్రుతి ప్రమాణము. **"యోవైభూమాతత్సుఖమ్"** దేశకాలవస్తు పరిచ్ఛేద రహితమైన ఆత్మ సుఖస్వరూపమైవుంది. **"కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందో నస్యాత్"** ఈ ఆత్మ ఆనంద రూపుడు కానిచో అపానము యొక్క, ప్రాణముయొక్క దేహేంద్రియాలయొక్క వ్యాపారములను జరుపువాడెవ్వడు; ఎవ్వడూ లేడని అర్థము. **"ఏషహ్యేవానందయతి"** కారణమేమంటే లోకముయొక్క జీవనము ఆనందపూర్వకమై వుంది. (అతిశయ దుఃఖం ప్రాప్తిస్తే ప్రాణాల వియోగమే జరుగుతుంది.)

(2) **"యోంత స్సుఖోంతరారామః తథాంతర్జ్యోతి రేవచ"** అంతరానంద స్వరూపుడు ఆ రామ స్వరూపుడు జ్యోతిస్వరూపుడు.

(3) యుక్తి ప్రమాణము : ఆత్మ ఆనందస్వరూపుడు. కానిచో యెవ్వనికి తనయందు తనకు పరమప్రీతి కల్గకపోయి వుండేది. తనయందు తనకు ప్రతి వానికిని పరమప్రీతి ఉండనే వుంది.

(4) అనుభవ ప్రమాణము : సుషుప్తినుండి లేస్తూనే ప్రతివాడు "నేను సుఖంగా వుండినాను" అని స్మరిస్తూన్నాడు. అట్టి స్మరణ అనుభవించని వస్తువును గురించి యెప్పుడు కల్గదు. దీన్నిబట్టి సుషుప్తిలో సుఖానుభవాన్ని ఊహించవచ్చును. సుషుప్తిలో విషయ జన్యమైన ఆనందమేదియు లేశంకూడా లేదుకదా! అదిస్వరూప సంబంధమైన ఆనందమే.

కాబట్టి ఈ జీవుడు ఆనందరూపుడు. ఈ విధంగా శ్రుతి, స్మృతి, యుక్తి అనుభవాల ద్వారా జీవాత్మ సచ్చిదానంద స్వరూపుడని సిద్ధమైంది.

ఈ విధంగా (1) శ్రుతి, (2) స్మృతి, (3) యుక్తి, (4) అనుభవాల ద్వారా ఈ నాల్గు ప్రమాణాల ద్వారా ఈ జీవాత్ముడు సచ్చిదానంద స్వరూపుడనే విషయాన్ని నిరూపించాము.

**శిష్యుడు :** మహానుభావా! మీరింత వరకు జీవబ్రహ్మలయొక్క అభేదసాధక యుక్తులు భేద బాధక యుక్తులు చెప్పారు. మరియు జీవుడు సచ్చిదానంద రూపుడే అంటూ నిరూపించారు. ఈ విచారం చేయడంలో అధికారి పురుషునికి యేమి ఫలం లభిస్తుంది?

**గురువు :** పై చెప్పిన యుక్తుల ప్రకారం అధికారి పురుషుడు విచారం సాగిస్తాడు. అట్టివానికి శ్రోత్రియ బ్రహ్మ నిష్ఠుడైన సద్గురువు ద్వారా తత్త్వమస్యాది మహా వాక్యోపదేశం జరుగుతుంది. అనంతరం భాగత్యాగ లక్షణం ద్వారా మాయనూ అంతఃకరణాదిక వాచ్యభాగాన్ని పరిత్యాగంచేసి అఖండ బ్రహ్మం యొక్క దృఢ జ్ఞానాన్ని పొందుతాడు. అనగా "అహం బ్రహ్మాస్మి బ్రహ్మైవాహమస్మి" (నేను బ్రహ్మస్వరూపము - బ్రహ్మ స్వరూపము నేను) అనెడి పరస్పరాభేద విషయక అపరోక్ష జ్ఞానాన్ని పొందుతాడు.

**శిష్యుడు :** "అహంబ్రహ్మాస్మి - బ్రహ్మైవాహమస్మి" అని రెండు వాక్యాలు చెప్పడంలో స్వారస్యమేమిటో తెల్పండి?

**గురువు :** "అహం బ్రహ్మాస్మి" అనే వృత్తి, అహం పదానికి అర్థమైన ప్రత్యగాత్మతో బ్రహ్మము యొక్క అభేదాన్ని తెల్పుతుంది. మరియు "బ్రహ్మైవాహమస్మి" అనే వృత్తి బ్రహ్మముతో ప్రత్యగాత్మ యొక్క అభేదాన్ని తెల్పుతుంది. మరియు

అహం పదము యొక్క అర్థమైన ప్రత్యక్చేనతము అందరికి అపరోక్షమై అనాత్మగా తలంపబడ్తుంది. ఎప్పుడైతే ప్రత్యగాత్మతో బ్రహ్మముయొక్క అభేదాన్ని తెలిపే "అహం బ్రహ్మాస్మి" అనెడి అపరోక్ష జ్ఞానం కల్గుతుందో, అజ్ఞానాకార వృత్తిలో బ్రహ్మము యొక్క 1. పరోక్షత్వమూ, 2. అనాత్మత్వము నివారించబడింది.

ఈ ప్రత్యగాత్మ (జీవాత్మ)ను లోకులు పరిచ్ఛిన్నంగాను అబ్రహ్మ రూపంగాను తలుస్తున్నారు. ఎప్పుడైతే బ్రహ్మముతో జీవాత్మ యొక్క అభేదాన్ని తెలిపే "బ్రహ్మైవాహ మస్మి" అను అపరోక్ష జ్ఞానాకార వృత్తికల్గుతుందో అజ్ఞానంతో జీవాత్మ యొక్క 1.పరిచ్ఛిన్న త్వము, 2. అబ్రహ్మత్వము నివర్తిస్తాము.

ఈ విధంగా అధికారి పురుషునకు బ్రహ్మ సంబంధంగా వుండే పరోక్షత్వము, అనాత్మత్వము తన ప్రత్యగాత్మ సంబంధంగా వుండే పరిచ్ఛిన్నత్వము, అబ్రహ్మత్వము, ఈ ఉభయ విధాలైన భ్రమలు నివర్తి అయ్యేకోసం, **"అహంబ్రహ్మాస్మి'-బ్రహ్మైవాహమస్మి"** అని యీ విధంగా ఆత్మబ్రహ్మల యొక్క పరస్పర అభేదాన్ని నిశ్చయించుకోవాలె. (దీని వివరం 12 గోష్టిలో పఠించొచ్చు.)

**శిష్యుడు:** ఈ ప్రకారంగా ఆత్మబ్రహ్మలయొక్క పరస్పర అభేద నిశ్చయంతో కలిగే ఫలితమేమి?

**గురువు :** ఈ విధంగా తత్త్వమస్యాది మహావాక్య జన్యమై అఖండ బ్రహ్మాకార అపరోక్షవృత్తి కల్గుతుంది. ఆ వృత్తిరూప జ్ఞానంతో, (1) కార్యప్రపంచ సహిత అజ్ఞాన రూప అనర్ధ నివృత్తి మరియు, (2) ప్రత్యగాత్మయొక్క అఖండైకర బ్రహ్మానంద రూప స్థితి కల్గుతుంది. ఈ విషయంలో శ్రుతులు **"తరతి శోకమాత్మవిత్"** ఆత్మ సాక్షాత్కారం పొందిన పురుషుడు అనర్ధరూప శోక సంసారాన్ని తరిస్తాడు **"బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి"** బ్రహ్మమును ఆత్మ స్వరూపంగా యెరిగిన పండితుడు బ్రహ్మమే అవుచున్నాడంట్గూ అనేక విధాల బహ్మవేత్తకు బ్రహ్మ సాక్షాత్కారం ద్వారా (1) అజ్ఞాన నివృత్తి, (2) బ్రహ్మానంద ప్రాప్తిరూప ఫలాలు వర్ణించబడినాయి. ఓం తత్ సత్.

**శ్లో॥ నిశాంతేచ పిబేద్వారి, దినాంతేచ పిబేత్పయః।**
**భోజనాన్తే పిబేత్తక్రం, వైద్యస్య కిం ప్రయోజనమ్॥**

తా॥ తెల్లవారు జామున చల్లని నీటిని త్రాగవలయును రాత్రియందు పాలను త్రాగవలయును. భోజనం తర్వాత మజ్జిగను త్రాగవలయును. ఇట్లు చేసినచో వైద్యుడు అవసరంలేదు.

**శ్లో॥ రకారో హేతువైరాగ్యం, పరమం యచ్చకథ్యతే।**
**అకారో జ్ఞాన హేతుశ్చ, మకారో భక్తి హేతుకమ్॥**

తా॥ పరమ మహత్తు కలిగిన రామ నామంలోని 'ర'కారం వైరాగ్యానికి హేతువనీ, 'అ'కారం జ్ఞానానికి, 'మ'కారం భక్తికి హేతువైనదనీ తెలియవలయును.



# వేదాంత గోష్ఠి

## పరిశిష్టం - రెండు
## (కొన్ని కఠిన శబ్దాలకు వివరణము)

**అలౌకికము** - శాస్త్రముయొక్క ఆజ్ఞతో పనిలేక కేవలం తన యిచ్ఛతో జరిగేతిండి తీర్థాలు లౌకికాలని చెప్పబడ్డాయి. లౌకిక వ్యవహారానికి భిన్నమైనవి అలౌకికాలు.

**అవిగీత** - ఏ ఆచారము నరకాది అనిష్టాలను కలిగించక స్వర్గాది రూపమైన యిష్టాలకు సాధనమై వుంటుందో ఆ ఆచారము అవిగీత అని చెప్పబడ్తుంది.

**అవ్యుత్పన్న పురుషుడు** - ఫలానా శబ్దానికి ఫలానా అర్థము అనే జ్ఞానం యెవ్వనికి వుండదో అట్టి వానిని "అవ్యుత్పన్ను"డని అంటారు.

**ఆపాత జ్ఞానము** - అజ్ఞానాన్ని పోగొట్టేందుకు సమర్థంకాని జ్ఞానాన్ని ఆపాత జ్ఞానమంటారు.

**ఈశ్వర ప్రణిధానము** - (1) ప్రణవము అనగా ఓంకారము ఆ ప్రణవము ఈశ్వర వాచకము. ఆప్రణవాన్ని జపంచేస్తూ మాండూక్యోపనిషత్తులోనూ, పంచీకరణ వార్తికంలోనూ చెప్పబడినట్లు ప్రణవార్థాన్ని చింతనం చేయుట ఈశ్వర ప్రణిధానమంటారు. (2) జీవబ్రహ్మలయొక్క యేకత్వరూపమైన ప్రణవాన్ని అర్థంతో చింతన చేయుట కూడా ఈశ్వర ప్రణిధానమంటారు.

**ఉత్తమ పురుషుడు** - జీవబ్రహ్మలయొక్క అభేద స్వరూపాన్ని శ్రుతి దేవత "ఉత్తమ పురుష"డనే పేరుతో చెప్పింది.

**గ్రంథత్రయము** - (1) ప్రకరణ గ్రంథాలు = అద్వైత సిద్ధాంతముయొక్క అగత్యమైన విషయాలను అవసరమైన ప్రమాణాలతో యుక్తులతో, ఉపదేశించే గ్రంథాలు. ఉదాహరణ

వివేక చూడామణి. (2) ప్రమేయ గ్రంథాలు = అద్వైత సిద్ధాంతంలోని అన్ని విషయాలను పుష్కలమైన ప్రమాణాలతో నానావిధ యుక్తులతో ఉపదేశించే గ్రంథాలు. ఉదా॥ శాంకర భాష్యం సహితంగా ఉపనిషత్తులు గీత, బ్రహ్మసూత్రాలు. (3) ఆకర గ్రంథాలు = భేదవాదాన్ని ఖండించే అనేక యుక్తులతో కూడినగ్రంథాలు ఉదా॥ అద్వైతసిద్ధి.

**తర్కము** - ప్రతివాది ఒప్పుకొనని తన సిద్ధాంతాన్ని యుక్తితో ఒప్పించడం తర్కం ప్రజ్ఞాన ఘనము = సర్వదా యేకరసమైన జ్ఞానము, దానినే బుద్ధత్వమంటారు.

**బాధ** - అధిష్ఠానం బ్రహ్మములో ఈ ప్రపంచము త్రికాలమునందును అభావమే అనెడి నిశ్చయాన్ని అపవాదమంటారు. ఆ అపవాదాన్నే బాధ అని విలాపనమని కూడా అంటారు. అది మూడు విధాలు. శాస్త్రీయము. 2. లౌకికము, 3. ప్రాత్యక్షికము అని. (1) శాస్త్రీయబాధ = **"నేహనానాస్తికించన"** అను మొదలైన శాస్త్ర ప్రమాణాల ద్వారా అధిష్ఠాన బ్రహ్మంలో సర్వ ప్రపంచము యొక్క అభావ నిశ్చయాన్ని శాస్త్రీయ బాధ అంటారు. (2) యౌక్తిక బాధ = కుండ కార్యవస్తువు. మట్టి ఉపాదాన కారణము. ఉపాదాన కారణమైన మట్టికంటె కార్యవస్తువైన కుండ భిన్నంగాలేదు. అట్లే జగత్తు కార్యవస్తువు. దీనికి అభిన్న నిమిత్తోపాదాన కారణము బ్రహ్మము. కాబట్టి బ్రహ్మముకంటె భిన్నముగ ప్రపంచములేదు. బ్రహ్మ మాత్రమే నిజమనెడి నిశ్చయము యౌక్తిక బాధ. (3) ప్రాత్యక్షికబాధ = **"అహం బ్రహ్మాత్త్వమసి"** మొదలైన మహావాక్యాల ద్వారా కల్గిన సాక్షాత్కార ప్రభావంతో ప్రపంచ రూపకార్యసహిత అజ్ఞాన నివృత్తిని **"ప్రాత్యక్షిక బాధ"** అంటారు. మనోనాశము = రాజస తామస వృత్తులను నిరోధించడంతో మనస్సు సూక్ష్మస్థితికి వస్తుంది. దానినే మనోనాశమంటారు. అది అరూప నాశమని స్వరూప నాశమని రెండు విధాలు. (1) మనస్సు పునరుత్థాన రహితమై స్వరూపంతో నశిస్తే అరూప నాశమంటారు. ఇది విదేహముక్తిలో సిద్ధిస్తుంది. (2) మనస్సు స్వరూపంతో ఉన్నప్పటికి యేదో ఉపాయంతో వృత్తులను నశింపజేస్తే అది స్వరూపనాశ మనబడ్తుంది. ఇది జీవన్ముక్త పురుషుని స్థితి.

**యోగక్షేమములు** - యోగమనగా అప్రాప్తవస్తుప్రాప్తి. దేహాదులైన అన్ని అనాత్మ పదార్థాలలోని ఆత్మత్వ బుద్ధిని పరిత్యాగం చేయడంతో లభించే బ్రహ్మానంద స్థితి యోగము. (2) క్షేమమనగా ప్రాప్తపదార్థము యొక్క రక్షణ లభించిన బ్రహ్మానందస్థితి

ప్రారబ్ధబలాత్కారంతో జారకుండా వుండుటే క్షేమమే.

**లోకసంగ్రహము** = తాను స్వయంగా సదాచారంలో ప్రవర్తిస్తూ లోకాన్ని ప్రవర్తింప జేయటాన్ని లోక సంగ్రహమంటారు.

**విరాట్టు** = సమష్ఠి స్థూల శరీర ఉపహిత చైతన్యాన్ని విరాట్టు అని వైశ్వానరుడని అంటారు. వివిధ ప్రకారాలతో ప్రకాశిస్తూండటం బట్టి విరాట్టని పేరు కల్గింది. సర్వ నరులకును అభిమాని కావడంతో వైశ్వానరుడని చెప్పినారు.

**విపాకము** = కర్మయొక్క ఫలాన్ని విపాకమంటారు.

**సంపత్తి** = మహావాక్య జన్యమైన **"అహంబ్రహ్మాస్మి"** అనెడి జ్ఞానమే సంపత్తి.

స్వరూపాభి నిష్పత్తి = జీవబ్రహ్మలయొక్క అభేద జ్ఞానంతో ఉత్పన్నమైన సర్వద్వైత రాహిత్యఫలమే స్వరూపాభి నిష్పత్తి.

**శిష్టుడు** = వేద ప్రమాణాన్ని అనుసరించువాడు శిష్టుడు.

వేదాంతగోష్ఠి సమాప్తము, ఓం తత్సత్ ఓం

జీవన్ముక్తులు

జీవన్ముక్తులు అనగా తామూ పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపులై అఖండ విజ్ఞానమును సంపాదించినవారైనను, వారికి ప్రారబ్ధ జనిత శరీరోపాధి ఉన్నంతవరకు సుఖ దుఃఖాదులు దృష్యమును ప్రతీయమానములై ఉండును. అయినా ఆ సర్వం స్వప్నమువలె మిథ్యగా భాసించును. ఇదియే తురీయస్థితియగును. ఈ స్థితిలో యున్నవారిని జీవన్ముక్తులందురు.

విదేహముక్తులు

విదేహముక్తులు అనగా దేహముండినను దేహ ధర్మములనంటక, ప్రారబ్ధకర్మకు కూడ దూరులైనందుచే, సుఖదుఃఖాదులు కూడ ప్రతీయ మానములు గానివారై సకల దృశ్యాతీతులై గాఢ సుషుప్తియందున్న వారు ఎటుల జగత్తును మరచియుందురో, ఆలాగున సమస్తమును మరచిన వారై తురీయాతీతస్థితి యందుండు వారిని విదేహ ముక్తులు అందురు.

# శ్రీ దయానందగిరి స్వాములవారు నోట్ బుక్కులో వ్రాసిన వేదాంత ప్రక్రియలు

**ప్ర॥ ఉపాసన ఏకాగ్రతకు, శమము అనెడి ఏకాగ్రతకు సమాధానమనెడి ఏకాగ్రతకు తారతమ్యం ఏమి?**

జ॥ ఉపాసన వలన కలిగెడి ఏకాగ్రతయందు వివేక వైరాగ్యం లేకపోవుటచే స్థిరముగా ఉండదు. అది వివేక వైరాగ్యములను సంపాదించుటకు మాత్రమే ఉపయోగపడును. శమమనగా మనోనిగ్రహము, లేక ఏకాగ్రత, ఇది వివేక వైరాగ్యములతో కూడినదగుటచేత ఇది స్థిరమైనది. ఇదియును శ్రవణమునకు అర్హముగాదు. ఐతే ఇది ఉపరతి, తితీక్ష, శ్రద్ధలను సంపాదించుటకు మాత్రమే ఉపయోగపడును. సమాధానమనగా ఏకాగ్రత ఇది పూర్వసాధనలతో కూడినదగుట వలన చాలా దృఢమైనది. అందువలన ఉపాసనవలన గలిగెడి ఏకాగ్రతకంటే శమమనెడి ఏకాగ్రతకంటే చాలా దృఢమైనది. అందువలన మహావాక్యార్థ శ్రవణమునకు తగినదై ఉన్నది.

**ప్ర॥ నిత్యానిత్యవస్తు వివేకమే వివేకమని చెప్పినచో ఉత్తర సాధనములు ఎందుకు?**

జ॥ ధనపుత్ర మిత్ర కళత్రాదుల యొక్క నాశం చేతను, వియోగం చేతను, సద్గ్రంథ శ్రవణం చేతను, సత్సాంగత్యం చేతను జగత్తు అనిత్యమనియు, పరమాత్మ నిత్యమనియు తెలుసుకొనుట నిత్యానిత్యవస్తు వివేకమగును. కాని ఆ పరమాత్మ తానేననియు, తనకంటే భిన్నముగ జగత్తు లేదనియు, తెలియబడనందున ఉత్తర సాధనలు అపేక్షితములు.

**ప్ర॥ దుఃఖనివృత్తి కోరుట యెందువలన భ్రాంతి?**

జ॥ 1 అజ్ఞానం 2. ద్వైతప్రపంచం. సుందరత్వా సుందరాత్వ బుద్ధి, లేక శోభనా శోభనాధ్యాస, రాగద్వేషములు, కర్మలు, శరీర పరిగ్రహం, జనన మరణ సంసార దుఃఖం, ఇవి సప్తావరణములు అనబడును. సంసార దుఃఖం రజ్జువు నందలి సర్పంవలె కల్పితమైనది. ఎందువలన అనగా అజ్ఞానం వలన పుట్టినది. రజ్జువును తెలియక పోవుటచే కల్పిత సర్పం తోచుచున్నది. అట్లే ఆత్మను తెలియకపోవుట అనెడి అజ్ఞానం వలన సంసార దుఃఖం తోచుచున్నది. కల్పిత సర్పం యొక్క నాశం కోరుట భ్రాంతియైనట్లు తనయందు కల్పితమైన సంసారదుఃఖ నివృత్తి కోరుట భ్రాంతియగును. నివృత్తి రెండు విధములు 1. పరిహృత పరిహార్యం 2. అపరిహృత పరిహార్యం

పరిహృతపరిహార్యమనగా కల్పిత వస్తువు యొక్క నాశము, అపరిహృత పరిహార్యం అనగా - నిజమైన వస్తువుయొక్క నాశనము. ప్రాతిభాసిక సత్తాయనగా - బ్రహ్మజ్ఞానం లేకనే నశించునవి. వ్యవహారసత్తా నాశనం. రజ్జు సర్పాదులు వ్యావహారిక సత్తాయనగా-బ్రహ్మజ్ఞానం వలన నశించునవి. ఘటపటాదులు పారమార్థిక సత్తా అంటే త్రికాలాబాధము.

ప్ర॥ ఆనంద ప్రాప్తి కోరుట ఎందువలన భ్రాంతి?

జ॥ ప్రాప్తంగాని వస్తువును కోరవచ్చును గాని, నిత్య ప్రాప్తిని కోరుట తగదు. తనయందు ఆనందంలేనిచో, ఆనందప్రాప్తిని కోరవచ్చును. ఆత్మ ఆనందరూపుడు అగుటవలన తత్ప్రాప్తి కోరుట భ్రాంతి.

ప్ర॥ ప్రాప్తి ఎన్ని విధములు?

జ॥ 1 ప్రాప్త ప్రాప్తవ్యం 2. అప్రాప్త ప్రాప్తవ్యం, ప్రాప్తప్రాప్తవ్యం అనగా - ప్రాప్తించిన దానిని మరచి జ్ఞప్తికి తెచ్చుకొనుట, లేకపొందుట, అప్రాప్త ప్రాప్తవ్యం అనగా - లేని దాన్ని పొందుట, అందువలన మోక్షం అనునది ప్రాప్తప్రాప్తవ్యంగా యున్నది.

ప్ర॥ మోక్షేచ్ఛ ఎందువలన భ్రాంతి?

జ॥ సర్వానర్ధ నివృత్తి, పరమానంద ప్రాప్తి మోక్షం అనబడును దుఃఖం కల్పితం అగుట చేతను తన్నివృత్తికోరుట భ్రాంతి, మరియు ఆనందం నిత్యప్రాప్తి అగుటవలన తత్ప్రాప్తి కోరుట భ్రాంతి.

ప్ర॥ నేనెవరు?

జ॥ జనన మరణములు లేని నిష్క్రియాసంగ అద్వితీయ బ్రహ్మమే నీవుగా ఉన్నావు. మరియు నీవు సదా ఆనందరూపుడవు.

ప్ర॥ విషయములలో ఆనందమున్నదా? లేదా?

జ॥ 1 విషయం నందు ఆనందమున్నచో ఒకే విషయంచే సర్వులకు ఆనందం కలుగుటలేదు. 2 వృత్తి ప్రథమ విషయంను విడిచి ద్వితీయ విషయంను పొందినపుడు ప్రథమ విషయంచే ఆనందం కలుగుటలేదు. 3. మరణోన్ముఖుడైన వానికి స్త్రీ ధనాది విషయముల ద్వారా కలుగుటలేదు. 4. సుషుప్తిలో విషయములు గాని విషయ వాసనలు

లేక ఏ ఆనందం కలుగుచున్నది. కావున విషయములలో ఆనందంలేదు.

**ప్ర॥ విషయములలో ఆనందం లేనిచో విషయానుభవ కాలమున ఆనందం కలుగుటకు కారణం ఏమి?**

జ॥ విషయేచ్ఛ కలిగినప్పుడు వృత్తి చంచలం అగును. విషయం ప్రాప్తమై అనుభవించెడి కాలమున వృత్తి నిశ్చలం అగును. మరియు ఏకాగ్రమగును. దీనినే అంతర్ముఖవృత్తి సాత్వికవృత్తి అందురు. నీరు చలించునపుడు దాని యందు సూర్య ప్రతిబింబం తెలియబడదు. అట్లే చంచలవృత్తియందు ఆత్మానందం స్ఫుటముగా తెలియబడదు. నిశ్చలమైన నీటియందు సూర్య ప్రతిబింబం స్ఫుటముగా తెలియబడునట్లు, విషయానుభవకాలమున ఏకాగ్రమైన సాత్విక వృత్తియందు ఆత్మానందం తెలియబడుచున్నది. అప్పుడు జ్ఞాని విషయముల యందు ఆనందం ఉన్నదని తలంచును. జ్ఞాని తన స్వరూపానందమేయని తలంచును. అందువలన జ్ఞానికి విషయానుభవ కాలమున కూడ సమాధి గలదని చెప్పబడును.

**ప్ర॥ శక్తి అనగా శబ్దార్థ బోధకు హేతువైన శబ్దం నందలి సామర్థ్యం శక్తి అనబడును. శక్తి ఎన్ని విధములు? అవి ఏవి?**

జ॥ 1 యోగశక్తి 2. రూఢిశక్తి 3. యోగరూఢి శక్తి

**ప్ర॥ జ్ఞానమునకు ప్రయోజనం ఏమి?**

జ॥ అజ్ఞానంను దాని వలన కలిగిన జగత్తునందు సత్యత్వబుద్ధి జ్ఞానంచే నశించును కాని దేహేంద్రియ వ్యవహారమునకు నాశనం లేదు.

**ప్ర॥ శ్రేయస్సు ఎన్ని విధములు?**

జ॥ 1 నిశ్రేయస్సు 2. ఏకాంత నిశ్రేయస్సు. మహా వాక్య శ్రవణజన్యమైన బ్రహ్మాకారవృత్తి ఆత్మోన్ముఖమై ఆత్మావరణ భంగం చేయుటచే కలిగెడి నిత్య సుఖం లేక నిరావరణానందం నిశ్రేయస్సనబడును. నిత్యనిరంతర సమాధి నిష్ఠాభ్యాసం వలన కలిగిన సుఖము లేక చిత్త విశ్రాంతి ఏకాంతిక నిశ్రేయస్సు అనబడును.

**ప్ర॥ తత్పదావాచ్యార్థంనందు లక్షణ అంగీకరించినచో చైతన్యమునకు అసంగత్వంనందు హాని కలుగును. చైతన్యంనందు అసంగత్వం అంగీకరించినచో**

లక్షణ పొసగదు. ఇట్లే త్వం పదార్థం నందు కూడా గ్రహించవలెను. అప్పుడు మహావాక్యం అఖండార్థ బోధకం ఎట్లగును?

జ॥ చైతన్యంతో సకల అనాత్మ పదార్థములకు అధిష్ఠాన అధ్యస్థ భావ సంబంధం కలదు. అందువలన మాయకు బ్రహ్మచైతన్యంతో అధిష్ఠాన అధ్యస్థభావ సంబంధం కలదు. ఎండమావుల నీటి వలన భూమి తడవనట్లు మాయవలన చైతన్యమునకు ఏ హానియులేదు. చైతన్యమునకు మాయతో లేక అనాత్మ పదార్థములతో తాదాత్మ్యసంబంధం కలదు. అందువలన మాయతో కూడిన చైతన్యం ఈశ్వరుడని చెప్పుట వలనగాని చైతన్య సహిత మాయ యందలి అభాసుడు ఈశ్వరుడని చెప్పుట వలన గాని చైతన్యమునకు అసంగత్వ హాని కలుగదు మరియు వాచ్యార్థంనందు లక్షణ పొసగదు.

ప్ర॥ శక్తివృత్తి అనగా ఏమి?

జ॥ శబ్దార్థ జ్ఞానం శక్తివృత్తి అనబడును లేక శబ్దం వలన కలిగెడి జ్ఞానం.

ప్ర॥ శక్యార్థం అనగా ఏమి?

జ॥ శక్తి వృత్తి వలన తెలియబడునది, లేక శబ్దం యొక్క అర్థం శక్యార్థం అనబడును. ఘటం అనునది శబ్దం, కుండ అనెడి జ్ఞానం శక్తివృత్తి, కుండ శక్యార్థం అనబడును.

ప్ర॥ లక్షణ అనగా ఏమి? అది ఎన్ని విధములు?

జ॥ శక్యార్థ సంబంధం లక్షణ అనబడును. 1 కేవల లక్షణ 2 లక్షిత లక్షణ అని రెండు విధములు

ప్ర॥ కేవల లక్షణ అనగానేమి?

జ॥ శక్య సాక్షాత్సంబంధం కేవల లక్షణ అనబడును. "గంగాయాంఘోషః" అని చెప్పినప్పుడు గంగ అను శబ్దం, గంగా యనెడి జ్ఞానం శక్తివృత్తి, గంగ శక్యార్థం శక్యార్థమైన జలమునకు తీరముతోగల సంబంధం లక్షణ అనబడును.

ప్ర॥ లక్షిత లక్షణ అనగా ఏమి?

జ॥ శక్య పరంపరా సంబంధం లక్షిత లక్షణ అనబడును. "సింహోదేవదత్తః"

సింహోయను నది శబ్దము, సింహం అనెడి జ్ఞానం శక్తివృత్తి సింహం శక్యార్థము. సింహమునకు తన యందు గల బలపరాక్రమము అనెడి గుణములతో గల సంబంధం లక్షణ, గుణముల జ్ఞానము లక్షణావృత్తి గుణములు లక్ష్యార్థం, గుణములకు దేవదత్తునితో పురుషునితో గల సంబంధం లక్షిత లక్షణ, పురుషుని జ్ఞానం లక్షిత లక్షవృత్తి, పురుషుడు లక్షిత లక్ష్యార్థం. శక్యమైన సింహమునకు గుణముల ద్వారా దేవదత్తునితోగల సంబంధం లక్షిత లక్షణ అనబడును.

**ప్ర॥ "యన్మనసానమనుతే" ఏది మనస్సు చేత మననం చేయబడదో "మనసైవాను ద్రష్టవ్యమ్" మనస్సు చేతనే తెలియబడును అను శృతి ప్రమాణముల అభిప్రాయం ఏమి?**

జ॥ మలిన మనస్సులేక బహిర్ముఖ చిత్తమునకు బ్రహ్మం తెలియబడదనియు, శుద్ధమైన మనస్సుచేతను లేక అంతర్ముఖమైన మనస్సు చేత తెలియదగినదని అభిప్రాయము.

**ప్ర॥ "యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ" దేనిని మనోవాక్కులు తెలుసుకొనలేవో "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" ఆ ఉపషనిద్ ప్రతిపాద్య పురుషుని అడుగుచున్నాను. అనెడి శృతి ప్రమాణముల అభిప్రాయం ఏమి?**

జ॥ బ్రహ్మం శక్తివృత్తికి అవిషయమగుట వలన "యతోవాచో నివర్తంతే" అని చెప్పిబడింది. అనగా శబ్దమునకు బ్రహ్మం తెలియబడదు బ్రహ్మం లక్షణావృత్తికి విషయం అగుటవలన "తం త్వౌప నిషదం పురుషం పృచ్ఛామి" చెప్పబడినది. అనాగ శబ్దం లక్షణా వృత్తిచే బ్రహ్మంను తెలియజేయును.

**ప్ర॥ వాక్యమునకు లక్షణం ఏది?**

జ॥ ఆకాంక్షా యోగ్యత, సన్నిధి గల పద సముదాయం వాక్యం అనబడును.

**ప్ర॥ ఆకాంక్షా అనగా ఏమి?**

జ॥ ఏ పదమునకే పదము లేనిదే అర్థాన్వయం కాదో, ఆపదమున కాపదంతో ఇచ్ఛ (కారక పదమునకు, క్రియాపదమునకు గల పరస్పర ఇచ్ఛ) లేక ప్రకృతి, ప్రత్యయ పదములకు గల పరస్పర ఇచ్ఛా. ఉదా: "ఘటమానయ" కుండను తీసికొనిరమ్ము ఇది

వాక్యము. ఇందు ఘటమను పదముండి ఆనయపదం లేకపోయినను ఆనయ పదముండి ఘటమను పదం లేకపోయినను అర్థాన్వయంకాదు. కావున ఘటమను పదము ఆనయ పదంతో, ఆనయపదమునకు ఘటమను పదంతోగల ఇచ్ఛా ఆకాంక్షా అనబడును. ఈ విధముగా తెలుసుకొనుట ఆకాంక్షా జ్ఞానం అనబడును.

ప్ర॥ యోగ్యత అనగా ఏమి?

జ॥ శబ్దం యొక్క అర్థం ఇతర ప్రమాణములతో బాపబడకుండుట యోగ్యత అనబడును. **"అగ్నినాసించతి"** అగ్నితో తడుపుచున్నాడు. ఈ వాక్యార్థం ప్రత్యక్ష ప్రమాణంచే బాధింపబడుచున్నది. అందువలన దానియందు యోగ్యత లేదు **"ఘటమానయ"** అను వాక్యంనందు యోగ్యత కలదు. కావున ఏ ప్రమాణంచేత బాధింపబడదు.

ప్ర॥ సన్నిధి అనగా ఏమి?

జ॥ పదముల అవి లంబోచ్చారణ సన్నిధి అనబడును. అనగా – ఒక పదము వెంటనే మరియొక పదం చెప్పుట. ఘటమను పదంచెప్పి, ఆలస్యముగా ఆనయ అను పదమును చెప్పినచో అర్థాన్వయం కాదు. కావున సన్నిధి కావలయును. ఈ విధంగా ఆకాంక్షా, యోగ్యతా, సన్నిధి గల పదసముదాయం నిర్దుష్టమైనది.

ప్ర॥ శబ్ద సహకారులెవ్వి?

జ॥ ఒకటి ఆకాంక్షా జ్ఞానం, 2. యోగ్యతాజ్ఞానం, 3 తాత్పర్యజ్ఞానం 4. ఆసక్తి ఇవి చతుర్విధ శబ్ద సహకారులనబడును. ఆకాంక్షా జ్ఞానం, యోగ్యతా జ్ఞానములు శబ్ద బోధక సహకారులు మిగతా రెండు శబ్దార్థ బోధక సహకారులు. 1 ఆకాంక్ష జ్ఞానం అనగా – ఒక పదమునకు మరియొక పదమునకు గల ఇచ్ఛా 2. యోగ్యత జ్ఞానం అనగా – శబ్దం యొక్క అర్థం విరుద్ధం కాకుండుట.

ప్ర॥ తాత్పర్యం ఎన్ని విధములు? అందు ఏది ప్రధానమైనది? ఎందువలన?

జ॥ 1 వక్తృతాత్పర్యం అనగా – చెప్పెడి వారి అభిప్రాయం, 2. శబ్ద తాత్పర్యం అనగా – శబ్దం యొక్క అర్థం అని తాత్పర్యం రెండు విధములు వక్తృతాత్పర్యం

తెలుసుకొనుట కష్టము కావున అది అప్రధానము. శబ్దంనందు దాని అర్ధమును బోధించెడి సామర్ధ్యం లేక యోగ్యత ఉండుట వలన శబ్ద తాత్పర్యం ప్రధానము.

**ప్ర|| శబ్దమునకు రెండు అర్ధములుండిన శబ్ద తాత్పర్యం తెలుసుకొనుట ఎట్లు?**

జ|| ప్రకరణము అనుసరించి శబ్దతాత్పర్యం తెలుసుకొనవలెను. "సైంధవమానయ" సైంధవం అను శబ్దమునకు ప్రయాణ సమయం అయినచో గుఱ్ఱమును, భోజన సమయం అయినచో ఉప్పును తీసుకొనవలెను.

వేదాంత శాస్త్రం యొక్క తాత్పర్యం కూడ ప్రకరణం అనుసరించి తెలుసుకొనవలెను. ఆప్రకరణము షడ్లింగములచేత నిర్ణయం చేయబడును. కర్మప్రకరణం అయినచో భేదంను, జ్ఞాన ప్రకరణం అయినచో అభేదంను తెలుసుకొనవలెను. పొగను బట్టి అగ్నిని తెలుసుకొనవచ్చును. అగ్ని లేనిదే పొగ ఉండదు. కాని అగ్ని జ్ఞానమునకు పొగ హేతువగుచున్నది. అందువలన పొంగ లింగం అనబడును. అనగా గుర్తు అట్లే వేదాంతశాస్త్ర తాత్పర్యంను తెలుసుకొనుటకు 6 షడ్లింగములు గలవు. షడ్లింగములచేత శబ్దం యొక్క తాత్పర్యంను తెలుసుకొనుట తాత్పర్యజ్ఞానం అనబడును.

**ప్ర|| ఆసత్తి అనగా ఏమి?**

జ|| పద పదార్ధస్మృతి ఆసత్తి అనబడును. అనగా వాక్యం నందలి పదములు వినగానే పదార్ధములు స్మరణకు వచ్చుట "ఘటమానయ" అని వినగానే ఘటమనెడి పదంచే కుండయును. ఆనయ పదంచే తీసికొనిరమ్ము అని స్మరణకు వచ్చును. అట్టి స్మృతిచే కుండను తీసికొనవలయు అనెడి జ్ఞానం కలుగుచున్నది.

**ప్ర|| చతుర్వి సహకారులలో తారతమ్యం ఏమి?**

జ|| శాబ్ద బోధకు ఆకాంక్షా, యోగ్యత, తాత్పర్య జ్ఞానములు సహకారములు కాని అవి స్వయముగా సహకారులుగావు ఆసక్తిచే శాబ్దబోధకలగుటచే దాని జ్ఞానం సహకారికాదు. అది స్వయంగా సహకారి అగును.

**ప్ర|| సంబంధత్రయం ఏది?**

జ|| 1 సామానాది కరణ్య సంబంధం 2. విశేషణ విశేషభావ సంబంధం 3. లక్ష్య

లక్షక భావ సంబంధం

ప్ర॥ సామానాధికరణ్య సంబంధం అనగా ఏమి? అది ఎన్ని విధములు?

జ॥ భిన్నార్థ బోధకములైన రెండు శబ్దములు ఏక విభక్తి బలంచే ఒకే అధికరణంనందు పర్యవసానం పొందుట సామానాధికరణ్య సంబంధం అనబడును. 1. ముఖ్యసామానాధి కరణ్య సంబంధం. 2. బాధ సామానాధికరణ్య సంబంధం. 3. విశిష్ట సామానాధికరణ్య సంబంధం. 4. సంసర్గ సామానాధికరణ్య సంబంధం అని నాల్గు విధములు.

ప్ర॥ ముఖ్య సామానాధి కరణ్య సంబంధం అనగా ఏమి?

జ॥ సమాన స్వరూప స్వభావములుగలవై సమసత్తాకములై వాస్తవంగా భేదంలేని (నామమాత్ర భేదంగల) పదార్థములను బోధించెడి పదములకు చెప్పెడి సంబంధం ముఖ్య సామానాధికరణ్య సంబంధం అనబడును. ఘటాకాశం మహాకాశంగా ఉన్నది. ఇచ్చట ఘటాకాశ మహాకాశములు రెండును సమాన స్వరూప స్వభావములు గలవి. అసంగత్వం అనెడి స్వరూప ఉత్పత్తి నాశం అనెడి స్వభావములు సమానములు అవి రెండును వ్యావహారిక సత్తగలవి అగుటచేత సమత్తాసత్తాకములు మరియు వాటికి వాస్తముగా భేదం లేదు. అందువలన ముఖ్య సామానాధికరణ్యం అని చెప్పబడినది.

ప్ర॥ బాధసామానాధి కరణ్య సంబంధం అనగా ఏమి?

జ॥ భిన్న స్వరూప స్వభావములు గలవై భిన్న సత్తాకం కల్పిత పదార్థములను బోధించెడి పదములకు గల బంధం బాధసామానాధికరణ్య సంబంధం అనబడును. భ్రాంతి సర్పమునకు రజ్జువుతో కల్పిత చోరునకు స్థాణువుతో బాధసామానాధికరణ్య సంబంధం గలదు. సర్పం బాధింపబడి రజ్జువగును. చోరుడు బాధింపబడి స్థాణువగును. ఇది బాధసామానాధికరణ్య సంబంధం అనబడును. సర్పం యొక్క రజ్జువు యొక్క స్వరూపస్వభావములు భిన్నములు సర్పం ప్రాతిభాసిక సత్తా రజ్జు వ్యావహారికగల వగుటచే అవి భిన్నసత్తగలవి అనబడును మరియు వాటికి పరస్పరం కల్పితభేదంగలదు.

ప్ర॥ విశిష్ట సామానాధికరణ్య సంబంధం అనగా ఏమి?

జ॥ విశేషణ విశేష్యములగు పదార్థములను బోధించెడి పదములకు గల సంబంధం

విశిష్ట సామానాధికరణ్య సంబంధం అనబడును. **"నీలముత్పలమ్"** నల్లని కలువ, ఇచ్చట నలుపు విశేషణము కలువ విశేష్యము నల్లని కలువ విశిష్టార్థము.

**ప్ర॥ సంసర్గ సమానాధికరణ్య సంబంధం అనగా ఏమి?**

జ॥ కలయికగల సంసర్గంగల పదార్థములను బోధించెడి పదములకుగల సంబంధం సంసర్గాసమానాధి కరణ్య సంబంధం అనబడును.

**ప్ర॥ తత్త్వమసి మహావాక్యంనందు సంబంధత్రయం ఎక్కడున్నది?**

జ॥ 1. తత్త్వం పదములకు సామానాధికరణ్య సంబంధం కలదు 2. పదార్థములకు అనగా తత్త్వం పదములకు వాటి అర్థములతో లక్ష్యలక్షక భావసంబంధం కలదు.- తత్పదమునకు బ్రహ్మము లక్ష్యార్థం. అందువలన తత్పదమునకు బ్రహ్మంతో లక్ష్యలక్షకభావ సంబంధం కలదు. తత్పదము లక్షకము, బ్రహ్మం, లక్ష్యము. త్వంపదమునకు ప్రత్యగాత్మ లక్ష్యార్థము. త్వం పదము లక్షకము, ప్రత్యగాత్మలక్ష్యము త్వంపదమునకు ప్రత్యగాత్మతోగల సంబంధం లక్ష్య లక్షకభావ సంబంధం అనబడును.

**ప్ర॥ జహల్లక్షణ అనగా ఏమి?**

జ॥ శక్యార్థమును విడచి దాని సంబంధిని గ్రహించుట జహల్లక్షణ అనబడును. నదిలో పల్లె ఉన్నది. నది అనునది శబ్దము, నదియను జ్ఞానం శక్తివృత్తి తీరం లక్ష్యార్థం, నది అనునది వాచకం, జలం వాచ్యార్థం, తీరం లక్ష్యార్థము.

**ప్ర॥ అజహల్లక్షణ అనగా ఏమి?**

జ॥ శక్యార్థమును విడువక దాని సంబంధిని గ్రహించుట అజహల్లక్షణ అనబడును. **"మంచాఃక్రోశంతి"** మంచె అనునది శబ్దము, మంచెఅనెడి జ్ఞానం శక్తివృత్తి, మంచె శక్యార్థము. మంచెను విడువక మనుష్యులను గ్రహించుట అజహల్లక్ష అనబడును.

**ప్ర॥ జహదజహల్లక్షణ అనగా ఏమి?**

జ॥ శక్యార్థంనందు లేక వాచ్యార్థంనందు ఒక భాగంను విడిచి ఒక భాగంను గ్రహించుట భాగత్యాగ లక్షణ అనబడును. **"సోయందేవదత్తః"** సః లేక వాడు అనునది

శబ్దం, రాజు జ్ఞానం శక్తివృత్తి, రాజు శక్యార్థం, వేషమును విడిచి పురుషుని గ్రహించుట లక్షణ పురుషుని జ్ఞానం లక్షణావృత్తి. పురుషుడు లక్ష్యార్థం. అయం వీడు అనునది శబ్దము, సంన్యాసి జ్ఞానం శక్తివృత్తి, సంన్యాసి శక్యార్థం, వేశమును విడిచి పురుషుని గ్రహించుట లక్షణ పురుషుని జ్ఞానం లక్షణావృత్తి, పురుషుడు లక్ష్యార్థం ఈ విధంగా సః అయం శబ్దమునకు శక్యార్థములందు, దేశకాల వేష భాషలను పరిత్యజించి పురుషుని గ్రహించుటచే వాడే దేవదత్తుడగును. దీనినే జహదజహల్లక్షణ అందురు. ఉదా॥ అరటి పండు.

ప్ర॥ మహావాక్యంనందు శబ్దం సహకారులు ఎట్లు ఉపయోగపడును?

జ॥ తత్వమసి మహావాక్యమునందు తత్ అను పదముంది. త్వం పదం లేకపోయినను త్వం పదముండి తత్ పదం లేకపోయినను అర్థాన్వయంగాదు. కావున తత్పదం త్వంపదమును, త్వం పదం తత్పదంను కోరుచున్నది. అందువలన మహావాక్యము నందు ఆకాంక్షా జ్ఞానం హేతువుగా ఉన్నది. తత్వం పదములు కర్తృకారక పదములు. అసి క్రియాపదము కర్తృకారకములుండి, క్రియా పదంలేకపోయినను, క్రియపదముండి కర్తృకారకము లేకపోయినను అన్వయము కాదు కావున ఆకాంక్షా జ్ఞానం ఉన్నది. మాహావాక్యార్థం అహం బ్రహ్మాస్మి అనెడి అర్థము. ఇతర ప్రమాణములచే బాధింపబడకుండుటచే యోగ్యతా జ్ఞానం మహావాక్యంనందు హేతువుగా ఉన్నది. మహావాక్యం యొక్క అర్థం షడ్లింగములచేత నిర్ణయం చేయబడిన తాత్పర్యమే అగుట వలన లేక అద్వైత మగుటవలన తాత్పర్యజ్ఞానం మహావాక్యంనందు హేతువుగా ఉన్నవి. తత్వమసి మహావాక్యమును వినగానే శోధిత తత్వ పదార్థస్ఫూర్తి కలిగి తక్షణమే నేను బ్రహ్మము ననెడి జ్ఞానంనందు హేతువుగా ఉన్నది. తత్వమసి మహావాక్యమును వినగానే తత్పదం వలన బ్రహ్మం త్వంపదం వలన ప్రత్యగాత్మయును స్మరింపబడి నేను బ్రహ్మం అనెడి జ్ఞానం కలుగును.

ప్ర॥ తత్వంపదములకు సామానాధికరణ్య సంబంధం చెప్పుటకు కారణం ఏమి?

జ॥ మహావాక్యం విశిష్టార్థంను గాని, సంసర్గార్థమును గాని బోధించుట లేదు. అఖండార్థమునే బోధించుచున్నదని చెప్పుటకు సామానాధికరణ్య సంబంధం చెప్పబడెను.

**ప్ర॥ పదార్థములకు విశేషణ విశేష్యభావ సంబంధం చెప్పుటకు కారణం ఏమి?**

జ॥ తత్పదార్థమైన ఈశ్వరునకు త్వంపదార్థమైన జీవునకు ఏకత్వంను బోధించుటకు విశేషణ విశేష్య భావసంబంధం చెప్పబడినది. ఈశ్వరుడు - సర్వజ్ఞుడు, ఏకము, పరోక్షుడు, బంధమోక్షరహితుడు, వ్యాపకుడు, కర్మఫలదాత, సృష్టికర్త, పూర్ణకాముడు, జీవుడు - కించిజ్ఞుడు, అనేకము, అపరోక్షుడు, బంధమోక్ష సహితుడు, పరిచ్ఛిన్నుడు, కర్తాభోక్తా, జననమరణములుగలవాడు దుఃఖీ.

పై విధముగా జీవేశ్వరులకు ఉపాధి కృతబేధము వలన ఏకత్వం సంభవింపదు. ఉపాధులను విడచి ఉపహితచేతనములను అనగా బ్రహ్మాత్మలను గ్రహించినపుడు వాటిని ఏకత్వం విశేషణ విశేష్య భావసంబంధం వలన కలుగుచ్నుది.

**ప్ర॥ మహావాక్యంనందు ఏలక్షణ ఉపయోగపడును అదిఎట్లు?**

జ॥ మహావాక్యంనందు జహల్లక్షణ చేసినచో వాచ్యార్థములైన జీవేశ్వరులను విడిచినచో ప్రయోజనం లేకపోవును. అజహల్లక్షణ చేసినచో జీవేశ్వరులకు అభేదము సిద్ధింపదు. కావున జహదజహల్లక్షణచే ఉపాధులైన జడభాగములను విడచి ఉపహితములైన చేతన భాగములను గ్రహించుటచే ఏకత్వం సిద్ధించును.

**ప్ర॥ మహావాక్యంనందు చేసిన లక్షణ కేవల లక్షణ అగునా? లక్షిత లక్షణ అగునా?**

జ॥ తత్పదమునకు వాచ్యమైన ఈశ్వరుని యందు మాయకు చైతన్యంతో సాక్షాత్సంబంధముండుట వలన అది కేవల లక్షణ అగునుగాని లక్షిత లక్షణగాదు.

**ప్ర॥ మాయకు చైతన్యంతో సంబంధం చెప్పినచో చైతన్యంనందు అసంగత్వమునకు హాని వచ్చునేమో, సంబంధం చెప్పనిచో లక్షణ పొసగదు. కావున దీని సమన్వయం ఎట్లు?**

జ॥ మాయకు సమస్త పదార్థములకు చేతనంతో అధిష్ఠాన అధ్యస్త భావసంబంధం కలదు. ఎండమావుల నీటి వలన భూమి తడవనట్లు, కల్పితమైన మాయవలన గాని దానితో గల కల్పిత సంబంధముల వలనగాని చైతన్యమునకు ఏ హానియులేదు. అనగా చైతన్యంనందు అసంగత్వమునకు హాని లేదు మరియు లక్షణ పొసగును.

**ప్ర॥ మహావాక్యంనందు ప్రయోజనవతీ లక్షణా? రూఢ లక్షణాలలో ఏది ఉపయోగము?**

జ॥ మాయను విడచి దాని ధర్మములను గ్రహించినచో చైతన్యమునకు ఏ ప్రయోజనంలేదు మరియు అంతఃకరణమును విడచి దాని ధర్మములను గ్రహించినచో చైతన్యమునకు ఏ ప్రయోజనంలేదు మరియు హాని సిద్ధించును. కావున మహావాక్యంనందు ప్రయోజన వతీలక్షణకు ఉపయోగంలేదు. మహావాక్య శ్రవణంచే నేను బ్రహ్మం అనెడి జ్ఞానం కలుగవలయునని ఈశ్వరుని అనాది తాత్పర్యం ఉండుటవలన ప్రయోజన శూన్యమని రూఢ లక్షణమే ఉపయోగం కలదు.

**ప్ర॥ మహావాక్యంనందు పద పదార్థములకు లక్ష్యలక్షక భావసంబంధం చెప్పుటకు కారణం ఏమి?**

జ॥ తత్పదము వాచకము, ఈశ్వరుడు వాచ్యార్థము తత్పదము లక్షకము, బ్రహ్మం లక్ష్యార్థము, త్వంపదం వాచకం, జీవుడు వాచ్యర్థము తత్పదం లక్షకం, బ్రహ్మం లక్ష్యార్థం, త్వంపదం వాచకం, ఆత్మ లక్ష్యార్థం, తత్వం పదములకు వాచ్యార్థంనందు జీవేశ్వరులందు గల ఉపాధులను విడచి ఉపహిత చేతనములను వేరు చేయుటకు బ్రహ్మాత్మలను లక్ష్యలక్షక భావ సంబంధం చెప్పబడెను.

**ప్ర॥ బ్రహ్మంనందు, ఆత్మయందు ఏ భ్రాంతులు గలవు? అవి ఎట్లు నివర్తించును?**

జ॥ బ్రహ్మంనందు పరోక్షతా భ్రాంతి, అనగా ఎక్కడనో ఉన్నడనుకొనుట, ఆత్మయందు పరిచ్ఛిన్నభ్రాంతి అనగా అది దేహంలోపల ఉన్నదనుకొనుట అనెడి భ్రాంతులు కలవు, ఈ భ్రాంతుల విశేషణ విశేషభావ సంబంధంచేత నివర్తించును. అదియే ఉద్దేశ విధేయ భావమనియు, ఓత ప్రోత భావం అనియు చెప్పబడును.

**ప్ర॥ విశేష్య విశేషణ భావ సంబంధంనందు విశేషణం వలన ప్రయోజనం ఏమి?**

జ॥ విశేషణం విశేష్యంనందున్న లోటును తొలగించును.

**ప్ర॥ తత్వమసి మహావాక్యంనందు విశేషణ విశేష్య భావసంబంధం ఎట్లు ఉపయోగపడును?**

ఉ॥ తత్వమసి వాక్యంనందు తత్పదార్థం విశేష్యమై త్వంపదార్థం విశేషణం అగును.

అప్పుడు విశేషణం విశేష్యమైన బ్రహ్మంనందుగల పరోక్ష భ్రాంతిని నివృత్తి చేయును. త్వంతదసి అని మరల వాక్యమును త్రిప్పవలెను. ఎందుకనగా ఆత్మయందు గల పరిచ్ఛిన్న భ్రాంతిని తొలగించుటకు చేయవలెను. త్వంపదార్థం విశేష్యమై తత్ పదార్థం విశేషణం అగును. అప్పుడు విశేషణంచే విశేష్యమైన ఆత్మయందు గల పరిచ్ఛిన్న భ్రాంతినివృత్తి యగును. ఇదే విధంగా మహావాక్యం లన్నింటియందును గ్రహింప వలయును. ఏ పదార్థం విశేషణం అగునో అదియే విధేయమగును. ఏ పదార్థం విశేష్యం అగునో అది ఉద్దేశమగును. దాని అనుసరించి ఉద్దేశ విధేయం భావములను అనుగ్రహింపవలయును. కూడికను పై నుండి క్రిందికి క్రింది నుండి పైకి కూడుటచే సంశయ రహితమైన అర్థం వచ్చును. సంశయ రహితం అగునంతవరకు అట్లు చేయవలయును. అట్లే బ్రహ్మాత్మలకు ఏకత్వం సిద్ధించునంతవరకు విశేషణ విశేష్యభావ సంబంధంను భావింపలవయును. ఓతప్రోత భావం అనగా ఒకదానియందు మరియొకటి బ్రహ్మమునకు ఆత్మతో అభేదమగును. ఆత్మకు బ్రహ్మంతో అభేదం అగును. **ప్రజ్ఞానం బ్రహ్మ, బ్రహ్మప్రజ్ఞానం అహంబ్రహ్మాస్మి బ్రహ్మైవాహమస్మి, తత్వమసి, త్వంతదసి, అయమాత్మాబ్రహ్మ, బ్రహ్మాత్మా.**

**ప్ర॥ మహావాక్యములందు జీవవాచక పదములెవ్వి? ఈశవాచక పదంలెవ్వి?**

జ॥ ప్రజ్ఞానం, అహం, త్వం, ఆత్మా ఈ పదములు జీవుని స్వరూపంను బోధించుచున్న వగుటచే జీవవాచక పదములు అనబడును. బ్రహ్మ, తత్, ఈ పదములు ఈశ్వరుని స్వరూపమును బోధించుటచే ఈశ వాచక పదములు అనబడును

**ప్ర॥ మహావాక్యములు ఎందువలన ఆదరనీయములు?**

జ॥ శబ్ద ప్రమాణమునందు విశ్వాసం కలుగకపోవుటకు నాలుగు కారణములు గలవు. ఇతర ప్రమామణములచే తెలియబడిన అర్థమునే బోధించుట ఉదా. నదీతీరమున ఐదు ఫలములు గలవు, వాయు వేగముగా పరుగెత్తెడి దేవతా, అని చెప్పినతో అవి ప్రత్యక్ష ప్రమాణమునకు తెలియబడినవియే అగుటచే ఆ వాక్యంనందు విశ్వాసం కలుగదు.

విరుద్ధార్ధమును బోధించుట. ఉదా. నదిలో రాళ్ళు తేలుచున్నవి. సురకాయలు మునుగుచున్నవి. అనెడి వాక్యం ప్రత్యక్ష విరుద్ధం అగుటచే దాని యందు విశ్వాసం కలుగదు. సందిగ్ధార్ధంను బోధించుట, ఉదా. ఇది త్రాదుగాని పాము గాని యగును, ఈ వాక్యంచే సందేహం కలుగుట వలన విశ్వాసం కలుగదు. ఏ అర్ధమును బోధింపక పోవుట, ఉదా. శంఖభేదీ ధ్వనులవలన, కాషట్, హూంఫట్, వలన ఏ అర్ధమును తెలియబడదు. కావున వాటి యందు విశ్వాసం కలుగును. మహావాక్యమును ఇతర ప్రమాణములచే తెలియబడని అద్వితీయ బ్రహ్మంను బోధించుటచేతను, విరుద్ధార్ధంను గాని, సందిగ్ధార్ధంను గాని బోధింపక పోవుట చేతను, అర్ధరహితములు గాక పోవుట చేతను వాటియందు విశ్వాసం కలుగును. మహావాక్యముల వలన జీవ బ్రహ్మ భేదం, జగత్తు యొక్క మిథ్యాత్వ జ్ఞానం కలుగును. అదే అర్ధమును ఇతర ప్రమాణముల బోధించుటచే లేక అనువదించుటచే అవి అనువాద ప్రమాణములనియు ప్రమాణాభాసములనియు చెప్పబడును.

ప్ర॥ జీవ బ్రహ్మములకు ఏ సంబంధం కలదు?

జ॥ దొంగ బాధింపబడి స్థాణువగునట్లు, జీవుడు బాధింపబడి కూటస్థుడై బ్రహ్మంతో అభేదం పొందుచున్నాడు. కావున జీవ బ్రహ్మలకు బాధసమానాధికరణ్య సంబంధం కలదు.

ప్ర॥ బ్రహ్మాత్మలకు ఏ సంబంధం కలదు?

జ॥ ఘటాకాశమునకు మహాకాశంతో నామమాత్ర బేధంకలదు (అభేదం) అట్లే బ్రహ్మాత్మలకు నామమాత్ర భేదం కలదు. కావున వాటికి ముఖ్య సామానాధికరణ్య సంబంధం కలదు.

ప్ర॥ మోక్షం అనగా ఏమి?

జ॥ సర్వానర్ధ నివృత్తి, పరమానంద ప్రాప్తి మోక్షం అనబడును.

ప్ర॥ మోక్షేచ్ఛ ఎందువలన భ్రాంతి అగును?

జ॥ జననమరణ సంసార దుఃఖమునకు కారణం అజ్ఞానం. రజ్జువు యొక్క జ్ఞానం లేకపోవుటచే సర్పభ్రాంతి కలిగినట్లు తన యొక్క స్వరూప జ్ఞానం లేక పోవుటచే అనగా అజ్ఞానం వలన సంసార దుఃఖం తోచుచున్నది. అందువలన అది కల్పితము. సంసార దుఃఖం కల్పితం అగుటచే దాని నాశం కోరుట భ్రాంతి అగును. (పరిహృత పరిహార్యం, అపరిహృత పరిహార్యం) నిజసర్పం యొక్క నాశం కోరవచ్చును గాని కల్పిత సర్పం యొక్క నాశం కోరుట తగదు. అది భ్రాంతి యగును. అట్లే సంసార దుఃఖం సత్యమైనచో దాని నాశం కోరవచ్చును, అది కల్పితం అగుటచే దాని నాశం కోరుట తగదు, మరియు భ్రాంతి అగును. ప్రాప్తి– 1. ప్రాప్తప్రాప్తవ్యం 2. అప్రాప్తప్రాప్తవ్యం అని రెండు విధములు. 1. ప్రాప్తప్రాప్తవ్యం అనగా – నిత్యప్రాప్తమైన దానిని మరచి మరల పొందుట. ఉదా. మరచిన కంఠాభరణం స్మరణకు వచ్చుట. (దశముని దృష్టాంతం) 2. అప్రాప్తప్రాప్తవ్యం అనగా లేని దానిని పొందుట, ప్రాప్తం కాని దానిని కోరవచ్చును కాని నిత్యప్రాప్తమైన దానిని కోరుట భ్రాంతి అగును. ఉదా. పంచదార యందు మధురత్వంలేనిచో తత్ప్రాప్తి కోరవచ్చును. మధురత్వం తన స్వరూపమే అగుటవలన తత్ప్రాప్తి కోరుట భ్రాంతియే అగును. అట్లే ఆత్మయందు ఆనందం లేనిచో ఆనందప్రాప్తికోరవచ్చును, ఆనందం తన స్వరూపమే అగుట వలన లేక నిత్యప్రాప్తం అగుటవలన ఆనందప్రాప్తిని కోరుట భ్రాంతియే అగును. (సూర్యుని దృష్టాంతం) ఈ విధంగా లేని సంసారదుఃఖ నివృత్తి కోరుట నిత్యప్రాప్తమైన ఆనందప్రాప్తిని కోరుట మోక్షేచ్ఛ భ్రాంతి అగును. నీవు జననమరణములు లేని సచ్చిదానంద బ్రహ్మంగా ఉన్నావు. కావున మోక్షేచ్ఛ విడువుము.

ప్ర॥ సప్తావరణములు ఎవ్వి?

జ॥ 1. అజ్ఞానం 2. ద్వైత ప్రపంచం 3. సుందరత్వా సుందరత్వ బుద్ధి 4. రాగద్వేషములు 5. శుభాశుభాకర్మలు 6. శరీరప్రాప్తి 7. జనన మరణ సంసారదుఃఖం ఇవి సప్తావరణములు అనబడును. వీటి వలన ఆత్మస్వరూపం మరుగుపడుచున్నది. (దూది దృష్టాంతం)

ప్ర॥ సంసారదుఃఖం లేనిచో కాన్పించుటకు కారణం ఏమి?

జ॥ రజ్జువును తెలియకపోవుటచేత సర్పభ్రాంతి కలుగునట్లు నీ స్వరూపం తెలియక పోవుటచేత సంసార దుఃఖం తోచుచున్నది. లేనిది ఉన్నట్లు తోచుట అధ్యాస అనబడును.

ప్ర॥ అధ్యాస అనగా ఏమి?

జ॥ భ్రాంతి పదార్థం దాని జ్ఞానం కలసి అధ్యాస అనబడును. ఇందు భ్రాంతి జ్ఞానం జ్ఞానాధ్యాసయనియు భ్రాంతి పదార్థం అర్థాధ్యాస అనబడును.

ప్ర॥ అర్థాధ్యాస ఎన్ని విధములు?

జ॥ 1. స్వరూపాధ్యాస 2. సంసర్గాధ్యాస అని రెండు విధములు.

1. ఏ పదార్థం యొక్క స్వరూపం అనిర్వచనీయముగా పుట్టుచున్నదో అది స్వరూపధ్యాస అనబడును. లేక వస్తు కల్పన. (మరియు ఏది అధిష్ఠానంకన్న విషయసత్త కలిగి అన్యథా స్వరూపం గలది స్వరూపాధ్యాస అనబడును. సర్పమునకు అధిష్ఠానమైన రజ్జు వ్యావహారికసత్తా సర్పం (ప్రాతిభాసకసత్తా) కావున సర్పమునకు రజ్జువుతో విషయసత్తగలదు. మరియు సర్పం రజ్జువు కంటె వేరైన రూపం కలదు. అందువలన అది స్వరూపాధ్యాస. రజ్జువునందు సర్పంను, స్థాణువునందు పురుషును, అనిర్వచనీయముగా లేక కల్పితముగా పుట్టునట్లు ఆత్మయందు అహంకారాది అనాత్మ పదార్థములు అనిర్వచనీయముగా పుట్టుచున్నవి. ఇవి స్వరూపధ్యాస అనబడును.

ప్ర॥ సంసర్గాధ్యాస అనగా ఏమి?

జ॥ 1. కల్పిత సంబంధం సంసర్గాధ్యాస అనబడును. పుష్పమునకు అద్దంనందు సంబంధం లేకపోయినను కల్పిత సంబంధంచే అద్దంనందు పుష్పం ఉన్నట్లు తోచుచున్నది. అట్లే ఆత్మకు అనాత్మయైన అహంకారంనందు సంబంధం లేకపోయినను కల్పిత సంబంధంచే అహంకారంనందు ఆత్మయొక్క ఉనికి తెలియబడుచున్నది. ఇదే సంసర్గాధ్యాస లేక సంబంధాధ్యాస అనబడును.

ప్ర॥ అధ్యాసలు ఎన్ని? అవిఏవి?

జ॥ 1.కేవల సంబంధా ధ్యాస 2. సంబంధసహిత సంబంధ్యధ్యాస 3. కేవల ధర్మాధ్యాస 4. ధర్మసహిత ధర్మధ్యాస 5. అన్యోన్యాధ్యాస 6. అన్యతరాధ్యాస అని ఆరు విధములు.

ప్ర॥ కేవల సంబంధా ధ్యాస అనగా ఏమి?

జ॥ అనాత్మయైన అహంకారంనందు అంతఃకరణంనందు ఆత్మయొక్క సంబంధకల్పన కేవల సంబంధాధ్యాస అనబడును. ఇదియే సంసార్గధ్యాస అనబడును. దీనివలన నేను ఉన్నాను, నేను విషయములను ఎరుగుచున్నాను విషయములకు ద్రష్టను అనెడి భావములు కలుగుచున్నవి.

ప్ర॥ సంబంధసహిత సంబంధ్యధ్యాస అనగానేమి?

జ॥ ఆత్మయందు అనాత్మయొక్కయు దాని సంబంధం యొక్కయు కల్పన సంబంధ సహిత సంబంధ్యధ్యాస అగును. దీనివలన నేను అజ్ఞానిని అనెడి భావం కలుగుచున్నది.

ప్ర॥ కేవల ధర్మాధ్యాస అనగా ఏమి?

జ॥ ఆత్మయందు అనాత్మలైన దేహేంద్రియముల ధర్మకల్పన కేవల ధర్మాధ్యాస అనబడును. దీనివలన నేను కుంటివాడను, గుడ్డివాడను మొదలగు అనెడి భావములును నేను బ్రాహ్మణాది వర్ణములు గలవాడను, బ్రహ్మ చర్యాది ఆశ్రమములు గలవాడను, బాల్యాద్యవస్థలు గలవాడను అనెడి భావములు కలుగుచున్నవి.

ప్ర॥ ధర్మ సహిత ధర్మ్యధ్యాస అనగా ఏమి?

జ॥ ఆత్మయందు అనాత్మయైన అహంకారంను దాని ధర్మములైన కర్తృత్వ భోక్తృత్వ కల్పన ధర్మసహిత ధర్మ్యధ్యాస అనబడును.

ప్ర॥ అన్యోన్యాధ్యాస అనగా ఏమి?

జ॥ ఆత్మ లక్షణములనాత్మయందును అనాత్మ లక్షణము ఆత్మయందును కల్పితమై తోచుట అన్యోన్యాధ్యాస లేక పరస్పరాధ్యాస లేక చిజ్జడ గ్రంథి అనబడును. సత్తు, చిత్తు, ఆనందం, అద్వితీయములు ఆత్మ లక్షణములు, అసత్తు, జడము, దుఃఖం, ద్వైతం అనాత్మ లక్షణములు అనబడును. ఆత్మ లక్షణములైన సత్తు చిత్తులు, కల్పిత సంబంధంచే అనాత్మయైన అహంకారంనందుగల అనృత జడములను మరుగుపరచుచున్నవి. అనాత్మ లక్షణములైన దుఃఖద్వైతములు ఆత్మయందు కల్పితములై ఆనంద అద్వితీయములను మరుగుపరచుచున్నవి. అందువలన నేను దుఃఖిని నాకంటె దేవుడు భిన్నుడు అనెడి భావం కలుగును.

**ప్ర॥ అన్యతరాధ్యాస అనగా ఏమి?**

జ॥ ఆత్మయందు అనాత్మలైన దేహేంద్రియకల్పన అన్యతరాధ్యాస అనబడును. దేహమున్నది, ఇంద్రియములు ఉన్నవి యనెడి భావములు కలుగుచున్నవి.

**ప్ర॥ పైన ఉదహరించిన ఆరుధ్యాసలలో స్వరూపాధ్యాసాలేవి? సంసర్గాధ్యాసాలేవి?**

జ॥ కేవల ధర్మాధ్యాస, అన్యతరాధ్యాస, ధర్మ సహిత ధర్మియధ్యాస, స్వరూపాధ్యాసయగును. కేవల సంబంధాధ్యాస, సంసర్గాధ్యాస అనబడును. అన్యాధ్యాసయందు స్వరూప సంసార్గాధ్యాసలు గలవు. సంబంధ సహిత సంబంధ్యధ్యాస సంసర్గసహిత స్వరూపాధ్యాసగా ఉన్నది. అధ్యాసయందు కల్పిత వస్తువునకు స్వరూపాధ్యాసయనియును. నిత్యమైన వస్తువునకు (ఆత్మ కల్పితం కాదు. కావున దానికి) సంసర్గా ధ్యాసయని చెప్పవలయును, ఇది నియమము.

**ప్ర॥ అధ్యాస విచారమునకు ప్రయోజనమేమి?**

జ॥ రజ్జువును తెలియకపోవుటచే సర్పభ్రాంతి కలిగినట్లు మరియు దాని యందు సత్యత్వబుద్ధిచే ప్రమాదమునకు గురియగునట్లు, ఆత్మ స్వరూపమును తెలియకపోవుటచే అనాత్మలైన దేహేంద్రియ మనోబుద్ధి అహంకారంలందును వాటి ధర్మములందును అహంకార మమకారములు గలుగుచున్నవని తెలుసుకొనుట అధ్యాస విచారమునకు ప్రయోజనం. అనగా ఇవి అన్నియు కల్పితములని తెలుసుకొనుట.

**ప॥ సర్పదృష్టాంతంనందు అసత్ఖ్యాతి అభిప్రాయం ఏది?**

జ॥ అసత్ఖ్యాతి అనగా శూన్యవాది, అతడు భ్రాంతి సర్పం రజ్జుస్థానమునందు గాని మరి యెక్కడను లేదు. అందువలన అది శూన్యమని చెప్పును భ్రాంతి సర్పం శూన్యమైనచో వంధ్యాపుత్రినివలె త్రికాలములయందు లేకపోవలెను. భ్రాంతి కాలమున సర్పం కాన్పించుచున్నందున అది శూన్యంగాదు.

**ప॥ ఆత్మఖ్యాతి అభిప్రాయమేమి? అది ఎందువలన సమీచనం కాదు?**

జ॥ క్షణిక విజ్ఞానరూప బుద్ధిని ఆత్మయని చెప్పెడివాది ఆత్మఖ్యాతి అనబడును. మెరుపువలె బుద్ధి క్షణికము మరియు అదియు క్షణ క్షణమునకు ఉత్పత్తి నాశమును బొందును. ఆ బుద్ధియందు సర్పం కలదు. అది భ్రాంతి బలమున రజ్జువునందు

తోచుచున్నది. కావున భ్రాంతి సర్పం రజ్జువునందు తోచుచున్నది. కావున భ్రాంతి సర్పం రజ్జువునందు లేదు. బుద్ధి యందుగలదని ఆత్మఖ్యాతి చెప్పును బుద్ధి యందలి పాము భ్రాంతి బలముచే రజ్జు ఉన్నట్లు తోచిన యెడల బుద్ధి క్షణికం అగుటచే రజ్జు జ్ఞానం లేకయే సర్పనాశం కావలయును. మరియు రజ్జు జ్ఞానం కలిగిన తర్వాత మరల భ్రాంతి సర్పం పుట్టవలయును. ఈ విధముగా జరుగుటలేదు. కావున ఆత్మ ఖ్యాతి మతము సమీచనంకాదు.

**ప్రశ్న॥ అన్యథా ఖ్యాతి మతాభిప్రాయం ఏమి? అది ఎందువలన యుక్తం కాదు?**

జ॥ అన్యదేశం నందున్న పదార్థం ఏదో ఒక కారణంచే సమీపం నందున్న మరియొక వస్తువునందు తోచునని చెప్పెడివాది అన్యథా ఖ్యాతి అనబడును. వాతకఫ దోషంచే జఠరాగ్ని మందగించునట్లు నేత్ర వ్యాధిచే నేత్ర దృష్టి మందగించును. అట్టి సదోషనేత్ర దృష్టిచే పుట్టయందలి పాము రజ్జువునందు తోచునని ఒక నయ్యాయకుడు చెప్పెను. నేత్ర దృష్టి బాగుగా ఉన్నవానికే పుట్టయందలి పాము కనిపించదు. నేత్ర దృష్టి లోపించిన వానికి పుట్టలోని పాము రజ్జువునందు ఎట్లు తోచును. ఇది అనుభవమునకు విరుద్ధం కాన, సమీచీనముకాదు. పైత్యదోషం చేత జఠరాగ్ని వృద్ధి పొందినట్లు నేత్ర దృష్టి అభివృద్ధియై పుట్టలో పాము రజ్జువునందు తోచుచున్నదని రెండవ నయ్యాయకుడు చెప్పెను. పైత్య దోషంచే పుట్టలోపాము రజ్జువునందు తోచిన ఎడల పుట్ట సమీపం నందుగల చెట్లు, గట్లు రజ్జువునందు తోచవలెను. అట్లు తోచుటలేదు కావున ఇది యుక్తి యుక్తంకాదు. పుట్టయందు పాముగలదు గాని రజ్జువునందు లేదు. ఐనను రజ్జుజ్ఞానం కలుగనందువలన సర్పజ్ఞానం కలుగుచున్నదని మూడవ నయ్యాయకుడు చెప్పెను. విషయం లేకుండ విషయజ్ఞానం కలుగదు. భ్రాంతి సర్పం లేకుండ దానిజ్ఞానం కలుగుట అసంభవము, కావున పై వాని వాక్యం సమీచీనము కాదు. సర్పంను ఎన్నడు చూడని వానికి రజ్జువునందు సర్పభ్రాంతి కలుగదు. పూర్వ దృష్ట సర్పజ్ఞానం కలవానికి రజ్జువునందు ఇది సర్పం అనెడి భ్రాంతి కలుగుచున్నది. ఇది సర్పం అనెడి సమయమున ఇది యనెడి రజ్జువుయొక్క సామాన్యాంశ జ్ఞానం సర్పం అనెడి స్మృతి జ్ఞానం, జీవునియందుగల భయ కంపాదులచే కలుగుచున్నవి. ఈ విషయం తెలియకపోవుటయే అజ్ఞానం. దాని వలన రజ్జువుయందు సర్ప భ్రాంతి కలుగుచున్నదని అఖ్యాతి చెప్పెను. సర్పభ్రాంతి కాలమున ఇది యనెడి అంశం సామాన్య రజ్జు జ్ఞానము కలిగినచో

సర్పభ్రాంతి ఉండదు. మరియు సర్పస్మృతి జ్ఞానం బుద్ధియందు కలుగును. కాని రజ్జువునందు తోచదు. ఒకవేళ బుద్ధి యందంగీకరించినచో సర్పస్మృతి జ్ఞానం పలుమార్లు కలిగినప్పుడే వాడు పరుగెత్తవలెను. కావున ఇది అనుభవమునకు విరుద్ధం అగుటచే యుక్తం కాదు.

**ప్ర॥ అనిర్వచనీయఖ్యాతి అభిప్రాయం ఏది?**

జ॥ రజ్జువునందు తోచిన సర్పం సత్యమైనచో రజ్జుజ్ఞానంచే దానికి నాశం కలుగకూడదు. కావున అది సత్తుకంటె విలక్షణం భ్రాంతి సర్పం లేనిచో వంధ్యాపుత్రుని వలె త్రికాలములయందు లేక పోవలయును. అందువలన అది ఆసత్తు కంటె విలక్షణము. సదసత్తుల కంటె విలక్షణమైనది. సదసద్ విలక్షణం అనబడును. మరియు ఉన్నదనిగాని లేదని గాని చెప్పుటకు వీలులేదు. కావున అనిర్వచనీయం అనబడును. ఈ విధంగా భ్రాంతి సర్పం అనిర్వచనీయమని అనిర్వచనీయ ఖ్యాతి చెప్పెను.

**ప్ర॥ భ్రాంతిసర్పం ఎందువలన చైతన్య వివర్తం అవిద్యా పరిణామం అగును?**

జ॥ అధిష్ఠానంకంటె విషమసత్త కలిగి అన్యథా స్వరూపంగలది వివర్తం అనబడును. కల్పిత సర్పమునకు అధిష్ఠానమైన రజ్జూప హితచైతన్యం పారమార్థిక సత్తగలది సర్పం ప్రాతి భాసికసత్తగలది. కావున సర్పమునకు అధిష్ఠానంతో విషయ సత్త గలదు. మరియు రూపరహితమైన అధిష్ఠానం కంటె భిన్నమైన రూపము సర్పంనందు కలదు. కావున భ్రాంతి సర్పం చైతన్యవివర్తం అనబడును. ఉపాదాన కారణంతో సమసత్తగలిగి అన్యథా స్వరూపం గలది పరిణామం అనబడును. పెరుగునకు ఉపాదాన కారణమైన పాలును, పెరుగును వ్యావహారిక సత్తలో ఉండుటనే అవి సమసత్త గలవి. మరియు పెరుగు పాలకంటె భిన్నమైన రూపం గలది. కావున పెరుగు పాలయొక్క పరిణామమని చెప్పబడును. భ్రాంతి సర్పమున కుపాదాన కారణమైన అవిద్యయును, భ్రాంతి సర్పమును ప్రాతి భాసికసత్తలో ఉండుటవలన అవి సమసత్తగలవి. మరియు అవిద్యకంటె భిన్నమైన రూపం సర్పంనందుగలదు. కావున భ్రాంతి సర్పం అవిద్యా పరిణామము అనబడును.

**ప్ర॥ జగత్తు ఎందువలన చైతన్య వివర్తము మాయాపరిణామం అగును?**

జ॥ జగత్తునకు అధిష్ఠానమైన బ్రహ్మ చేతనం పారమార్థికసత్తా, జగత్తు వ్యావహారిక

సత్తా, అందువలన జగత్తు చైతన్యం కంటె విషమ సత్తగలది. రూపరహితమైన బ్రహ్మమున కంటె జగత్తు భిన్నమైన రూపంగలది. కావున జగత్తు చైతన్యవివర్తం అనబడును. జగత్తునకుపాదాన కారణమైన మాయ అనిర్వచనీయం. దాని కార్యమైన జగత్తును అనిర్వచనీయం, కావున అవి రెండును సమసత్తగలవి. మరియు మాయకంటె భిన్నమైన రూపం జగత్తునందుగలదు. అందువలన జగత్తు మాయాపరిణామం అనబడును. ఈ విధంగా జగత్తు చైతన్య వివర్తం, మాయాపరిణామం అనబడును.

**ప్ర॥ సర్పభ్రాంతి ఎట్లు కలుగుచున్నది?**

జ॥ అంతఃకరణవృత్తి నేత్రం ద్వారా బహిర్గతమై రజ్జువును పొంది చీకటి ప్రతిబంధంచే వృత్తి సామాన్యరజ్జువు ఆకారం అగుచున్నది. అప్పుడు రజ్జు సహిత చైతన్యాశ్రిత అవిద్యాయొక్క (బాహ్యావిద్యా) తమోగుణాంశంచే సర్పంను, వృత్త్యుపహిత చైతన్యాశ్రిత అవిద్య యొక్క (అంతరావిద్యాయొక్క) సత్త్వగుణాంశంచే సర్పజ్ఞానంను పుట్టుచున్నది. అందువలన సర్పమునకు రజ్జూపహితచైతన్యం అధిష్ఠానం అగును.

**ప్ర॥ సర్పభ్రాంతి ఎట్లు నివర్తించును?**

జ॥ అంతఃకరణవృత్తి నేత్రం ద్వారా బహిర్గతమై రజ్జువును పొంది చీకటి ప్రతిబంధం తొలగగానే వృత్తి రజ్జ్వాకారమై తదావరణ భంగం చేయును. అప్పుడు రజ్జువు ప్రత్యక్షమై సర్పభ్రాంతి నివృత్తి అగును. సర్పం నాశం కలుగుటచే దాని జ్ఞానమునకు కూడ నాశం కలుగును.

**ప్ర॥ సర్పభ్రాంతి నివృత్తి విషయంలో సర్పాధిష్ఠాన జ్ఞానంచే సర్పనాశం కలిగినది. కాని సర్పజ్ఞానమునకు అధిష్ఠానమైన సాక్షి జ్ఞానం లేకుండా సర్పజ్ఞాన నివృత్తి ఎట్లగును?**

జ॥ జ్ఞానం విషయమునకు అధీనమై ఉండును. కావున విషయం లేక పోవుటచే దాని జ్ఞానం లయరూప నివృత్తి పొందును. ఇది మొదటి పక్షము. అంతఃకరణ వృత్తి నేత్రం ద్వారా బహిర్గతమై రజ్జువును పొంది రజ్జ్వాకారమై తదావరణ భంగం చేయును. అప్పుడు రజ్జువుపహిత చైతన్యంతో వృత్త్యుపహిత చైతన్యమైన సాక్షికి అభేదం కలుగుచున్నది. సర్పాధిష్ఠానజ్ఞాన సమయమున దానితో అభిన్నమైన సాక్షి జ్ఞానంను కలుగుచున్నది. అట్టి సాక్షి జ్ఞానంచే సర్పజ్ఞానమునకు నాశం కలుగుచున్నది. ఈ

విధంగా సర్పనాశమైనప్పుడే సర్పజ్ఞానమునకు నాశనం కలుగుచున్నది. ఇది రెండవ పక్షము.

**ప్ర॥ నివృత్తి ఎన్ని విధములు అవి ఏవి?**

జ॥ 1. లయరూపనివృత్తి 2. ఆత్యంతిక నివృత్తియని రెండు విధములు. 1.కార్యం కారణమున లయమగుట ఇది లయరూప నివృత్తి ఉదా: పంచదార బొమ్మ చూర్ణం అగునట్లు జగత్తు ప్రళయకాలమందున మాయయందు చేరుట లయరూప నివృత్తి అగును. 2. ఆత్యంతిక నివృత్తి కారణ సహిత కార్యంయొక్క నివృత్తి ఆత్యంతిక నివృత్తి అనబడును. ఉదా : పంచదార బొమ్మను పాలలో వేసినచో దాని స్వరూపమే కనిపించదు. అట్లే బ్రహ్మజ్ఞానంచే అజ్ఞానంను దాని కార్యం జగత్తును నశించుట ఆత్యంతిక నివృత్తి అనబడును.

**ప్ర॥ బ్రహ్మజ్ఞానంచే జగత్తు నశించినచో బ్రహ్మవేత్తకు మరల జగత్తు కాన్పించుటకు కారణం ఏమి?**

జ॥ అద్దం నందు పుష్పంలేదని తెలుసుకొనినప్పటికిన్నీ పుష్పం ఉన్నంతవరకు అది కనిపించును. అట్లే బ్రహ్మజ్ఞానంచే అజ్ఞానంను దాని వలన కలిగిన ఆవరణాంశం నాశమై ప్రారబ్ధపర్యంతం విక్షేప అంశం మిగిలి ఉండును. అందువలన జగత్తునందు సత్యత్వం లేని బ్రహ్మవేత్తకు జగద్వ్యవహారం ఉండును. అది బాధితానువృత్తిచే అనగా-మిథ్యాయనేడి జ్ఞానంచే లోకవ్యవహారం జరుగును. ఇంద్రజాలకుని పదార్థములు బాలకునకు సత్యముగను ఇతరులకు మిథ్యగను, ఇంద్రజాలకునకు తుచ్ఛంగా కప్పించును. అట్లే అద్వైతశాస్త్ర సంస్కార రహితునకు జగత్తు సత్యముగను, అద్వైతశాస్త్ర జన్య జ్ఞానం కలవారికి మిథ్యగను, అద్వైతానుభూతి గలవారికి తుచ్ఛంగా తోచును.

**ప్ర॥ సర్పము తద్ జ్ఞానములకు అధిష్ఠానములు భిన్నమని చెప్పినచో సర్వులకు రజ్జువునందు సర్పభ్రాంతి కలుగవలయును. అట్లు కలుగక పోవుటకు కారణం ఏమి?**

జ॥ సర్పభ్రాంతి విషయంలో భిన్నాధిష్ఠానములను చెప్పుట సిద్ధాంతం కాదు. సర్ప నివృత్తి కాలమున ఉపహిత చేతనములకు ఏకత్వం కలుగునని తెలియజేయుటకు చెప్పబడినది.

**ప్ర॥ స్వప్నమునకు నిమిత్తోపాదాన కారణములేమి?**

జ॥ స్వప్న పదార్థములకు అవిద్యా ఉపాదాన కారణం జాగ్రద్విషయజ్ఞాన జన్య సంస్కారములు నిమిత్తకారణములు.

**ప్ర॥ సాక్షిభాస్యం అనగా ఏమి? ఏవి సాక్షి భాస్యములు?**

జ॥ అంతఃకరణవృత్తి ద్వారా కాని అవిద్యావృత్తి ద్వారా కాని సాక్షిచే ప్రకాశింపబడుట సాక్షిభాస్యం అనబడును.

**ప్ర॥ సర్పమునకు ఆధారమేది? అధిష్ఠానమేది? ద్రష్ట ఎవరు?**

జ॥ రజ్జువుకు చైతన్యం ఆధారం, అధిష్ఠానమగును. అది సాక్షికంటే భిన్నం కానందున సాక్షియే ఆధారం, అధిష్ఠానం, ద్రష్ట అగును.

**ప్ర॥ జననమరణ సంసారం కల్పితమైనను దానివలన దుఃఖం కలుచున్నది. దాని నివృత్తికి ఉపాయం ఏది?**

జ॥ ఎండమావుల నీటివలన భూమి తడవనట్లు నాయందు కల్పితమైన సంసార దుఃఖం వలన నాకు ఏ హానియు లేదు. నేను నిష్క్రియ బ్రహ్మంను అద్వితీయుడను, అసంగుడను, అని పలుమారు భావించుట చేత సంసారదుఃఖనాశం అగును.

**ప్ర॥ అజ్ఞాన నివృత్తికి ఉపాయం ఏది?**

జ॥ అస్త్ర శస్త్రాదులచే గాని మరి ఏ సాధనములచే కాని అంధకార నివృత్తిగాదు. అది ప్రకాశంచేతనే నివృత్తి అగును. అట్లే అజ్ఞానం కర్మోపాసనలచే నివృత్తికాదు. దానికి విరోధియైన జ్ఞానంచేతనే నివృత్తి అగును. కర్మలు చేయునపుడు నేను కర్తను నేను భోక్తను. ఈశ్వరుడు కర్మఫలదాత అనెడి భేదం ఉండును. మరియు ఉపాసన చేయునపుడు పరమేశ్వరుడుపాస్యుడు. (ధ్యానింపబడువాడు) నేను ఉపాసకుడను, ధ్యానం

చేయువాడను. అనెడి భేదం ఉండును. ఉపాసనయును లేక యోగంను మానసిక కర్మలగుటచే అవియును కర్మలనియే చెప్పవలయును. ఈ విధంగా కర్మోపాసనలవలన భేదబుద్ధి అధికమగును. కావున వాటిచే అజ్ఞాన నివృత్తి కాదు. నేను కర్తను, నేను భోక్తను, నిష్క్రియ బ్రహ్మమే నేను అనెడి అహంబ్రహ్మాస్మి జ్ఞానంచే అజ్ఞానమును దాని కార్యమైన భేదబుద్ధి నివృత్తి అగును. అనగా జీవేశ్వర జగత్తులు సత్యములనెడి బుద్ధి నివృత్తి అగును.

**ప్ర॥ ఉపాధి భేదంచే చైతన్యం ఎన్ని విధములు?**

జ॥ 1. కూటస్థుడు, 2. జీవుడు, 3. ఈశ్వరుడు, 4. చైతన్యం అని నాలుగు విధములు.

**ప్ర॥ జీవేశ్వర స్వరూపనిరూపణలో ఎన్ని వాదములు గలవు అవి ఏవి?**

జ॥ 1. అభాసవాదం 2. అవచ్ఛేదవాదం 3. బింబప్రతిబింబవాదం. అభాస వాదంనందు అభాసుని అంగీకారం కలదు. ఈ వాదంరీతిగా అధిష్ఠానయుక్త సాభాసాంతః కరణము జీవుడు అధిష్ఠానం యొక్క సాభాసమాయ అధిష్ఠానము యుక్త సాభాసమాయ ఈశ్వరుడు అనబడును. సాభాసాంతఃకరణం విశేషణం, శుద్ధ చైతన్యం విశేష్యం, సాభాసాంతః కరుణ విశిష్ట చేతనం జీవుడు అనబడును. సాభాసాంతః కరణం జీవునకు విశేషణంగాను సాక్షికి ఉపాధిగా ఉన్నది.

**ప్ర॥ జీవుడు ఒకడా? అనేకులా?**

జ॥ కారణ జీవుడు ఒకడు, కార్యజీవులు అనేకులు, కార్య జీవులందే బంధమోక్ష వ్యవస్థలు గలవు. బింబ ప్రతిబింబవాదంనందు చెప్పబడిన కారణ జీవుడే జీవుడనియు, మిగిలినవి అహంవృత్తులనియు చెప్పునది ఏకజీవవాదం. ఇది ఉత్తమ అధికారికి యోగ్యం అగును.

ప్ర॥ సృష్టి విషయంలో ఎన్ని వాదములు గలవు అవిఏవి?

జ॥ అజాతవాదం, దృష్టిసృష్టివాదం, సృష్టి దృష్టివాదమని మూడు విధములు. కొరవి యొక్క భ్రమణంచే చక్రం కనిపించునట్లును. నేత్రవృత్తి యొక్క భ్రమణ వేగంచే అద్దంనందు ప్రతిబింబం కన్పించునట్లు మనస్సుయొక్క చలనంచే జగత్తు తోచుచున్నది. కాని జగత్తు పుట్టలేదు అని చెప్పుట అజాతవాదం అనబడును.

ప్ర॥ అజ్ఞానం ఏకమా అనేకమా?

జ॥ అజ్ఞానం ఏకమని చెప్పినచో ఒకడు ముక్తుడైనచో సర్వులు ముక్తులు కావలసినందే, కావున అజ్ఞానములు అనేకములు. అంధకారం ఒకటైనను అంధకారులు అనేకం అయినట్లు, మూల జ్ఞానం ఒకటైనను ఉపాధిభేదములచే తూలాజ్ఞానం లనేకములు. ఈ విధంగా చెప్పుటచే నానా జ్ఞానవాదంనందు ఏ దోషంలేదు.

**వేదముల శాఖలు - ఉపనిషత్తులు**

| | | |
|---|---|---|
| ఋగ్వేదశాఖలు | - | 21 |
| యజుర్వేదశాఖలు | - | 109 |
| సామవేదశాఖలు | - | 1000 |
| అథర్వణవేదశాఖలు | - | 50 |
| **మొత్తం శాఖలు** | - | **1180** |
| కర్మకాండ బోధించిన ఉపనిషత్తులు | - | 840 |
| ఉపాసన (భక్తి) బోధించిన ఉపనిషత్తులు | - | 232 |
| జ్ఞానంను బోధించిన ఉపనిషత్తులు | - | 108 |
| మొత్తం ఉపనిషత్తులు | - | 1180 |

ఒక్కొక్కశాఖకు ఒక్కొక్క ఉపనిషత్తు కలదు.

**బాహ్యవేశము గుణజ్ఞానం లేకపోతే నిరర్థకం**

గంగలోనే చేపలు ఉండును, చాతకపక్షి వర్షబిందువులనే త్రాగును, ఎలుకలు బొరియలలోనే ఉండును, కుక్క బూడిదలోనే ఉండును, సర్పం వాయు భక్షణం చేయును, కొంగమౌనము, మేక ఆకులను తినును. వాటికి ఏమైనా మోక్షం ఉన్నదా? లేదు.

# పరబ్రహ్మ స్వరూప వివరణ

చైతన్యం శుద్ధ బ్రహ్మం, మాయ సంబంధము వలన ఈశ్వరుడనియు, అవిద్యా సంబంధం వలన జీవుడనియు వ్యవహరింపబడుచున్నది.

ప్రజ్ఞానం బ్రహ్మ - సంపూర్ణ జ్ఞాన పరబ్రహ్మ లక్షణ వాక్యం ఋగ్వేదం (ఐతరేయోపనిషత్తులోనిది) అహంబ్రహ్మాస్మి - నేను బ్రహ్మం అయి ఉన్నాను అనుభవ వాక్యం యజుర్వేదం (బృహదారణ్యకోపనిషత్తులోనిది) తత్త్వమసి ఆ పరమాత్మయే నీవై ఉన్నావు ఉపదేశవాక్యం సామవేదం (ఛాందోగ్యోపనిషత్తులోనిది) అయమాత్మాబ్రహ్మ - ఈ ఆత్మయే బ్రహ్మ, సాక్షాత్కార వాక్యం అధర్వణవేదం (మాండూక్యోపనిషత్తులోనిది)

'అ' కారము - విశ్వుడు, వైశ్వానరుడు, వ్యాప్తి, జాగ్రదవస్థ స్థూలప్రపంచం

'ఉ' కారము - తైజసుడు, హిరణ్యగర్భుడు, ఉత్కృష్టం స్వప్నావస్థ సూక్ష్మ ప్రపంచం ఉభయత్వం ఏకీభావం నందెందుట. అమాత్రతురీయం, ఉపశయం, అవ్యవహారం.

**షడ్దర్శణములు :** 1. పూర్వమిమాంస 2. ఉత్తరమీమాంస 3. న్యాయం 4.వైశౌశికం 5. సాంఖ్యం 6. యోగం.

**ఆరు వేదాంగములు :** 1. శిక్ష 2. వ్యాకరణం 3. ఛందస్సు 4. నిరుక్తం 5. జ్యోతిష్యం 6. కల్పం, షడ్‌శాస్త్రములు : 1. మీమాంస 2. న్యాయం 3. పురాణం 4.ధర్మశాస్త్రం 5. నీతిశాస్త్రం 6. అర్థశాస్త్రం . ఆరు అనాది పదార్థములు : 1. బ్రహ్మం 2. ఈశ్వరుడు 3. జీవుడు 4. అవిద్య 5. భేదం 6. సంబంధం. మాయకు ఆరు నామములు : 1. అవిద్య, 2. మాయ, 3. అజ్ఞానం, 4. ప్రకృతి, 5. శక్తి, 6. అనిర్వచనీయం. సప్తజ్ఞాన భూమికలు : 1. శుభేచ్ఛ 2.విచారణ 3. తనుమానస 4.సత్వాపత్తి 5. అసంసక్తి 6. పదార్థభావన 7. తుర్యగ. సప్తస్వరములు :

1. షడ్జిమం 2. ఋషభం. 3, గాంధారం 4. మధ్యమం 5. పంచమం 6. ధైవతం, 7. నిషాధం.

యోగం అనగా సమాధియని అర్థం. సమాధి రెండు విధములు సంప్రజ్ఞాత సమాధి – 2. అసం ప్రజ్ఞాత సమాధి **1.సంప్రజ్ఞాత సమాధి అనగా** 1. క్షిప్తం 2. మూఢం 3.విక్షిప్తం 4. ఏకాగ్రం 5. నిరుద్ధం.

1. క్షిప్తం అనగా : రజోగుణం, 2 మూఢం అనగా : తమోగుణం, 3. విక్షిప్తం అనగా : రజస్తమ సత్వగుణముచే ధ్యానమందు ప్రవర్తించునది. ఇది క్షిప్తంకంటే శ్రేష్ఠమైనది. 4.ఏకాగ్రం అనగా : శుద్ధసత్వగుణంచే ఏకాగ్రం కలుగుట. 5. నిరుద్ధం అనగా సకలవృత్తులు నశించి సంస్కారం మాత్రం మిగులునది. 2. అసంప్రజ్ఞాత సమాధి – **"యోగశ్చిత్తవృత్తి నిరోధః – చిత్తవృత్తులను నిరోధించుటయే యోగం" "తదాద్రష్టు స్వరూపేవస్థానమ్"** అసంప్రజ్ఞాత అవస్థలో అంతర్ముఖావస్థలో చేతన పురుషునకు నిర్వికారమైన నిజరూపంనందు ఉనికి కలదు. వృత్తి సారూప్య ఇతరత్రా బహిర్ముఖవస్థలో చేతన పురుషునకు చిత్తవృత్తులతో సమానరూపం భాసించును. **"వృత్తయః పంచతయ్యః క్లిష్టాక్లిష్టాః"** నిరోధింపదగిన చిత్తవృత్తులు అనేకములు అందు ఐదు వృత్తులు చెప్పబడినవి. అవి క్లిష్టములనియు, అక్లిష్టములనియు రెండు విధములు. అవిద్యాదిక్లేశం వలన ఉదయించి ధర్మాధర్మ వాసనా సమూహములకు అలంబనమగు ప్రవృత్తి గలవి. అవిద్యాది క్లేశములతో కూడుకొనక స్వరూపజ్ఞానం గలవిగా నుండిన అక్లిష్టంలనియు వచింపబడెను. **"ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రాస్మృతయః"** ప్రమాణం, విపర్యయం, వికల్పం, నిద్ర, స్మృతి ఇవి ఐదు చిత్తవృత్తులు. **"ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని"** ప్రత్యక్షం, అనుమానం, ఆగమం, అనునవి మూడు ప్రమాణములు. హేతువు విషయమగు జ్ఞానంచే జనించిన చిత్తవృత్తి అనుమానం. నేత్రాది ఇంద్రియముల ద్వారా కలుగు చిత్తవృత్తియే ప్రత్యక్షం అప్తునిచే ఉచ్చరింపబడు వాక్యంచే కలుగు తదర్థ విషయక చిత్తవృత్తి ఆగమ ప్రమాణం. ప్రమ = జ్ఞాన = ప్రమాణం = జ్ఞానసాధనం **"ప్రమీయతే**

**ఏనతత్ ప్రమాణమ్"** ఆగమ ప్రమాణం అనగా – శబ్ద ప్రమాణములు వేదములు, ఉపనిషత్తులు, శాస్త్రములు వైదిక షడ్దర్శనములు. 1. సాంఖ్యశాస్త్రం – సూత్రకర్త కపిలుడు భాష్యకర్తవిజ్ఞాన భిక్షువు. 2.యోగశాస్త్ర సూత్రకర్త పతంజలి, భాష్యకారుడు వేదవ్యాసుడు, 3.న్యాయశాస్త్రం సూత్రకర్త గౌతముడు, గౌతమునికి అక్షిపాదుడని పేరు. అక్షిపాదుడు అనగా – అరకాలిలో నేత్రం కలవాడు. భాస్యకర్త వాత్స్యాయనుడు. 4. వైశౌషిక దర్శనం సూత్రకర్త కణాదుడు. అన్నంమెతుకులు ఏరుకొని తినినవాడు కనుక కణాదుడు, కణములను తినువాడు. ప్రశస్తపాదుడు భాష్యంను వ్రాసెను. 5.పూర్వ మీమాంసా శాస్త్రకర్త జైమిని మహర్షి, శబరస్వామి భాస్యకర్త దీనిని శబరభాస్యం అని అందురు. 6.ఉత్తర మీమాంసాశాస్త్రం – సూత్రకర్త వేదవ్యాసుడు. భాస్యకారులు శంకరాదులు. 1. శంకరభాష్యం 2. రామానుజా భాష్యమునకు శ్రీ భాష్యమని పేరు. మద్వభాష్యం నీలకంఠలు. నీలకంఠభాష్యం, నింబార్కరాచార్య భాష్యం, వల్లభాచార్య భాష్యం. చైతన్య ప్రభువుల భాష్యం చైతన్య భాష్యం, ఉత్తర మీమాంసమనగా – బ్రహ్మసూత్రములు తెలియజేయునది బ్రహ్మమీమాంస. పూర్వమీమాంస వైదిక కర్మానుష్ఠానం, కర్మమీమాంస. మీమాంస అనగా – విమర్శ అని అర్ధం.

**"ఏకమేవాద్వితీయమ్"** సత్యం, జ్ఞానం, అనంతంబ్రహ్మ, సత్, చిత్ ఆనందం, అద్వైతం, పరబ్రహ్మస్వరూపం త్రికాలా బాధ్యమైనది. మల, విక్షేప, ఆవరణ రహితం పరబ్రహ్మస్వరూపం. బ్రహ్మానంద స్వరూపుడు, పరమైనవాడు, సుఖస్వరూపుడు, కేవలం జ్ఞానస్వరూపుడు, ద్వంద్వాతీతుడు, గగనసదృషుడు, తత్త్వమస్యాది లక్ష్య స్వరూపుడు, ఏకస్వరూపుడు, నిత్య స్వరూపుడు, విమల స్వరూపుడు, అచలుడు, సర్వమునకు సాక్షిభూతుడు, భావమునకు అతీతుడు, త్రిగుణాతీతుడు అయిన సద్గురువునకు నమస్కారము.

సాధన చతుష్టయ సంపత్తి – 1. నిత్యానిత్యవస్తు వివేకం 2. ఇహాముత్రార్థ ఫలబోగ విరాగం 3. షమాదిషట్క సంపత్తి 4. ముముక్షత్వం.

**1. నిత్యానిత్యవస్తువివేకం :** నిత్యం ఏది, అనిత్యం ఏది అను వస్తువు యొక్క వివేకజ్ఞానం కలిగి ఉండుట. **"అనిత్యానిచసర్వాణి"**. చరాచర ప్రాణికోటితోకూడిన ఈ సృష్టి క్షణికం నశించునది అను జ్ఞానం కలిగి ఉండడం. **"యత్‌దృష్యంతన్నశ్యతి"** ఈ కనబడునంతయు నశించునదే, 'ధృక్' చూచువాడు శాశ్వతుడు, 'దృష్యం' చూడబడునది నశించునది. కావున పరమాత్మ శాశ్వితుడు.

**2. ఇహాముత్రార్ధం ఫలభోగవిరాగం :** ఇహలోక సుఖములందు గాని, పరలోక సుఖములందు వాంఛ లేకుండకపోవడం, వైరాగ్యం కలిగి ఉండడం.

**3. షమాదిషట్కసంపత్తి :** ఆరు దివ్య సంపత్తులు కలది : 1. శమం 2. దమం 3. ఉపరతి 4. తితీక్ష 5. శ్రద్ధ 6. సమాధానం వీటి నిర్వచనం ఈ క్రింద తెలుపబడినది.

**1. శమం :** అంతరేంద్రియనిగ్రహం, జ్ఞానేంద్రియములను సంయమం పాటించి దైవంనందు ప్రవృత్తి కలిగి ఉండడం.

**2. దమం :** బాహ్యేంద్రియ నిగ్రహం, కర్మేంద్రియములను నిగ్రహించి ప్రాపంచిక విషయ భోగముల నుండి నివృత్తి కలిగి ఉండడం.

**3. ఉపరతి :** ఉప = సామాన్యం, రతి = రమించడం. పరమాత్మ యొక్క స్వరూపంను చింతించడం, ధ్యానించడం, ఆయన సన్నిధిలో ఐక్యస్వరూపంగా నిలిచిపోవడం, మనస్సును పరమాత్మయందు ఐక్యపరచడం.

**4. తితీక్ష :** సహించుకొనడం, సాధన దశలో శీతోష్ణాది సుఖదుఃఖములను భరించి స్థిరుడై నిలుచుట.

**5. శ్రద్ధ :** పట్టుదల కలిగి ఉండడం, నికలడ కలిగి ఉండడం, గురువుయందు, శాస్త్రములందు శ్రద్ధ, విశ్వాసం కలిగి ఉండడం, అహర్నిశంబులు పరబ్రహ్మంను ధ్యానించుచు, స్తుతించుచు స్థిరుడై నిలుచుట.

**6. సమాధానం :** ఏ లక్ష్యం కొరకై అహర్నిశంబులు శ్రమించితివో అట్టి ఆత్మస్వరూపమందు స్థిరుడవై నిలుచుట.

**7. ముముక్షత్వం :** పరబ్రహ్మస్వరూప నిరూపణయందు సాధన దశలో గురువు ద్వారా, శాస్త్రములద్వారా తెలుసుకొనే తాపత్రయాన్ని ముముక్షత్వం అందురు. ఇట్టి సాధన సంపత్తి కలిగి ఉండిన వాడే గురువు, వేదాంతాది శాస్త్రములయందు అర్హత కలిగినవాడు. **"శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం సగురుమేవాభి గచ్ఛతి"** సాధన చతుష్టయ సంపత్తియందు పూర్ణత్వం కలిగినవాడే గురువు, వేదాంతాది శాస్త్రముల యందు శ్రవణం చేయుటకు అర్హుడు. ఇట్టి సాధనలేని వ్యక్తి నిరర్థకుడు, అర్హతలేని వాడు.

## మూడు గుణాలతో ఉన్నది "స్త్రీ"

"స్త్రీ"లో మూడు అక్షరములు కలవు. 'స' సత్వగుణం, 'ర' రజోగుణం, 'త' తమోగుణం. ఈ మూడు గుణములతో స్త్రీ ఏర్పడినది. ఈ మూడు గుణముల యందు రమించువాడు స్త్రీ స్వరూపుడు. అజ్ఞానులందరు స్త్రీ స్వరూపులు. ఆకారములకు ప్రాధాన్యం ఇవ్వకుండా గుణములకు ప్రాధాన్యమిచ్చి అజ్ఞాన స్వరూపంను తేటతెల్ల పరచునది వేదాంతశాస్త్రం.

**శంకర :** "శం" అంతరేంద్రియ నిగ్రహుడు, "కర" రమించువాడు, అంతర్లీనుడు. అంతరేంద్రియములను కేంద్రీకరింపచేసి ఆత్మ స్వరూపంనందు లీనుడైనవాడు శంకరుడు.

**విష్ణువు :** విశ్వవ్యాపకుడు విష్ణువు, సర్వాంతర్యామి. **"అంతర్బహిశ్చవ్యాప్య నారాయణస్థితః"**

**బ్రహ్మ :** బ్రహింపచేయువాడు, సృష్టికర్త మానవా! ఓ మానవా! దుర్గుణములు మానవా, మానినవాడే మానవుడు. మానవుడు = 'మ' కానివాడు. అనవుడు

క్రొత్తకాని, అనవుడు క్రొత్తకాని మ+అనవుడు. సనాతనుడు మానవుడు, ఆత్మ స్వరూపుడు. పరబ్రహ్మస్వరూపుడు, జ్ఞానస్వరూపుడు, మానవుడే మాధవుడు. మమ అను రెండు అక్షరములు కలిగి నాది అనడం బంధం. 'నమమ' అను మూడు అక్షరములు కలిగి ఉండడం నాది కాదనడం మోక్షం. ఇదియే బంధరాహిత్యం.

**అహం** : నేను, మమ – నాది, నేను నాది అనే అహంకారం బంధమునకు హేతువు.

## ఓం నమఃశ్శివాయ ధం రాం

అధారం నందు విఘ్నహర భీజములు స్వాధిష్ఠా, రక్షాకర బీజములు, మణిపూరక సౌభాగ్యదాయక బీజములు. అనాహత, సర్వసిద్ధి ప్రద బీజములు

1. ఆధార చక్రంనందు విఘ్నహర బీజములు 4.వ, శ, ష, స గణపతి అధినేత.
2. స్వాధిష్ఠానము నందు రక్షాకర బీజములు 6.బ, భ, మ, య, ర, ల బ్రహ్మ అధిదేవత.
3. మణిపూరకము నందు సౌభాగ్యదాయక బీజములు 10. డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ విష్ణు అధిదేవత.
4. అనాహతము నందు సర్వ సిద్ధి ప్రద బీజములు 12. క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ రుద్రుడు అధిదేవత.
5. విశుద్ధ చక్రంనందు 16 షోడశస్వరములు. మహేశ్వరుడు అధిదేవత. అ. ఆ, ఇ, ఈ, ఉ, ఊ, రు, రూ లు, ల్లూ, ఎ, ఐ, ఒ, ఔ, అం, అః. ఇందులో ఒక్కొక్క స్వరము సప్త విధములగును. స, రి, గ, మ, ప, ద, ని యను బేధముల చేత 112 అగును. ఇందులో మరల ఒక్కొక్కటి, ఉదాత్తు, అనుదాత్తు స్వరిత భేదములచే త్రివిధములగును. అందువలన ఒక్కొక్క స్వరము 336 రకము లగును. ఇవి ప్రాణములు, ఇవి హల్లులతో కూడి ప్రాణులై వీర్యవంతములై

ఉపాసకునకు, బీజముల ద్వారా, అభీష్ట సిద్ధి ఇచ్చుచున్నవి. జీవుడు ఎపుడు అధోముఖుడై బ్రహ్మాది దేవతలను ఉపాసించునో, అపుడు కాకి అనబడును, వైరాగ్యం కలిగినవాడై ఉపాసనను విడచి జ్ఞాన మార్గమున ప్రవేశించునో అనగా ఊర్ధ్వ ముఖుడగునో, అపుడు జీవుడు హంస అనబడును.

6. ఆజ్ఞా చక్రమునందు, హం, కం, అను రెండు బీజాక్షరములు గలవు. సదాశివుడు అధిదేవత. హం అను బీజమునకు వాచ్యార్థము విశిష్టాత్మ లేక అహంకారము, లక్ష్యార్థము విశుద్ధాత్మ లేక కూటస్థుడు హ శబ్దమునకు వాచ్యమైన అహంకార మున్నపుడు మమకారం తప్పనిసరిగా ఉండును. అందువలనను, విశుద్ధాత్మను ఎరిగినపుడు, అహంకారం లేకపోవును. అది లేనపుడు మమకారం కూడ లేకపోవును. అందువలన మమకారమునకు వాచకమైన, ళ కారం లోపించినది. 'క్షం' అను బీజము, శిఖామణి బీజం అనబడును. 'క్షం' అను శబ్దమునకు ఈశ్వరుడు వాంచ్యార్థములేక అపరాజ్ఞానము లక్ష్యార్థము పరబ్రహ్మము లేక పరాజ్ఞానము అనబడును. సహస్రారము నందు 'రాం' అను బీజాక్షరం కలదు. దీని యందుగల ర కారము అగ్ని బీజము. ఇది కర్మేంద్రియ పంచకమునకు ఉపలక్షణకమగును. 'అ' అనెడి సూర్య బీజం జ్ఞానేంద్రియ పంచకమునకు ఉపలక్షకమగును. 'మ' యను చంద్ర బీజము, అంతఃకరణ చతుష్టయమునకు ఉపలక్షకమగును. ఈ విధంగా పదునాలుగు త్రిపుటలతో కూడిన యావత్ ప్రపంచం 'రాం' బీజమునకు వాచ్యార్థమగును. క్రపపంచాధిష్ఠాన శుద్ధచైతన్య నిర్గుణ బ్రహ్మము 'రాం' బీజమునకు లక్ష్యార్థమగును. అదియే సద్గురుమూర్తి. అనిర్గుణ బ్రహ్మమే నేను. నాకంటె భిన్నమైన జగత్తు లేదు, అని తెలుసుకొనినపుడు, జీవుడు పరమహంస అనబడును. అట్టి జ్ఞానంచే, అజ్ఞానమును నశింపజేసికొని అజ్ఞానంను కూడ విడిచినప్పుడు, పరమహంస సంన్యాసి అనబడును. ఆధారం నందు 'ఓం' స్వాధి 'న' మణి 'మః' అనాహతమునందు 'శి' విశుద్ధమునందు 'వా' ఆజ్ఞా 'య' కుడి కర్ణ రంధ్రం నందు 'ధరం' సహస్రారమందు 'రాం' అని తెలియవలెను.

# స్థూల దేహం - ఆత్మ

1. మూలాజ్ఞాన పరిణామములగు పంచభూతముల సాత్వికాంశ సమిష్టివలన కలిగిన అంతఃకరణము, అంతఃకరణాధిష్ఠాన చైతన్యం, అంతఃకరణము నందలి చిదాభాసుడు కూడి వ్యావహారిక జీవుడనబడును. విశ్వుడని కూడ అందురు.

2 జాగ్రద్వాసనాయుక్తమైన అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము నాశ్రయించిన తూలాజ్ఞాన పరిణామమగు కల్పితాంతః కరణము, కల్పితాంతః కరణాధిష్ఠాన చైతన్యము, కల్పితాంతః కరణమునందలి చిదాభాసుడు కూడి ప్రాతిభాసిక జీవుడు అనబడును. ఇతనినే తైజసుడు అందురు.

3. సుషుప్త్యవస్థ యందు ఇంద్రియాంతః కరణములు వాని వృత్తులతో తమ కారణమగు అజ్ఞానమున లయించుచున్నవి. అజ్ఞానం, అజ్ఞానాధిష్ఠాన చైతన్యము, అజ్ఞానము నందలి చిదాభాసుడు కూడి పారమార్థిక జీవుడనబడును. ప్రాజ్ఞుడని కూడ అందురు.

4. స్థూల ధేహం, ఇల్లు, ఎముకలు దూలములు, గుంట దూలములు మొదలగునవి. కాళ్లు, చేతులు స్తంభములు. చిన్న చిన్న యెముకలు రాళ్లు, ఇటుకలు మున్నగునవి. మాంసం మట్టి, లేక సున్నం చర్మం యొక్క తెలుపు, ఎరుపు, నలుపు మొదలగునవి రంగులు. నేత్రములు, చెవులు, నోరు, ముక్కు మున్నగునవి ద్వారములు. కిటికీలు, గోళములు, గూళ్లు ఇంద్రియములు గూళ్లయందున్న పనిముట్లు. రోమములు గడ్డి మొదలగునవి. దేహ రూపమగు ఇంటిలో ఆత్మరూపుడగు యజమానుడు కలడు. ఆ యజమానుడు తన దేహంను చూచి ఇది నా దేహమని చెప్పుచున్నాడు. కాని నేను దేహంను అని చెప్పుట లేదు. ఇంటిలోని వస్తువులు కాని నశించునపుడు ఇంటి యజమాని నశించునట్లు, స్థూలదేహం యొక్క అవయవములు గాని నశించునప్పుడు ఆత్మ నశించదు.

అజ్ఞానమే కారణ దేహం. ఆత్మస్వరూపం ఎరుంగకుండుటయే అజ్ఞానం. ఈ అజ్ఞానం వలన అసత్త్వావరణము, అభానావరణము అను ఆవరణ ద్వయము కలుగుచున్నది. ఇందు ఆత్మలేదనునది అభానావరణము. ఈ ఆవరణ ద్వయం వలన స్థూల, సూక్ష్మ దేహములు, వానియందు ఆత్మభ్రాంతి కలుగుచున్నది. దాని వలన సకల దుఃఖములు సంభవించుచున్నవి. ఇదియే విక్షేపము. ఈ అనర్థముల కన్నిటికీ కారణం అజ్ఞానం. అజ్ఞాన రూపమగుకారణదేహం దృశ్యము. ఆత్మ, ద్రష్ట, గృహంనందున్న చీకటి తన్నుగాని, గృహంనుకాని, గృహంనందుండు పరికరములను కాని, తెలియజాలని రీతి, అజ్ఞానం తన్నుకాని స్థూల సూక్ష్మ శరీరములను కాని ఎరుగజాలదు. కావున ఇది జడము.

విశ్వతైజసుల భోగములు త్రిపుటుల వలన కలుగునట్లు ప్రాజ్ఞని భోగంకూడా త్రిపుటి వలననే కలుగుచున్నది. చైతన్య ప్రతిబింబ సహితమగు అవిద్యావృత్తి ఆధ్యాత్మ ఈశ్వరుడు అధిదేవత. అజ్ఞానావృతమైన స్వరూపానందం అధిభూతము. జాగ్రత్స్వప్నముల యందు గల జ్ఞానమంతయు ఘనీభవించి అవిద్యారూపం అగుచున్నది. అప్పుడు అవిద్యా విశిష్ట చైతన్యమే ప్రజ్ఞాన ఘనుడు. ప్రజ్ఞానఘనుడు, ప్రాజ్ఞుడు. ప్రజ్ఞానఘనుడే ప్రాజ్ఞనిది కారణము. అవ్యాకృతుని ఉపాధికారణం వీరిద్దరికభేదము. ప్రణవం యొక్క తృతీయ మాత్ర మకారము కూడభిన్నం కాదు. స్థూలోపాధితో కూడిన విరాడ్రూపుడగు విశ్వుడు అకార మాతృకకు వాక్యము. విశ్వునకు అకారము వాచకము. స్థూలోపాధి కధిష్ఠానమగు శుద్ధ చైతన్యమునకు అకారము లక్ష్యము. శుద్ధచైతన్యము లక్ష్యము. అదే ఈ విధంగా ఇతరములకు కూడా తెలియవలెను.

శ్లో॥ ఉపాధ్యాయాన్ దశాచార్య ఆచార్యాణాం శతంపితా!
సహస్రన్తు పితౄన్మాతా గౌరవేణాతి రిచ్యతే॥

తా॥ పదుగురు ఉపాధ్యాయులకన్న ఒక వంశాచార్యుడు అధికుడు. అట్టి కుల గురువులు నూరుగురికన్న ఒక తండ్రి అధికుడు. అట్టి వేయి తండ్రులకన్న తల్లి అధిక పూజ్యురాలని అందుకే వేదాలలో తల్లికి ప్రథమ స్థానం ఇవ్వబడింది.

# అంతర తారకము

సిద్ధాసనమున గాని, పద్మాసనమునగాని కూర్చుండి పెదవులను బంధించి, క్రింది దంతములు పై దంతములకు తగులనీయక, జిహ్వేంద్రియమునణచి, ఇడా పింగళయందు సంచరించెడి హంసను మరల్చి ఉప జిహ్వా మార్గమున సుషుమ్నానాడి యందు ప్రవేశపెట్టి, ఊర్ధ్వముగ నడిపించుచు, దానితో ప్రణవాక్షరము అనుసంధానం చేయుట అంతర తారకము అనబడును.

## అంతరాంతర తారకము

సుషుమ్నాంతరమున సంచరించు సహస్రారకమల కర్ణికయందు నిశ్చలమై నిలిచియున్నప్పుడు, హంస నిలిచి యున్న చోటు మనో దృక్కులు కూడ నిలిచి యున్నప్పుడు నిర్వికల్ప సమాధి అనియు, అంతరాంతర తారకమని చెప్పబడును.

## మాత్రాత్రయ తారకము

ఇడా పింగళ నాడులయందు లోపలికి, వెలుపలికి సంచరించుచుండెడి హంసయొక్క మార్గమును మరలించి ఉప జిహ్వానుండి ఊర్ధ్వంగా సుషుమ్నా నాళంనందు నడిపించుచు రేచకము నందు హంసతో అకార, ఉకార, మకారములను మాత్రాత్రయమును గూర్చి జపించుచు వ్యష్టి, సమిష్టి రూపములగు స్థూల, సూక్ష్మ, కారణోపాధులను విడచుచున్నట్లు, భావన చేయవలయును. పూరకము నందు హంసతో ఓంకారం ను గూర్చి జపించుచు వ్యష్టి, సమిష్టి రూపములగు స్థూల, సూక్ష్మ కారణోపాధులకు అధిష్ఠానమగు శుద్ధ చైతన్యమును తానుగా భావన చేయవలెను. ఇట్లు అధ్యస్థములగు సర్వోపాధులను విడిచి, అధిష్ఠానమగు శుద్ధ చైతన్యమును తానుగా భావించుటయే మాత్రాత్రయ తారకము అనబడును.

## శివయోగ తారకము

పైన చెప్పిన విధముగా మాత్రాత్రయ తారకమును ప్రయత్న పూర్వకముగా

అభ్యసించినచో ఉపాధుల భ్రాంతిని వర్తిల్లును. తర్వాత విజాతీయములగు ఉపాధుల భావమును అంతఃకరణమున కలుగనీయక, ఉప జిహ్మా నుండి ఊర్ధ్వముగా సుషుమ్నానాడియందు సంచరించెడి హంస యొక్క రేచక, పూరకముల యందు ఓంకారమును గూర్చి తాను శుద్ధ చైతన్య స్వరూపుడ ననెడి భావంతో నిరంతరము ధ్యానించుచుండవలయును. ఇట్లు అంతరాయ రహితముగా చేసెడి ధ్యానంచే సర్వభ్రాంతులు సమసిపోయి నిరతిశయ బ్రహ్మ భావం స్థిరపడును. ఈ బ్రహ్మ భావం వలన బ్రహ్మజ్ఞానం ఉదయించి, దానివలన మోక్షం కలుగును.

## వేదాంత న్యాయములు

1. అంకోల బీజన్యాయము = ఊడుగు గింజలు మొదట చెట్టుక్రింద రాలియు మృగశిర కార్తిలో ఒకవర్షం కురియగానే గింజలు ఎగిరి మరల చెట్టుకు అంటుకొనును.
2. అజగరన్యాయము = కొండ చిలువ లావుగా ఉండుటచేత మెదలక ఒకచోట పడియుండును. దగ్గరకు వచ్చిన జంతువులను భక్షించును.
3. అజాగళ న్యాయము = మేక మెడకు వ్రేలాడు చనులు (వ్యర్థము)
4. అంధకూపన్యాయము = ఒక గ్రుడ్డివాడు నూతిలో పడగా వెంట వచ్చిన వాడుకూడ నూతిలో పడును.
5. అరణ్య చంద్రికాన్యాయము = అడవిలో కాయు వెన్నెల (వ్యర్థము)
6. అరణ్య రోదన న్యాయము = అడవిలో ఏడ్పు వినెడి వారు, ఓదార్చువారు ఉండరు.
7. అహినకుల న్యాయము = పాము, ముంగీసల వలె సహజ వైరము.
8. ఆమ్ర వనన్యాయం = మామిడితోట యందు ఇతర చెట్లు ఉన్నను దానిని మామిడితోట అందురు.

9. ఊషరభీజన్యాయం = చవటి భూమిలో విత్తనములు చల్లిన మొలకెత్తవు.

10. ఓతప్రోతన్యాయం = పడుగు పేకలవలె ఒకదానితో మరొకటి కలసి మెలసి ఉండుట.

11. కదళీవంధ్యాన్యాయం = ఒక బిడ్డను కని గొడ్రాలైన స్త్రీని అరటి చెట్టువలె ఒక్కమోల వేసెనని వాడుదురు.

12. కరామలక న్యాయం = అరచేతిలో ఉసరికాయ (స్పష్టంగా కనబడును)

13. కాకతాళీయ న్యాయం = కాకి వచ్చినది తాటిపండు పడినది. కాకి దానిని అనుభవించినది. అనుకొనని మేలు కలిగినదని, అనుకొనిన కీడు ప్రాప్తించినను దీనినే వాడుదురు.

14. కాకి దంత పరీక్షా న్యాయం = కాకికి దంతములు ఉన్నవా లేవా? ఉండిన ఎన్ని ఉన్నవి? క్రింది వరుస ఎన్ని? పై వరుస ఎన్ని?

15. కాచమణి న్యాయం = గాజు ముక్క మణిని మించి ప్రకాశించును. వెలకు పరీక్షించినచో గాజుగాజే, మణి మణియే అగును.

16. కాకకంధ్యాన్యాయం = కాకి తన జీవితమున రెండు గ్రుడ్లు మాత్రమే పెట్టును. ఇరువురు బిడ్డలు కని పిమ్మట సంతానం లేని స్త్రీకి ఈ న్యాయం ఉపయోగింతురు.

17. కాకాక్షి న్యాయము = కాకికి ఒక కన్ను కనబడును. అది ఎటు చూచినను కన్నే కన్పించును.

18. కీల ప్రతికీల న్యాయం = గట్టి తనముకై ఇరువైపుల రెండు మేకులు బిగించుట.

19. కూపస్థ మండూక న్యాయం = నూతిలోని కప్ప ఆ నూతిలోని ప్రదేశం తప్ప ఇతరము ఎరుగదు. అంతేకాక సర్వ ప్రపంచం ఇదియే అని భావించును.

20. కూప యంత్రఘటకా న్యాయం = ఏతము (బొక్కెన) నూతిలోనికి పోవుచు వెంటనే పైకి వచ్చును. మనుష్యులకు హెచ్చు, తచ్చులు అట్టివియే.

21. ఘోటక బ్రహ్మచారి న్యాయం = మగ గుఱ్ఱము ఆడ గుఱ్ఱమును చూడకున్నంత వరకు మోహంచే బాధనొందదు. ఇక చూచినదా దానిని విడచిరాదు.

22. చాతకజీమూత న్యాయం = చాతక పక్షి స్వాతినక్షత్రంలో కురియు వర్షం నీరును ఆకాశంలో ఉండి త్రాగి, మరల స్వాతి నక్షత్రం వచ్చువరకు నీరు త్రాగదు.

23. జలాంతలి న్యాయం = పోయిన దానికై నీరు వదలుట.

24. జలాక్షరన్యాయం = నీటిపై అక్షరములు వ్రాయుట.

25. తక్రకాండిన్య న్యాయం = బ్రాహ్మణులందరికి పెరుగు వడ్డింపుము, కాండిన్యునకు మజ్జిగ వడ్డింపుము.

26. తద్ధితమూఢో వైయాకరణః న్యాయం = సామ్యాముగా వ్యాకరణం చదివిన వాడు సిద్ధాంతకౌముదిలోని తద్ధిత భాగం చదువడు, అందు మూఢుడై ఉండును. అది చదివిన వాడే వైయాకరణుడు.

27. తిల తండుల న్యాయం = నువ్వులు, బియ్యం కల్పిన విధము.

28. తిలాంజలి న్యాయం = నువ్వుల నీళ్లు వదలుట.

29. తృణాచ్ఛన్న కూప న్యాయం = గడ్డితో కప్పబడిన బావి గడ్డియే అని వెళ్లిన వారు నూతిలో పడుదురు.

30. దేవర న్యాయం = దేవరుడు, ఒక స్త్రీ భర్తయొక్క అన్న, అతని వంశం నిర్వంశం అగుచుండగా (భార్య చనిపోయినందున) దేవరుడు, తన తమ్ముడు కూడా చనిపోయినందున మరదలిని వివాహమాడి సంతానం కని వంశం నిలుపుట.

31. దేహళీదత్తదీప న్యాయం = గడుప, గుమ్మమున ఉంచిన దీపం లోనికి, వెలుపలికి ఒక్కసారే వెలుతురు ఇచ్చును.

32. ద్రవిడ ప్రాణోయామ న్యాయం = ద్రావిడులు ప్రాణాయామం చేయునప్పుడు ముక్కును సూటిగా పట్టుకొనక, చేతిని తలచట్టు త్రిప్పి పట్టుకొనెదరు. చెప్పే మాట సూటిగా చెప్పక త్రిప్పి - త్రిప్పి చెప్పుట.

33. నారికేళ ఫలాంబు న్యాయం = కొబ్బరకాయలోనికి నీరు తనంతట తానే వచ్చును.

34. నీరక్షీర న్యాయం = నీరు. పాలు ఐక్యంగా కలియుట.

35. పంగ్వంధ న్యాయం = గ్రుడ్డివాని భుజములపై కుంటివాడు కూర్చుండి ప్రపంచమంత తిరిగిరి.

36. పతంగద్వీపన్యాయం = మిడుత, దీపంను ఫలమని భావించి, మ్రింగబోయి దానిలో పడి చచ్చును.

37. పద్మపత్ర స్థితతోయ న్యాయం = తామర ఆకున నీటి బొట్టు.

38. పయోముఖ విషకుంభన్యాయం = పైన పాలు లోన విషమును కలపడము, మాట తీపి మనసు విషము.

39. పరిశేషన్యాయం = పరిశేషం అనగా మిగులు, రాజు మొదటి భార్య సాధ్వియనగా రెండవ భార్య విషయమై చెడ్డది అని అర్థమగును.

40. బకబంధన న్యాయం = కొంగను పట్టుకొనుటకు ఒకడు ఒక ఉపాయం చెప్పెను. కొంగనీటిలో తపం చేయునపుడు దాని తలపై వెన్న ముద్దను ఉంచి వచ్చినదో అది కరిగి దాని కన్నులలో పడును. అప్పుడు దాని కన్నులు కనపడవు. కావున సులువుగా పట్టవచ్చును.

41. బీజాంకుర న్యాయం = చెట్టుముందా, విత్తు ముందా? అను వితండవాదము.

42. భ్రమర కీట న్యాయం = భ్రమరం (తుమ్మెద) పచ్చ పురుగును తనలాగా మార్చును.

43. మజ్జనో దిన్మజ్జన న్యాయం = మున్గుట తేలుట.

44. మధ్య మణిన్యాయం = పర్వతం మధ్యగల మణి రెండు వైపుల కాంతినిచ్చును.

45. మర్కట కిశోర న్యాయం=కోతి తన పుట్టిన పిల్లను చెట్టు కొమ్మకు విసిరి కొట్టును. పిల్ల చెట్టు కొమ్మను పట్టుకొన్నచో దానిని పెంచును. లేనిచో చంపును.

46. మార్జాల కిషోర న్యాయం = పిల్లి తన పుట్టిన పిల్లను నోట పట్టుకొని ఏడిండ్లు త్రిప్పును, పోషించును.

47. మార్జాల క్రీడ న్యాయం = ఆడపిల్లి, మగపిల్లి క్రీడకు ముందు తగువులాడు కొనును.

48. మేషపుచ్ఛన్యాయం = మేకతోక ఎప్పుడు బెత్తెడే.

49. వజ్ర లేప న్యాయం = గట్టి తనముకై వజ్రాల దాపు.

50. వంధ్యా పుత్ర న్యాయం = గొడ్రాలికి బిడ్డ ఉండునా?

51. విహంగ న్యాయం = పక్షి ఎగిరిపోయిన విధమున పూర్వ జన్మకర్మ పరిపాకమున సత్వరముగా కర్మ బంధం నుండి ముక్తుడై ఎగిరిపోవును.

52. శవోద్వర్తన న్యాయం = పీనుగునకు నలుగు పెట్టుట.

53. శశవిషాణ న్యాయం = కుందేటి కొమ్ము.

54. శాఖాచంద్రమణ న్యాయం = కోతి ఒక కొమ్మ నుండి మరొక కొమ్మ మీదికి దూకును, అట్లే ఒక విషయంను ఉపన్యసింప మొదలు పెట్టి, దాని నుండి వేరొక దానికి, దాని నుండిమరొక దానికి పోయి మొదటి విషయం వదలి వేయుట.

55. శ్రోత్రియ విటి న్యాయం = ఒక శ్రోత్రియుడు వేశ్య వద్దకు పోగా, వేశ్య ఇతని పెదవిని ముద్దు పెట్టగా, అతడు అమ్మా! వేదాధ్యయనం చే శుద్ధి అయిన నా ముఖము ఎంగిలి చేయకుము. నీకు అంత ఇష్టం ఉన్నచో నా ఎడమ చెవిని కొరుకుము. ఉపనయన కాలంలో కుడి చెవిలో గాయత్రీ మంత్రోపదేశం చేసిరి. అందువల్ల కుడి చెవి పవిత్రమైనది అనెను.

**శ్లో॥ సామగాయన పూతంమే, నోచ్ఛిష్ట మధరేకురు।**
**ఉత్కంఠితా సిద్ధ్యద్రే, వామ కర్ణం దశస్వమే॥**

56. శ్వపుచ్ఛ న్యాయం = కుక్కతోక నిబ్బరంగా ఉండదు.

57. సర్పమంజూష మూషిక న్యాయం = పాముల పెట్టెలో తిండిలేక పాము మలమలమాడుచుండెను. తిండికై ఎలుక పాముల పెట్టెలో తినుభండారా లుంటాయని దానికి రంధ్రం చేసి లోనికి వెళ్లెను. తిండికై నక - నకలాడుచున్న పాము ఎలుకను తిని స్వేచ్ఛగా ఆ రంధ్రం నుండి బయటకు వెళ్లిపోయెను.

58. సితకాకూప న్యాయం = ఇసుకలో త్రవ్విన నూతి కూలిపోవును.

59. సుందోపసుంద న్యాయం = త్రిలోత్తమ అను వేశ్యకై సుందుడు, సుపసుందుడను వారు తమలో తాము పోరాడి చచ్చిరి.

60. సుప్రప్రబుద్ధ న్యాయం = నిద్రించి తర్వాత మేల్కొని వెనుకటి సంగతులు జ్ఞప్తికి తెచ్చుకుందురు. అట్లే మహనీయులు మరణించి, జన్మించి పూర్వ జన్మ వాసనను జ్ఞప్తికి తెచ్చుకొనినట్లు సర్వ విద్యా పారంగతులగుదురు.

61. సూచీకటాహ న్యాయం = చిన్న పనిని ముందొనరించి, పెద్ద పనిని తర్వాత చేయుదురు.

62. స్తనశల్య పరీక్షా న్యాయం = కామ భోగోపకరణములైన స్త్రీ స్తనములను గాంచి ఇందు ఎముకలున్నవా? అయినచో ఎన్ని ఎములున్నవి? ఎంతెంత

ఉన్నవని పరీక్షింపదగినవి కావు. అట్లే విద్య యందు ఎపుడు తప్పుల నెన్నక రసాస్వాదన మొనర్పదగు ఒప్పులనే గ్రహింపవలెను.

63. స్థాలీపులాక న్యాయం = వండిన అన్నంలో ఒక్క మెతుకు మాత్రమే పట్టి చూచెదరు.

64. స్థూలారుంధతి న్యాయం = మొదట స్థూల విషయంను చెప్పి తర్వాత సూక్ష్మ విషయంను చెప్పుదురు. సప్త ఋషులలో పెద్దవాడగు వసిష్ఠుని చూపి దాని దిగువన ఉన్న అరుంధతిని మిణుకు మిణుకు అనుచున్న సూక్ష్మ తారను చూపుదురు.

65. స్వకుచ మర్దన న్యాయం = తన చనులు తానే పిసుకొనుట ఆత్మ స్తుతికి బోల్తురు.

66. హంస క్షీర న్యాయం = నీరు, పాలు కలుపగా హంస నీటిని వదలి పాలను త్రాగును.

67. హంస బక న్యాయం = హంస హంసయే, కొంగ కొంగయే.

68. కైముక్తిక న్యాయం = ప్రధాన వ్యక్తిని చంపిన తర్వాత ఇతరులు తమకు తామే పారిపోవుదురు.

**శ్లో॥ గ్రద్ధోలూక బక ధ్వాంక్ష, సర్పాణాంచ సహస్రకం।**
**శ్యేన వానర భల్లూక, మండూకానాం శతత్రయమ్॥**

తా॥ గ్రద్ధ, గుడ్లగూబ, కొంగ, కాకి, సర్పమునకు వేయి సంవత్సరముల ఆయువు. డేగ, కోతి, ఎలుగుబంటు, కప్పకు మూడువందల సంవత్సరాల ఆయువు వుంటుంది. వాటిలో మన ఆయువు ఎంత? మనం అల్ప ఆయువులము. మనం అహంకారంతో విర్రవీగుతుంటాము.

ఓం శ్రీ సద్గురుభ్యోనమః

# శ్రీ దయానందగిరిస్వామి జాతకము

స్వస్తిశ్రీ రౌద్రినామ సంవత్సర మాఘ బహుళ పాడ్యమి బుధవారం తేది 23-2-1921 నాటి ఉదయాత్పూర్వము గం. 4-55 నిమిషములకు మకరలగ్నమందు మహారాజశ్రీ కల్లెం రాజారాంరెడ్డి గారి ధర్మపత్ని అఖండ లక్ష్మీ సౌభాగ్యవతి భూదేవమ్మకు కరీంనగర్ జిల్లా బెజ్జంకి మండలం నందలి గాగిళ్లాపురం (అనగా ప్రస్తుతం శ్రీస్వామి ఆశ్రమం గల గ్రామము)లో జన్మించారు.

వీరి జన్మ నక్షత్రము పుబ్బ, జన్మనామం టక్కాజి, ద్వితీయ చరణం, శుక్రమహర్దశ, సింహరాశి, రాశ్యాధిపతి రవి, గణము మనుష్య, షష్ఠమాంశ, అంశాధిపతిః బుధుడు, నాడి మధ్యనాడి, మూర్తిపాదము రజితము, యోని మూషకము.

**జన్మ అంశ కుండలీలు**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| కు శు | కే | | | | శు ల | | బు | కే |
| ర బు | మకరలగ్నం జన్మరాశి కుండలి | | | | | అంశకుండలి | | |
| ల | | | చం గు | | ర శ | | | |
| | | రా | శ | | రా | కు | గు | చం |

ఈ రాశి వారికి అధిపతి సూర్యుడు. ఈ రాశి యందు జన్మించినవారు సుందరులు. విశాలమైన వక్షస్థలము. కాంతిగల శరీరము కలిగి యుందురు. వీరు కడు ధైర్య సాహసములు కలవారు, ఉత్సాహవంతులు, గౌరవనీయులు, ఓర్మిగలవారిగ నుందురు. అందుచే వీరి ఆధ్యాత్మిక ప్రబోధములు అందరు ఇష్టపడుదురు. యధార్థవాదులు, ధారాళముగా, సరసముగా మాటలాడుదురు. దృఢ మనస్కులు, ఆత్మ శక్తిగలవారు. వీరు చేయు పనులకు ఆటంకములు, విఘ్నములు కలిగినను లెక్కచేయక పట్టుదలతో సాధింతురు. జ్ఞాపకశక్తి, వినయాది సద్గుణసంపత్తి వీరి సహజ స్వభావములు. దైవజ్ఞానం అధికముగా కలిగియుందురు.

# శ్రీ దయానందగిరిస్వామి పంచరత్నములు

1. భూదేవమ్మకు ముద్దు పుత్రుడయి, తా పుట్టింటి పూబంతియై
సాధిష్టంబను సన్నుతాగుండయియున్, సాధించు సంభూతియై
భూదేవంతటి ఓర్పు గల్గియును, తా భూతాత్మ సంప్రీతుడై
వాదంబేమియు లేని జాతకపు శ్రీవారిన్ గురున్ గొల్చితిన్॥

2. సిరులన్ దేలెడి శ్రీమతంబునగు, యీసీమన్ తెలంగాణలోన్
ధర గాగిల్లపురంబు నందు, గురు మాతంగ్రీ దయానందులున్
అరయం గొల్చెడి ధ్యాననిష్ఠయను, నీ ఆశ్రంబు నేర్పర్చియున్
పరగన్ యోగమె మార్గమంచు, మముతా పాలించ నర్థార్తియై॥

3. శ్రీమల్యాల యతీశ శిష్యవరు, శ్రీచిద్రూప భద్రాత్మతే
జోమూర్తిన్, కరుణాపరున్, సరళపూజ్యున్, ధ్యాననిష్ఠాయుతున్
శ్రీమౌనీంద్రుని, భక్తకోటి వినుతున్, శ్రీశ్రీశ్రీ దయానందులున్
నేమంబొప్పెడి నిత్యవర్ధనుని, మా నిత్యాత్మునిన్ గొల్చెదన్॥

4. సంతుష్టాత్ముడు, యోగివంద్యుడును, మా సంస్కార సంవర్ధివే
దాంతుం, డుజ్జ్వల కీర్తిదీప్తుడును, తాన్ ధర్మిష్ఠి సంతోషి, యీ
ప్రాంతంబంతట భక్తి భావమున, సంప్రాప్తిన్ తపోనిష్ఠలం
దెంతో శ్రేయము జూపి, యోగసుధలం దేల్పించు ముక్త్యర్థియై॥

5. సామిలు బారుచున్న తొలి పాలన నాశ్రమమందు మీరల
స్వాముల లెక్కజేయుకను భావన యీశుని ధ్యానమందునన్
పామర దీనమానవుల బాంధవుడై సుజనాళి కెంతయో
నోముల పంట యంచు నిను నోట వచింపగ వచ్చు సద్గురూ!

– శ్రీ పదాల కనకయ్య
ఎస్.ఐ.టి.సి.సి.
కాకతీయ మెడికల్ కాలేజి, వరంగల్.

శ్రీ శారదాయైనమః

# గురుస్తుతి

సీ. ఒగులాపురము నందు ఒనరగ జనియించి
గాగిళ్ళపురమున ఘనతకెక్కి
వాగీశసముడైన వ్యాసపీరస్థుడౌ
మలయాళస్వామిని మదిన నిలిపి
రోగ హేతువులైన రాగభోగమ్ముల
త్యాగనిరతి తోడ తరిమివైచి
ఆధ్యాత్మికతకిల ఆటపట్టై నిలచి
ఆర్తుల దరిజేర్చి కీర్తిగాంచి

తే.గీ.॥ దయకు తావయి వెలసిన దాతనీవె!
మలయ పర్వత సన్నిభ మహితయశుడ!
చలము వీడగనిన్ గొల్తు జాలమేల?
గాగిళ్ళాపుర వాస శ్రీ యోగిరాజ!

సీ॥ భక్తియుక్తుల బంచి భద్రత బెంచితి
నీదు భక్తాళికి నిగమవేద్య!
జపతపంబులతోడ జన్మరాహిత్యపు
దోవనే జూపితి తోయజాక్ష!
యమనియమము తోడ శమదమము నణచి
క్షమతనే నేర్పిన కరుణరూప!
నీమాటె మంత్రమై నిలచితి నీమ్రోల
నిరుపమ యతిరాజ! నీకు జయము

తే.గీ॥ నీదు భృత్యుల భృత్యుడ నిరుపమాన
నీవు చూపిన బాటన నియతితోడ
నడచు ప్రజ్ఞ ప్రసాదించు నతుడనాదు
వందనమ్మందుకో దయానందస్వామి!

– శ్రీ మడిపల్లి భద్రయ్య
విశ్రాంత ప్రధానోపాధ్యాయులు
నిర్మల్, సెల్ : 9885830550

# శ్రీదయానందగిరిస్వాములవారి స్తుతి పద్యములు

ఉ॥ శ్రీపరమేశ్వరాంశభవ! శిష్యజనార్చిత పాద పంకజా!
పాపలతా లవిత్ర! కవి పండితసఖ్య! యశోవిశాల! చి
ద్రూప! సమస్తసాధు జనతోష! పవిత్ర చరిత్ర సూనృతా
లాప! జగద్ధితా! సుజనరంజక! భక్తహృదబ్జ షట్పదా! ॥

ఉ॥ ఆశ్రమముల్ గనుంగొని మహాత్ముల దర్శన భాగ్యమొంది వ్యా
సాశ్రమ మందు జేరి మలయాళ మహర్షికి శిష్యరత్నమై
ఆశ్రిత భక్తకోటికి సహాయ్యము చేయదలంచి ధ్యాన ని
ష్ఠాశ్రమ మొందు నిల్పిన దయామయ! సద్గురు! నీకు మ్రొక్కెదన్॥

చం॥ వ్రతములు, పూజులుం, జపతపంబులు, యాత్రలు, దానధర్మముల్
క్రతువులు మున్నుగా గల సుకర్మల నెల్ల నొనర్చు చుండి శి
ష్యతతిని నుద్ధరించుచు విశాల యశో విభవంబుచే సమం
చిత పథ వర్తనంబున వసించుచు నుంటివి దేశికోత్తమా॥

ఉ॥ సత్సభలున్, మహాత్ముల ప్రశస్త వచాన్విత గోష్ఠులున్, జయం
త్యుత్సవ కార్యముల్, సుజనయుక్త సదస్సు లొనర్పజేయుచున్
మత్సర భావమున్విడిచి మంజు చరిత్రుడవై యనేకమౌ
యుత్సవముల్ పొనర్చుచు నహో! విలసిల్లుచు నుంటి విద్ధరిన్॥

ఉ॥ సుందర యుక్త విగ్రహ! విశుద్ధ గుణాంచిత చిత్త! శ్రీదయా
నంద యతీంద్ర! తాపస జన ప్రముఖాళి విధేయ! సత్ప్రజా
వందిత పాద పంకజ! కృపారస! నాదుడెంద మా
నందము నొందు నట్టుల నొనర్చుము జ్ఞానపు దివ్వెజూపుచున్॥

-శ్రీ దేవత వేంకటరాములు
రిటైర్డ్ తెలుగు పండితులు
సిరిసిల్లా, కరీంనగర్ జిల్లా.

ఓం శ్రీసద్గురుభ్యోనమః

శ్లో॥ శ్రీ ధ్యాననిష్ఠాశ్రమ పుణ్యభూమేః, కుర్వంతి భక్తా రజతోత్సవంహి।
యస్యాందయానంద యతిర్గుణాఢ్యః, సర్వాధికారీ సతతం చకాస్తే॥

– శ్రీశ్రీశ్రీ విద్యానందగిరిస్వాములవారు, శ్రీవ్యాసాశ్రమము

## దయగల హృదయమే భగవన్నిలయము

సీ॥ బహుజన్మ సుకృత ఫలము పండినదేమొ
బాల్య వైరాగ్య శ్రీభాగ్యమబ్బె
భోగభాగ్యము లందు బుద్ధి పోవదెపుడు
తత్త్వచింతన మందు దగిలెబుద్ధి
వినయమ్ముతో వేద విద్య సభ్యసించ
గర్వమన్నది మిమ్ము గాంచలేదు
సద్గురు పదమును సత్యదృష్టితో బట్టి
సద్గురు మూర్తివై చాటినావు

తే.గీ.॥ సర్వజన సమ్మతంబు ఆచరణ మీదు
వాక్కులవి యెంతయో తపోవాక్కులయ్యె
మీదు నామంబు శ్రీదయానందగిరిస్వామి
శాంతి నొందెను హృదయంబు సంతసించె॥

– శ్రీ సాధు శాంతిబాయమ్మ
సాధుస్త్రీల మఠం
రాజమండ్రి

ఓం తత్సత్

# శ్రీ దయానందగిరిస్వామి శ్లోక మఞ్జరీ

1. చాతుర్మాస్య వ్రతస్నాతం, గ్రామే వేల్పూరు నామకే।
భక్తై స్సంవేష్టితం వందే శ్రీదయానందదేశికమ్॥

2. రామాయణ సమాఖ్యానై ర్గీతైర్భాగవతైస్సదా।
రంజ యంతం నమస్యామి శ్రీదయానందదేశికమ్॥

3. బ్రహ్మచర్య వ్రతాబద్ధం యత్యాశ్రమ విరాజితమ్।
సాధు భిస్సేవితం వందే శ్రీదయానందదేశికమ్॥

4. స్వరే గంభీరతా యస్య వపుష్యాభ్యున్నతం సమమ్।
సచ్ఛీలం తం నమస్యామి శ్రీదయానందదేశికమ్॥

5. స్నానం జ్ఞాన జలైర్యస్య భోజనం రామనామభిః।
నిద్రా యోగేన తం వందే శ్రీదయానందదేశికమ్॥

6. అసంగానంద శిష్యాణా మేకం సద్గుణ సంపదా।
వైరాగ్య వారధిం వందే శ్రీదయానందదేశికమ్॥

ఏవం
సద్గురు శ్రీమలయాళ యతీంద్రపాదరేణుః
శ్రీ ద్వారకా కృష్ణమూర్తిః
వేల్పూరు, పశ్చిమగోదావరి జిల్లా
ఓం తత్సత్

